ఆంధ్రప్రచారిణీగ్రంథమాల. ౪౮.

# యోగేశ్వ

(మొదటిసంపుటము.)

(శ్రీదామోదర ముఖోపాధ్యాయుని వంగభాషాగ్రంథమునుండి)

శ్రీ పులుగుర్త లక్ష్మీనరసమాంబగారిచే

ఆంధ్రీకరింపఁబడినది.









ప్రకాశకులు.

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు.

ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,

పిఠాపురము.

1927

వెల రు ౧-౪-౦.

# కృతిసమర్పణము



పరమయోగేశ్వరీభావభావుకమైన జీవనముచే వంశపావనముగావించి, సతీలోకమున కతులితాదర్శమగు కీర్తికాయముచే భువనాలంకారమైన సౌభాగ్యదేవతా—నామాతృదేవత

చింతలపూడి అగ్గమ్మగారికి

ఈయోగేశ్వరిని సమధిక భక్తిపూర్వకముగ సమర్పించుకొంటిని

ఇట్లు

పులుగుర్త లక్ష్మీనరసమాంబ

## పోషకులు

IV

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు పి. పరాంకుశము నాయఁడుగారు, రిటైర్డుస్పెషల్ పోలీసుకమీషనరువారు; చెన్నపురి.

" శ్రీ అర్జి వెంటయ్యగారు, నరసాపురము.

" శ్రీ టి. యల్. నరసింహారావుగారు, మారుటేరు.

" శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.

" శ్రీ పులగం వేంకన్నగారు, మారుటేరు.

---

## సహాయులు

మ. రా. శ్రీ ఉదయరాజు వేంకటరంగారావుపంతులుగారు, దేశముఖ్ సర్ దేశపాండ్యా, మటేవాడ, ఒరంగల్లు. (దక్కన్.)

" శ్రీ నేరెళ్ల నరసింహరాములుగారు, కలపవర్తకులు, ఒరంగల్లు, (దక్కన్.)

" శ్రీ గుండా పుల్లయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు, (దక్కన్)

" శ్రీ ద్వారంపూడి వేంకటరెడ్డిగారు, అనపర్తి.

" శ్రీ పాళ్యపు వేంకటాచలపండితులుగారు, ప్రొప్రయిటరు, శ్రీ సీతారాఘవవైద్యశాల, మైసూరు.

" శ్రీ పిజల సుబ్రహ్మణ్యంచెట్టిగారు, వర్తకులు, నె 91 అన్నపిళ్లవీధి, జి. టి., మదరాసు.

" శ్రీ గిరిధి హనుమంతరావుగారి కుమారులు రామారావుగారు, వర్తకులు, అనకాపల్లి.

# రాజపోషకులు

మ. రా. శ్రీ శ్రీరాజా వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మ జగపతి బహద్దరు జమీందారిణీవారు, తుని.

# పోషకులు

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, కాకినాడ.

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపురము.

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ దోర్బిణారాజు వేంకటరమణారావుపంతులుగారు, ముఖాసాదారు, తణుకు.

,, శ్రీ బందా సూర్యనారాయణపంతులుగారు బి.ఏ.యల్ టి. తణుకు.

,, శ్రీ పండాప్రిజు వీరాప్రిజుగారు, కాకినాడ.

,, శ్రీ కొవ్వూరి వేంకట రెడ్డిగారు, పిట్టలవేమవరము.

,, శ్రీ కర్రి పల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ తేతల గంగిరెడ్డిసోదరులు, పెనుకొండ.

# ప్రధానపోషకులు.

2 5 9

మ. రా. శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావుపంతులుగారు, ప్రొప్రయిటరు, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ.

## రాజపోషకులు

మ. రా. శ్రీ శ్రీమంతు శ్రీరాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాద్ బహద్దరు బి. ఏ. గారు, చల్లపల్లిరాజాగారు, చల్లపల్లి.

,, శ్రీరాజా ఇనుగంటి వేంకట సూర్యప్రకాశరావుగారు.

,, శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

,, శ్రీ కొవ్వూరి సూర్యనారాయణ రెడ్డిగారు, జమీందారు, కాకినాడ.

,, శ్రీ కర్రి చినవేంకటరెడ్డిగారు, మర్చంటు, కాకినాడ.

,, శ్రీ ముత్యాల సుబ్రహ్మణ్యముగారు, రంగూన్.

,, శ్రీ వనచర్ల సత్తెయ్యగారు, రంగూన్.

,, శ్రీ బత్తుల బసవయ్యగారు, రాజమండ్రి.

,, శ్రీ ఆకారపు వెంకన్నగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ ఆకారపు చెన్నయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ వెలగల గోవిందరాజుగారి కుమారులు వేంకటరెడ్డిగారు, ఇతిహాసతరంగిణీ గ్రంథమాలా సంపాదకులు, ఆరపల్లి.

శ్రీరామచంద్ర.

# యోగేశ్వరి

ప్రథమఖండము—ఆలోకము.

మొదటిప్రకరణము.



## దర్శనము.

శ్రీయుత నీలరత్నచట్టోపాధ్యాయమహాశయుఁడు బహునిపుణ
తి; ఏఁబదివత్సరములకుఁ బైఁబడినవయసుగలవాఁడు. దురభ్యాసము
ను, దురాచరణములును లేకపోవుటచే నాతనిశరీరము సుదృఢమై
ాంతిమంతమై యుండెను.

ఆతఁడు తనవిద్యాబలముచేతను, బుద్ధిబలముచేతను విశేషధనము
ార్జించి ప్రస్తుతము కుటుంబసహితముగాఁ గాశీనివాసముచేయుచుం
ను. ఆతనితో నాతనివితంతుసోదరి—"కాళీతార"యు, గుణవతియుఁ
తిపరాయణయునగు నాతనిభార్య "ఆనందమయి"యు, ఆతనియేకపు
త్రిక "అన్నపూర్ణ"యు నుండిరి. వీరుగాక దాసదాసీజనలు, ఆశ్రితులు,
ప్రతిపాలితులు ననేకు లాతనివిశాలభవనమున నుండియుండిరి. కాశిలోని
శాశ్వమేధఘట్టమునకు సామీప్యమునం దాతనిభవన ముండెను.

దాదాపుగా జాముప్రొద్దెక్కినది. నీలరత్నబాబు స్నానముచేసి దేవ
ాజానుష్ఠానములఁ బ్రవేశించుట కుద్యుక్తుఁ డయ్యెను. ఆతనిసోదరికాళ

తారపూజాద్రవ్యాదికముల సంసిద్ధము గావించుచుండెను. పతిపరాయణయైనయానందమయి పూజానంతరము తనపతికి భోజనాదికము లొసంగుపనులలో, నిమగ్నయై యుండెను. అన్నపూర్ణ గృహమధ్యమునందలి తనపఠనమందిరములోఁ గూరుచుండి రామాయణముఁ బఠించుకొనుచుండెను.

వీథిగుమ్మమునుండి యొకయువకునికోమలకంఠస్వరమున సుందరమధుర సంగీతరవ మొకటి బయలుదేఱి యాకస్మికముగ నింటిలోనున్నవారికర్ణరంధ్రములఁ బ్రవేశించెను. అందఱును దమతమపనులను మఱచి యెచ్చటివా రచ్చటనే నిలిచి యామనోహరగానరసము నాస్వాదింపఁజొచ్చిరి. శాలినియైనయన్నపూర్ణ తనరామాయణగ్రంథమును మూసి వీథిగుమ్మమువంకకుఁ జని చరనడచుచు నిరతిశయానందముతో సంగీతశ్రవణము చేయఁజొచ్చెను. గాయకుఁడుగాన మొనరించుచుండెను. పాట సమాప్తమైనది. అన్నపూర్ణ గాయకునిసమీపమునకేఁగి "నీవీపాట నెచ్చట నేర్చికొంటివి?" అని ప్రశ్నించెను.

గాయకుఁడు—నేను పాటపాడికొనుచు బిచ్చ మెత్తికొనుచుందును. ఏపాట యెవ్వరియొద్ద నేర్చికొంటినో చెప్పఁజాలను. ఈపాట మాగురుదేవునిదగ్గఱ నేర్చికొన్నట్లు జ్ఞప్తిలోనున్నది.

అన్నపూర్ణ—నీవు భిక్ష మెత్తికొందువా? నిన్నుఁజూచిన భిక్షుకుఁడని యెవ్వరు ననుకొనరు.

గాయకుఁడు—అన్నిసమయములందు నాకారమునుబట్టి న్నియు నిశ్చయింపఁబడవు. నేను నాజ్ఞానమువచ్చినది మొదలు నేఁటివఱకును బిచ్చమే యెత్తికొనుచున్నాను.

అన్నపూర్ణ—నీకేమికావలయును?

గాయకుఁడు—దయచేసి యెవ్వరే మొసఁగినను సరియే.

అన్నపూర్ణ—నిలువుము, నేనిప్పుడే వచ్చెదను; అమ్మకును నాన్న గారికిని నీమాట చెప్పివచ్చెదను. నీవెక్కడకును బోకుము.

భిక్షుకుఁడు తలయూఁచి అన్నపూర్ణయాజ్ఞను శిరసావహించినట్టు తనసమ్మతిని దెలియఁబఱిచెను. అన్నపూర్ణ ద్రుతగమనముతో లోనికరిగెను.

అన్నపూర్ణ చెప్పినది సత్యమే. భిక్షుకుఁడు నిజముగా నొకరాజకుమారునివలె నుండెను. ఆతనిసుస్నిగ్ధనీలోజ్జ్వలకుంచితకేశరాశి కటిసీమవఱకు వ్రేలాడుచుండెను. ఆతనిసమున్నతలలాటము విభూతిరేఖాసమాచ్ఛన్నమయ్యును ఆతనిబుద్ధివిశేషమును వెల్లడిచేయుచుండెను. ఉజ్జ్వలప్రశస్తనేత్రములును, పాటలకాంతిభాసురములైన కోమలాధరోష్ఠములును, సూక్ష్మాగ్రశోభితమగు సుందరనాసికయు, సహార్ద్రశోభాకరములై యలరారుచుండెను. వదనమండలము స్నేహాసమ్మోదసముద్భాసితము. విశాలవక్షము రుద్రాక్షతులసీమాలాలంకృతము; శుద్ధయజ్ఞోపవీతసుశోభితము. దేహము తప్తకాంచనసముజ్జ్వలగౌరవర్ణసమన్వితము. ఆతఁడొక కాషాయాంబరమును బరిధానముగ ధరించి మఱియొక కాషాయవస్త్రము నెడమభుజముపైనుండి కుడిభుజముక్రిందికిఁ ద్రిప్పి ముడివైచికొని యుండెను. ఆతనిమస్తకమునఁ దొకరుద్రాక్షమాల యుష్ణీషమువలె నొప్పారుచుండెను. ఆతనివయసు పదునెనిమిదివత్సరములకుఁ బైఁబడనట్లు తోఁచుచుండెను. ఆతనియవయవములు సముచితపరిణతములై సుసంబద్ధములై శక్తిసంపన్నములై ప్రకాశించుచుండెను.

గాయకుఁడు మోమువంచికొని వీథిగుమ్మములోఁ గనిపెట్టుకొని యుండెను; అన్నపూర్ణయు లోపలినుండి వేగముగనే తిరిగివచ్చెను. ఆమె యప్పుడు గాయకుని కతిసామీప్యమున నిల్వఁబడి యిట్లనియెను—"నీవు మాయింటిలోనికిరమ్ము! నాన్నగారు, అమ్మ, అత్తయ్య నిన్నుఁజూడవలె ...చున్నారు."

గాయకుండు—అంతఃపురములోనికింబోయి భిక్షుగొనవలదనాఁగున దేవుఁ డాజ్ఞ దయచేసెను. మీతల్లిదండ్రులు మొదలైనవారికి హృదయపూర్వకముగ ననేకవందనము లర్పించుచున్నాను. నాయందు దయఁగలిగి నీవేమైనఁబెట్టఁదలంచిన నిచ్చటికే తెచ్చిపెట్టి నన్నుఁ గృతార్థునిఁ జేయుము.

అన్నపూర్ణ మోము చిన్నవోయెను. ఆమె కాతరభావముతో "ఇంటిలోనికి రాఁగూడదా? నిన్నుఁ దీసికొనివచ్చెదనని చెప్పివచ్చితిని. పోనిమ్ము; నీయిష్టమువచ్చినట్లే చేయుము. నీనియమమునకు భంగము తేఁగూడదు. నేను మరలవచ్చెదను. ఈమాటు నీకు భిక్ష దీసికొనివచ్చెదను; నీవెక్కడికిని బోవలదుసుమా." అని లోనికరిగెను.

అన్నపూర్ణ మరల వెనుదిరిగి పోఁజొచ్చెను. భిక్షుకుండు సంతుష్టనయనములతో నన్నపూర్ణ నాలోకించుచు నిల్వఁబడియెను. "ఆహా! ఇంతమాధుర్యము నింతకుమునుపు మఱియెక్కడను నేఁజూచియుండ లేదు" అని మాత్రము లోలోన భావించుకొనఁజొచ్చెను, యువకభిక్షుకుని యీసిద్ధాంత మమూలకమైనదికాదు. నిజముగా వృద్ధులుగాని, యువకులుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని, యెవ్వరెప్పుడు, అన్నపూర్ణను జూచినను "ఆహా! ఏమియీయపూర్వదృశ్యము!" అని విస్మయావిష్టులగుచునే యుండిరి. అన్నపూర్ణ బాలిక; పదిదాఁటి పదునొకండవవత్సరముజరుగుచున్నది; ఇప్పటికిని అన్నపూర్ణ కేవలచంచల బాలికయే. అన్నపూర్ణ చంచలగతులు, వ్యస్తభావములు, మిక్కిలిమాధుర్యములు. అన్నపూర్ణ సర్వాంగసుందరి; ఆమెశరీరమునం దెక్కడ నేలోపమును లేదు. అన్నపూర్ణయవయవము లొక్కటికంటె నొకటి సౌందర్యశోభాపరిపూర్ణములే. అన్నపూర్ణ తల్లిదండ్రుల కేకపుత్రిక; ఆమె మిగులగారాబమునఁ బెంపఁబడుచుండెను. ఆమె సకలసుఖముల కధీశ్వరియై యుండెను. ఆమె హాయిగను జదువను నేర్చియున్నది; కాని, కుత్సితములును గుమార్గప్రవర్తకములు నగు నేపుస్త

కములుగాని యామె యెప్పుడును జదువదు. రామాయణము, భారతము మొదలగు ధర్మోపదేశపూరితములైన పుస్తకములే యామె కభిమానపాత్రన గ్రంథములు. వంచన, వక్రత యనునవి యామె యెఱుఁగనే యెఱుఁగదు.

అన్నపూర్ణ కింకను వివాహము కాలేదు. పెండ్లియీడు మీఱుచున్నదని యెఱింగియుండియు నామె ప్రియజనకుఁడు, తగినవరుఁడు లభింపకుండుటచే నామెకు వివాహము చేయుటకుఁ దొందరపడుట లేదు. భగవంతుని యందే యాయన తన భారమంతయు నుంచియుండెను. మానవుని కర్తృత్వాభిమానము మిక్కిలి యసారమైనదని యాతని యనుభవసిద్ధాంతము. మన కెప్పటి కేమి కావలయునో భగవానుఁడే సమకూర్చుచుండునని యాతనికిఁ గేవలము విశ్వాసము గలదు. ఈవిధముగా భగవానుని నియంతృత్వముమీఁదనే తన యంతరంగమంతయు నిల్పి, కన్యావివాహకాల మతిక్రమించుచుండుటఁ జూచుచుండియు చట్టోపాధ్యాయ మహాశయుఁడు విశేషముగా నుద్వేగముఁ బొందకుండెను.

అన్నపూర్ణ తిరిగివచ్చుట కాలస్యమగుటఁ జూచి భిక్షుకుఁడు మఱల గానమున కారంభము చేసెను.

ఈమా ఊా సంగీతరవము నాల్గుదిక్కులకును మధురామృతరసముఁ గురియ మొదలుపెట్టెను.

పాట ముగించునప్పటికి అన్నపూర్ణ యలౌకికమూర్తి యాదరిద్ర భిక్షుకుని కన్నుల యెదుటఁ బడియెను. కాని, యీమాఱు అన్నపూర్ణ యొక్కతెయు రాలేదు. నాన్నను, అమ్మను, అత్తయ్యను గూడ నామె వెంటఁ బెట్టుకొని వచ్చెను. ఆమె వెనుక నొకదాసి పెద్దపళ్ళెరము నిండఁ దెల్లని సన్నబియ్యముఁ గూరలు పప్పుదినుసులుఁ బట్టుకొని వచ్చుచుండెను. మఱియొకతె నేయి, నూనె, చింతపండు ఉప్పు మున్నగు నుపకరణములను దెచ్చుచుండెను. అన్నపూర్ణ చేతిలో నొకమంచి దోసతులచాపున, రెండురూప్యములు నుండెను.

నీలరతనబాబు, ఆనందమయి, ఆమె యూరంపుబిడ్డ, దూరమునం డే యాభిక్షుకుని యావనశోభితమస్తకమునకు నమస్కరించుచు దగ్గఱకువచ్చి రి. వారందఱు భిక్షుకుని సమీపించి మరలఁ బ్రత్యేకప్రత్యేకనమస్కా రము లొనరించియాశీర్వాదము లొందిరి. ఆభిక్షుకుని కమనీయకాంతిని ఆయుష్మాన్వశ్రీని జూచి వారందఱుస్నేహార్ద్రలోచనులైరి. నీలరతనబాబు భిక్షుకుని పరిచయమున వాంఛించి మొట్టమొదట "స్వామీ ! మీనామధే యమేమి?" అని యడిగెను.

భిక్షుకుఁడు——ఉమాశంకరుఁడందురు.

నీలరతనబాబు——మీనివాస మెక్కడ?

భిక్షు——గురుదేవుఁడైన ఘనానందస్వామియాశ్రమమే నానివా సస్థలము.

భిక్షుకుఁడు తనపూర్వవృత్తాంతమును దా నెఱుఁగఁడు. ఆతనితల్లిదం డ్రులెవ్వరో ఆతనిపూర్వనివాస మెక్కడనో మొదలగుసమాచారము లాతఁడేమియుఁజెప్పఁజాలఁడు. శాస్త్రాలోచనము, గురుదేవుఁడు, ఉపదేశా నుసారమైనయనుష్ఠానము, భిక్షాసంగ్రహము, ఇంతకంటెనాతనికిమఱి యొకసంగతి తెలియదు. గురుదేవునికంటె నాతని కాత్మీయులుమఱియొక రు లేరు.

అన్నపూర్ణ భిక్షుకుని వెంట నరిగి, తండులాదికముల నాతనియా శ్రమమునం దుంచిరమ్మనితనదాసీజనమునకాజ్ఞయిచ్చి, తాను వస్త్రము లను, రూప్యములను స్వయముగా నిచ్చుటకై యాతనిసామీప్యమున కేఁగెను.

ఉమాశంకరుఁ డప్పుడు కరములు ముకుళించుకొని యానంద మయివంకఁ జూచుచు "అమ్మా ! కావలసినదానికంటె నధికముగ భిక్షగొనుటకు మాగురుదేవుని యాజ్ఞ లేదు. మీరిప్పుడు నాకొఱకుఁ దెచ్చిన యీవస్తువులు పదునేను దినములవఱకును సరిపడునవిగా నున్న

వి. రెండుదినములకు సరిపోవు భిక్ష గైకొనుటంగూడ మాకు నిషేధము. కావున, దయయుంచి నాకొక యరసేరు బియ్యము, దానికిం గావలసిన వించుకించుక తక్కిన పదార్థములు దయచేయుము. నీవు దయతోం దెచ్చిన తక్కినపదార్థ మంతయు నేభిక్షుకులకైనం బ్రసాదింపుము. అమ్మా! ధనభిక్ష మేమెంతమాత్రమును గైకొనరాదు. వస్త్రములు గైకొనుట నిషేధము లేదుగాని, అవియును బ్రయోజనము లేకుండం బుచ్చుకొనం గూడదు. నాకిప్పుడు వస్త్రములు గలవు. కావున, వలయు నప్పుడు వచ్చి వస్త్రములను గోరెదను." అనిచెప్పెను.

నీలరతనబాబు——స్వామీ! మీకు నియమభంగ మగునట్టులు మిమ్ము బలవంతపెట్టంజాలము; ఈపదార్థములలో మీకావశ్యకము లైన వానినిం గైకొనవలయును.

ఉమాశంకరుండు మరల వినీతభావముతో నిట్లుత్తర మిచ్చెను. "స్వహస్తములతో భిక్షాద్రవ్యము నెత్తికొనుట మాకు నిషేధము. మీరు దయచేసి యిచ్చెడు పదార్థముల నాసంచియం దుంచవలయును."

కాళీతార——బాబూ! నీవు శాపభ్రష్టదేవతవలె నున్నావు.

ఉమాశంకరుండు——అమ్మా! మీచరణదాసుండను.

ఆనందమయి——మంచిదినాయనా! మీ రీ సామాన్యభిక్షకొఱకు దినదినము నొక్కొకయింటికిం బోవలయునా? దయయుంచి ప్రతిదినమును మాగృహమునందే భిక్ష గైకొనుచుండవలయును.

ఉమాశంకర——ఇందులకు నేనంగీకరింపంజాలను. తల్లీ! ప్రతిదినము నొక్కగృహమునందే భిక్షం గైకొనుటయు మాకు నిషేధము.

ఆనందమయి——నాయనా! మీరు నన్ను "అమ్మా!" యని పిలుచుచున్నారు, అమ్మమాట జవదాటకుండుట పుత్త్రుల ధర్మము గాదా! ఈపుత్త్రుని బ్రతిదినమును జూచుచుండవలయునని యీయమ్మ

కోరుచున్నది. మీరు మాయింట దినదినము భిక్షఁగొనినను గొనకున్నను ఒక్కమాఱు వచ్చిపోవుచుండుట కభ్యంతర ముండఁగూడదు.

ఉమా—అమ్మా! ప్రతిదినము రాఁజాలకున్నను దఱచుగ మాత్రము మీగృహమునకు వచ్చుచుండుటకుఁ బ్రయత్నించెదను. నియమితకర్మముల నెఱవేర్చుకొని యవకాశము లభించినపుడెల్ల మీశ్రీచరణదర్శనమునకు వచ్చుచుందును. నేఁటికి సెలవు దయచేయవలయును.

అన్నపూర్ణ—రేపు తప్పక రావలయును.

ఉమాశంకరుఁడు "రాఁగలను" అని చెప్పి యందఱకుఁబ్రణామము లర్పించి, స్వల్పభిక్షను గ్రహించి వెడలిపోయెను.

## రెండవప్రకరణము.

### గురుశిష్యులు.

మధ్యాహ్నము రెండుజాములు దాఁటినది. ఘనానందస్వామి యాశ్రమమున నుమాశంకరుఁడు పాఠములభ్యసించుచుండెను. మూర్తిమంతమైనజ్ఞానస్వరూపమువలె ఘనానందస్వామి యొకకుశాసనమునం దుపవిష్టుఁడై యుండెను. అతనిపార్శ్వమునందుఁ గుండములో నగ్ని ప్రజ్వరిల్లుచుండెను—సమ్ముఖమందుఁ గొన్ని తాటియాకుపుస్తకములుండెను. ఆతనిసర్వాంగములు విభూతివిలేపితములు—మస్తకమున ఘనజటాజూటము. కటిసీమఁ గౌపీనము; హస్తమునం దొకకమండలు వుండెను. ఆతనిదేహము సుదీర్ఘము; బాహుద్వయ మాజానులంబితము; నేత్రయుగళ మసమానోజ్జ్వలము; ఆతనిశరీర మంతయుఁ గృశించి యుండెను. ఆయన సమీపమునం దొకమృగాజినముపై భువనమోహనుఁ డగు నుమాశంకరుఁడు గూరుచుండి యేకాగ్రచిత్తముతో నాగురుదేవుని శా

స్త్రోపదేశము లాలకించుచుండెను—బ్రహ్మసూత్రములం దృతీయాధ్యాయమునందలి చతుర్థపాదములోని మొదటి కొన్ని సూత్రములందుం బూర్వపక్షమవలంబించి, భగవానులగు శంకరాచార్యులవారు కర్మకంటె జ్ఞానము శ్రేష్ఠమైనదని ప్రతిపాదించిన దానికి వ్యాఖ్యానము చెప్పంబడుచుండెను.

పాఠములు సమాప్తములైనతరువాత, నుమాశంకరుండు వినయభావముతో నీలరతన బాబుగృహమునకుం దానుభిక్షకుంబోవుట మొదలగు నక్కడ జరిగినసమాచారము నామూలాగ్రముగా గురుదేవునిసన్నిధిని నివేదించెను.

అన్నియు నాలకించి ఘనానందస్వామి "మంచిది. ఈవ్యాపారము వలన నీకార్యములన్నియుం జక్కంగా సమకూరంగలవు. సరియే; మా సందర్భమునం దింకేమైనం జెప్పవలయునని నీకు గోరిక కలదా?" అనియెను.

ఉమాశంకరుండు—స్వామీ! నేనెప్పుడెప్పుడు వారిగృహమునకు వచ్చుచుండుటకు వారికష్ట సమ్మతించియున్నాను. ఈసంబంధములోం బ్రభుసమ్మతి మెట్లుండునో తెలియంగోరుచున్నాను.

ఘనానంద—నీలరతనచట్టోపాధ్యాయుని బాగుగా నెఱుంగుదును. ఆతండేకాక ఆతనికుటుంబమువా రందఱును జ్ఞానార్థులు; కర్మనిష్ఠులు. నాయనా! నీకు, అనేకశాస్త్రములు, ననేకక్రియలు నభ్యసింపంజేసియున్నాను. అభ్యాసబలమువలనను, గాలానుకూలతచేతను నీవు విశేషకార్యసిద్ధిని బొందితివి. అందుకు నాకెంతమాత్రమును సందేహములేదు. నీవు పసితనమునుండియు మా యాశ్రమమునందే పాలింపంబడితివి; గృహస్థాశ్రమనియమములను, ఆస్వభావములను దెలిసికొనుటకుం దగినయానుకూల్యముగాని యవసరముగాని నీకింతవఱకును లభింపలేదు;

కాని, ఆసంబాధములో నీకించుక యెఱుక గలుగవలయుననియే నాయభిప్రాయము. సజ్జనులైన గృహస్థులతో రాకపోకలు జరుపుచు గృహస్థవ్యవహారజ్ఞానమును సంపాదించుట యుచితమే. అందుల కనుకూలస్థితి సంఘటించినందులకు నాకానందముగ నున్నది. నీకు సమ్మతమైనప్పుడు, నీకవసరముగల్గినప్పుడు నీలరతనబాబు గృహమున కరుగుచుండవచ్చును.

ఉమాశంకరుండు—"స్వామీ! నీలరతనబాబుసహధర్మిణియు సహోదరియు నత్యంతదయామయులు; వారు పుత్త్రన్యాయమైనస్నేహముతో, నన్ను దమమందిరములోనికి రమ్మనియుఁ బీటపైఁ గూరుచుండుమనియు, భోజనము చేయుమనియు నత్యంతవాత్సల్యముతో బలవంతపఱిచిరి. ఈవిషయములోఁ 'బ్రభుని యాదేశము వినఁగోరుచున్నాను.

ఘనానంద—నీవు నీలరతనబాబు గృహములోని కేఁగుటకును, బీఠమునఁ గూర్చుండుటకు నభ్యంతర మెంతమాత్రమును లేదు; కాని, భోజనముమాత్రము నిషేధింపుము.

గురుచరణములకుఁ బ్రణమిల్లి యుమాశంకరుఁ డటనుండి వెడలుటకుఁ బ్రయత్నించెను; ఘనానందస్వామి వానినిఁజూచి "వత్సా! కూర్చుండుము. నేఁడు నీకొక శుభసమాచారము వినిపించెదను." అనిపలికెను.

ఉమాశంకరుఁ డత్యాతురతతో గురుదేవునివదనము వీక్షించుచుండెను.

ఘనానంద—వత్సా! బహుదినములకు మఱల నిప్పుడు దేవి యోగేశ్వరి దర్శన మీయనున్నది సుమా!

ఉమాశంకర—ఓహో, ఎంతసంతోషము! ఇది యెంతయు శుభసమాచారమే. కాని, స్వామీ! ఇందువలన నాకు ముఖ్య

ముగూడ సంభవించుచున్నది. మీవలన దేవీప్రసంగము సర్వదా వినుచున్నాను. మీరిప్పుడప్పుడు దేవీదర్శనమును బొందుచున్నారు. అదియు నెఱుంగుదును. కాని, స్వామీ! ఇంతపర్యంతము దేవీదర్శనసౌభాగ్యము నాయదృష్టమునందు సంఘటిల్లనే లేదు; ఈనాయభాగ్యతకు దురపిల్లుచున్నాను.

ఉమాశంకరుం డత్యంతవిషణ్ణభావముతో మోము వంచుకొనియెను.

ఘనానంద—వత్సా! ఈవిషయములో నీవత్యంతదుఃఖితాత్ముండవై యుంటివి; నిజమే. కాని, ఏకారణముచే యోగేశ్వరీదేవి నీకింతవఱకు సాక్షాత్కారభాగ్యముం గల్గింపలేదో తెలిసికొనినచో నీకింక దుఃఖముండదు—నీవింతపర్యంతము బాలకుండవై యుంటివి. యోగేశ్వరీదేవీతత్త్వమును బ్రార్థించుట గాని, యామె దుర్జ్ఞేయచరిత్రమును దెలిసికొనుటగాని నీపటుములో నింతవఱకుం దలచుగా నసంభవమే యగుచున్నది. నీ వింతకుం బూర్వమందా మెమహిమను నించుకయు ననుభవము చేయలేకపోయితివి. నేనును నీకామె పరిచయముగాని సాక్షాత్కారముగాని గల్గుటకుం, గేవలము విశేషప్రయత్నముం జేసియుండలేదు.

ఉమాశంకరుడు—దేవా! ఇప్పటికని నేను మునుపటివిధముగా నజ్ఞానబాలకుండనే యగుదునా?

ఘనానంద—కావున నాయనా! వయోవృద్ధికిం దగిన పరిపాకము బొందుచుంటివి. అందుచే నిప్పుడు నీవు దేవి పరిపూర్ణరహస్యలీల ననుభవము చేయుటకు సంపూర్ణసమర్థుండ వైతివనియే తోంచుచున్నది. ఉమాశంకరుని ముఖకమలము ప్రఫుల్లమయ్యెను. ఘనానందస్వామి మఱల నిట్లు చెప్పందొడంగెను—"ఇంకొక సంగతి; ఇంతపర్యంతము యోగేశ్వరీదేవి, నాకుదర్శనమిచ్చుచు, నాతోసంభాషించుచుండునట్లు

నీకు దర్శనమిచ్చి నీతో సంభాషించుట కవకాశముండదు. నీవు చిన్నవాఁడవనియుఁ, గోమలస్వభావుఁడవనియు, నన్ని సమయములలో నన్నిస్థలములలో నేను నాకడ నుండనిచ్చుట లేదు.

ఉమాశంకరుఁడు—స్వామీ! ఇప్పటికిని నేనట్టి సమయములలో నట్టిస్థలములలో నుండుట కనుపయుక్తుఁడనే యగుదునా?

ఘనా—కావు వత్సా! నీవయసును, నీప్రకృతియు నట్టివిషయములకింకను దగనివని నేననుకొనుటలేదు,

ఉమాశంకరుని మోముదమ్మి మరలఁ బ్రకాశింపనారంభించెను.

ఘనా—నేఁటియర్ధరాత్రమున, నొకనిర్జనస్థానమున నామెదర్శనము చేయుటకొఱకు నాకామె యాజ్ఞాపించెను. అందుచేత నేను నీతో నీ ప్రసంగమంతయుఁ జేసియున్నాను. నేను నేఁడటకు నిన్ను వెంటఁబెట్టుకొనియే వెడలఁదలంచుకొనియున్నాను.

ఉమాశంకరుఁడు గురుస్వామిచరణములకుఁ బ్రణామములుగావించి "దేవర కీయధమకింకరునిపై ననపారకృప గలదు. నాజన్మమిప్పుడు సార్థకమైనది" అని పలికెను.

ఘనా—కాని, వత్సా! ఈకథ యిప్పుడు చెప్పుటలో నొకప్రయోజనము గలదు; వినుము. యోగేశ్వరీదేవి యేకార్యమునందును స్థిరముగానుండునట్లు తోఁపదు. ఆమె సాక్షాత్కరించునని స్థిరపడినప్పుడుగూడ నొక్కొకతఱి నామెదర్శనము లభింపకుండుటయు, నామె దర్శనము కాదని యెంచుకొనినప్పుడుగూడ నొక్కొకవేళ నామె సాక్షాత్కరించుచుండుటయు, ఏమియు ననుకొననప్పుఁ డొకానొకసమయమున దాను ప్రత్యక్షము ప్రాప్తించుటయుఁ గలదు.

ఉమా—నాయదృష్టము.

ఘనా—ఆమె యితరవృత్తాంతములును, ఆమె వ్యాపారవిష

యముంబన, దగినసమయమున నీకెఱిఁగించెదను. ఆమెప్రకృతి యెట్టి రహస్యజాలజడితమో నీకంతయుఁ దెలియఁగలదు.

ఉమా—నాయందుఁ గృపగల్గి యామహాదేవి నాతో మాట లాడునో లేదో చెప్పరా?

మునా—వత్సా! ఆప్రశ్న కుత్తరము చెప్పుట నాకు సాధ్యముగాదు. ఆమెభావము లెప్పు డెట్లుండునో యితరులకు దురవగాహములు; అయినను నీయట్టిబిడ్డలను బ్రేమింపకుండుట యామె కసాధ్యమని తలఁచెదను.

ఉమా—నాభాగ్యము.

---

## మూఁడవ ప్రకరణము.

---

### జాహ్నవీతటము.

తల్లీ! గంగాదేవీ! నీవు విష్ణుపాదపద్మమునుండి దిగి బ్రహ్మకమండలుమధ్యగతవై తరువాత మహేశ్వరునిమస్తకమున గ్రహించి పిమ్మటఁ బాపమానవులఁ బవిత్రులఁ జేయుటకు భూలోకమున నవతరించితివి. నీయీజన్మవృత్తాంతము కవికల్పనామాత్రమనియే యనేకులు భావించెదరు. నీచరిత్రము యథార్థమో కల్పితమో విచారించుటవలన నాకేమియుఁ బ్రయోజనములేదు. కాని, నీవు భూలోకము నొతియుఁ దరింపఁజేయుచున్నావనుట కింకను సందేహమేమి? అమృతసన్నిభమైన నీయుదకమున బానముచేసి మానవులు స్వాస్థ్యసుఖ మనుభవించుచున్నారు. నీపవిత్రనీరములయం దవగాహమొనరించి మనుజులు సంతోషప్రసన్నతలు సంపాదించుకొనుచున్నారు. మఱియు నిన్ను జడాతీతప్రత్యక్షరూపిణివైన జలదేవతవని యెఱిఁగి మానవులు భక్తిజ్ఞానముల నార్జించుకొనుచున్నారు. నీప్రసన్నసలిలరాశి యేయేప్రదేశములన ప్రవాహితమొనరించుచుఁ బ్రవ

హించుచున్నదో. ఆయాసామీప్యములందలి జనపదములు గౌరవపదలాభము నందుచున్నవి. తత్ప్రదేశవాసులు సర్వత్ర సమాదరము నందుచున్నారు. కంటకాకీర్ణభూఖండములు నీపావనప్రవాహలాభమునఁబుణ్యతీర్థములై సంపూజితము లగుచున్నవి. కొంతకాలమునకుఁ గొంతసుకీర్తియుఁ గొంతదుష్కీర్తియు నీకళేబరమునం దంకితములైనవి. అమ్మా! సత్యవతీనందనుఁడైన "వ్యాసులు" కైలాసకల్పమైనకాశీధామమును బ్రతిష్ఠించిననాఁటిసుకీర్తికి నీవే సాక్షివి. తల్లీ! పితృద్రోహియైనయౌరంగజేబు విశ్వేశ్వరమందిరమున జూర్ణముఁగావించిననాఁటిదుష్కీర్తికిని మఱల నీవే సాక్షివి. జననీ! శత్రుభీతుఁడై దుర్బలమైన లక్ష్మణసేన యవనులకొఱకు స్వకీయరాజద్వారము నన్నక్రమముఁజేసి కంపితగాత్రముతోఁ బలాయితమైన నాఁటిసంగతికిని నీవేసాక్షివి. మాతా! స్వల్పాతిస్వల్పసైన్యముతో నదృష్టవంతుఁడైన లార్డుక్లైవు ప్లాసీ ప్రాంతమునందు, ఇంగ్లాండునకు విజయభేరి మ్రోగించినవిషయమునకును నీవే సాక్షివి. అమ్మా! మల్లికామాలికాసుశోభితగాత్రులై యనేకయువకయువతీజనంబులు నీప్రసన్నసలిలములకై హాస్యతరంగములఁ దేలుచు మలయమారుతములతోఁ దరంగవిహారలీలల సుఖించుచున్నారు. అమ్మా! నీసైకతస్థలములందే విగతజీవులైన నిజమనోహరుల కళేబరములు "చితుల"పైఁ జేర్చి కరాఘాతంబుల వక్షస్థలంబులు పగులఁగొట్టికొనుచు ననేకకిశోరికామినీజనంబులు హాహాకారరవంబుల వసుంధరను విదీర్ణముగావించి వేయుచున్నారు. అమ్మా! ఏనీపవిత్రజలంబు లాచమించి కర్మనిష్ఠాగరిష్ఠులు పవిత్రతాసౌభాగ్యము ననుభవించుచున్నారో, ఆనీసలిలగర్భమునందే నరహంతకులు శవశరీరముల నిపతితములుగావించి తమపాపచిహ్నములను గోపనము చేయఁజూచుచున్నారు. ఆహా! గంగాజననీ! ఈప్రపంచములో నిష్కామధర్మరక్షకు నీవే గదా మోక్షైకనిస్సీమాస్థానము! పాపపుణ్యములకును శుభాశుభము

లకును సర్వత్ర నీవే సమదర్శినివి. పుణ్యాత్ములసదనుష్ఠానములును దురాత్ముల దుష్కర్మలును నీసమక్షమందే ఎప్పుడో యొకప్పుడు నీవక్షములోనే సాధితములగుచున్నవి. కాని, నీవు మౌనధారిణివి ; నిర్లిప్తవు ; నిర్విరోధవు ; అమ్మా ! నిన్ను దర్శించినచో శుభాశుభ సర్వవిషయముల యందు నీకుఁగల యీ యనాసంగమును, యీద్వేష విరహితభావమును బరికించి చూచినచో నీకన్న నుపదేశములను బొందుటకు సజ్జనసంగతి నందనక్కఱలేదు; శాస్త్రరహస్యములఁ దెలిసికొనుటకు వ్యాకులత నొందనక్కఱలేదు ; సృష్టియు ధర్మశాస్త్రము పర్వతగుహాంతర్నిహితమైయున్నదని హతాశుఁడ గానక్కఱలేదు. ఓదరివాకారిణీ! పతితోద్ధారిణీ! గంగాజననీ! ఈభక్తాధముని-ఈధర్మజ్ఞానవిహీనుని-ఈపాపియూథుని నీకృపాలేశప్రసారమునఁ గృతార్థుని గావింపవా?

అనంతప్రవాహినియైన భాగీరథీతీరమునం దిద్దఱు సన్యాసులు నిల్వఁబడియుండిరి. ఈసన్యాసు లిద్దఱు నిల్వఁబడియున్నప్రతీరము కాశీధామమునకు కొక్కక్రోశమాత్రదూరమునందున్నది. ఆప్రదేశము నిర్జనమై, శాంతిపూరితమై, మనోహరమై యున్నది. ఇచ్చటికి సామీప్యమందొకచిట్టడవి గలదు. ఈసన్యాసు లిద్దఱు మనకుఁ బరిచయులైన యుమాశంకర ఘనానందస్వాములే.

ఘనానంద—వత్సా! నేఁడిచ్చటికి యోగేశ్వరీదేవి దయచేయు వలసియున్నది. తద్విషయమైన యితరసమాచారములు నీకుఁ గ్రమముగాఁ దెలియఁగలవు. ఆమె కేకార్యములయందును విశేషస్థిరత్వము లేదనియు, నేఁడిటకుఁ దప్పక రావలసియుండియు రాకుండుటగూడఁ గటస్థింపవచ్చుననియు నేనింతకుముందే నీకుఁ దెలిపియుంటిని.

ఉమా—స్వామీ! నాయదృష్టమెట్టిదో కాని యాదేవీదర్శన భాగ్యము నాకు సంఘటిల్లకయే పోవును. ప్రభుసన్నిధియందుఁ బలు

మాఱు లానుమహాదేవినామమును, ఆమెమహామహిమలును వినుచున్నా నుఁ బ్రభువున కాదేవి తలఁచుగా సాక్షాత్కరించుచుండుటయుఁ దెలియుచున్నాను. కాని, దురదృష్టముచే నింతపర్యంతము నామెదివ్యదర్శనము వలన జన్మము సార్థకము గావించుకొను భాగ్యము నాయదృష్టమున ఘటిల్లినదికాదు. ఇంతపర్యంతము నట్టియదృష్టమునకు నాకర్హత చాలదనియుఁ బ్రభువువలన బోధింపఁబడితిని. ప్రభుకటాక్షమున నాకిప్పుడట్టి యూపద తీఱినది. తరువాతి నాయదృష్టము.

ఘనా—బిడ్డా! పదింబదిగా నదృష్టమును నిందించుకొనఁబోకుము. ఇప్పుడు నీవయసునుబట్టియు నీస్థితిగతులనుబట్టియు నీకనేకవిషయములు తెలియఁజేయవలసినప్రయోజనము సమీపించినది. ఎంతవఱకు నీచరిత్ర కాకార మేర్పడలేదో, ఎంతవఱకు నీవు దృఢచిత్తుఁడవును, ఉత్తమమనోబలసమన్వితుఁడవును గాకుండనుంటివో అంతవఱకును నీకనేకవిషయములు తెలియకుండెను. భగవత్కృపచే నిప్పుడు నీకట్టివాభ్యంతరములు తీఱినవి; ఇకఁ గ్రమముగా ననేకవృత్తాంతములు తెలుపుటకు నిశ్చయించుకొన్నాఁడను. వత్సా! నీవు సాధారణమనుష్యమాత్రుఁడవుగావని నేనెఱుఁగుదును. ధర్మానుష్ఠానము, విషయభోగానుభవము నీయందుఁ గన్పట్టఁగలవు. ఈరెండింటి యత్యద్భుతసమ్మేళనము నేకకాలముననే నీయందు ఘటిల్లఁగలదు. ఏయుపాయముచే నేవిధముగా నట్టిసుయోగము సంఘటిల్లునో యిప్పుడు చెప్పఁజాలను; కాని యది సంపూర్ణముగా సిద్ధింపఁగలదనిమాత్రము నిస్సంకోచముగాఁ జెప్పఁగలను. వత్సా! నీయదృష్ట మత్యంతమంగళకరమైనది.

ఉమా—స్వామీ! అట్టిసంఘటన మగునా కాదాయని నేను విచారించుటలేదు. శుభముగాని యశుభముగాని యించుకయు నేనెఱుఁగను. మీచరణసేవనుండి వంచితుఁడను గాకుండుటచే నాజీవిత

మునకు సకలసౌభాగ్యములునని నేను నమ్మితిని, ఇప్పుడు దేవి దర్శన లాభమునుమాత్రమే నాకాంతరంగికమగు కోరికయై యున్నది.

ఘనా.—అవశ్యముగా నది నీకు సిద్ధింపఁగలదు; కాని, ఇప్పుడో మఱి యెప్పుడు ఘటిల్లఁగలదో అదిమాత్రము చెప్పుట కష్టము. వత్సా! రమ్ము. మన మీనదీతీరమునఁ గూరుచుండి యగ్ని ప్రజ్వలింపఁ జేయుదము మాటలాడుకొనుచుం గాలక్షేపమ్ము గావింతము.

## నాల్గవప్రకరణము.



### జ్ఞానము.

ఆకృష్ణపక్షనిశీథమున నాయంధకారములో నాజాహ్నవీతీరము నందొకవనపార్శ్వమున నిద్దఱుసన్యాసులు గూర్చుండియుండిరి. ఆసన్యాసులముందు అగ్నిజ్వలించుచుండెను. ఆవెలుఁగులో వారివదనమండలము లొక్కొక్కమాఱు గన్పట్టుచుండెను. ఆప్రదేశము భయానకమైనదైనను సన్యాసులు నిర్భయులుగానే కూరుచుండిరి.

యువకుఁడైనయుమాశంకరుఁడు ఘనానందస్వామి నిట్లడిగెను. "ప్రభూ! తరువాత?"

ఘనా.—వత్సా! తరువాత జ్ఞానము. ఈజ్ఞానము కేవలశాస్త్రాలోచనమువలనఁగాని, సదుపదేశలాభమునఁగాని లభ్యమగునదిగాదు; ఇది యోగమువలన ఫలింపఁగలదు.

ఉమా.—ఆయోగమెట్టిది? స్వామీ! ప్రాణాయామాదుల ననుష్ఠానమే ప్రకృష్టయోగముగాదనిమీరింతకుముందుసెలవిచ్చియున్నారు. ప్రాణాయామాదులవలన ననేకములైన యుపకారములు గలుగఁ గలవనియు, మఱియు క్రమముగా మనుష్యునకు దేహముపై యధిష్ఠ

మగు స్వాతంత్ర్యము లభింపఁగలదనియు, కాని, యాధ్యాత్మికోన్నతి యుఁ, జిత్తైకాగ్రియు నపేక్షణీయములనియు మీరు సెలవిచ్చితిరి. కావున మీరిప్పుడు జ్ఞానమునిమిత్తమై సెలవిచ్చిన దెట్టియోగము ?

ఘనానంద—అదియే చిత్తైకాగ్రితా యోగశబ్దము ననేకార్థములలో శ్రీకృష్ణభగవానులు వ్యవహరించియున్నారు. వాయుపూరణము (కుంభకము) చే దేహమునూర్ధ్వముఖముగా లేవనెత్తుటగాని కుడియెడమనాసారంధ్రములనుండి వాయుసంచాలనముఁ జేయునేర్పు నభ్యసించుటగాని యోగముకాదు. ఆక్రియలన్నియు యోగమునకు సాహాయ్యములనుట సత్యము. కాని, చిత్తైకాగ్రితయే ముఖ్యయోగము. ఈచిత్తైకాగ్రిత సాధింపఁగలుగుటకు నభ్యాసమే ప్రధానసాధనము. ఇప్పటివఱకు నానేక సన్యాసుల సందర్శనము ఘటిల్లినది; అనేకతరగతులయోగులను గూడ దర్శించితిని. వారిలో ననేకులు వాయునిరోధముచేతను, ఇతరసాధనములచేతను జిరకాలము తమదేహములు యౌవనసమన్వితములై యుండునట్లు తమయిష్టప్రకారము కాపాడుకొనఁగల్గిరి. కొందఱు కొందఱు, ఆహారాదికముల నత్యల్పములుగా స్వీకరించుట నభ్యసించి తమదేహములను రోగము లెంతమాత్రమును స్పృశింపఁజాలకుండునట్లు రక్షించుకొనిరి. మఱికొందఱు అణిమాద్యష్టసిద్ధులు పొంది అలౌకిక వ్యాపారసంపాదనమునందు సమర్థులైరి. ఇంకఁ గొందఱు కుమార్గసాధనలచే వ్యర్థముగా జీవనసుఖశాంతులకు వినష్టులైపోయిరి. కాని, యాత్మప్రత్యక్షజ్ఞాన మనేకులకు స్వాధీనమే కాలేదు. మనమందఱును అట్టివారిక్రియాకలాపములఁ జూచి. వారిని అలౌకికమహిమాసంపన్నలగు మహాపురుషులని పూజింపవచ్చుఁగాని వారుమాత్రము మట్టి గౌరవసమ్మానముల కాత్మపరితృప్తిని బొందఁజాలకుండురు. ప్రత్యక్షజ్ఞానమువలనియభావముచే వారు తమ్ముఁగూర్చి యధములమనియే భావించుకొనుచుందురు.

ఉమా—స్వామీ! తెలిసినది; బ్రహ్మజ్ఞానలాభమే ప్రార్థనీయము; మఱియు నేకాగ్రతయే దానికి సాధనము; కాని, శాస్త్రమునందుఁ జెప్పఁబడినయమనియమాదిసకలనియమములును, ఏకాగ్రత సంపాదించుటకుఁ బ్రయోజనములు కానేకావా?

ఘనా—వత్సా! శాస్త్రమించుకయు మిథ్యగాదు. యమనియమాదు లష్టాంగయోగములు. మనుజులు వివిధపదార్థములను భుజించి యెట్లుజీవనధారణమును జేయుచున్నారో, అట్లే వివిధోపాయములచే జ్ఞానార్జనమును జేయఁగల్గుచున్నారు. అభ్యాసప్రాబల్యముచేఁ గొందఱు కొన్నిభోజనపదార్థములయం దనురాగులై వానినే యనుకూలములని భుజించుచుందురు. అట్లే శిక్షవలనను సహవాసబలమునను యోగిగణ మనేకమార్గముల ననుసరించుచుండును. శాస్త్రవిహితములైనయష్టాంగయోగములు శ్రేష్ఠములైనవే. వానిపరిణామఫల మేకాగ్రతయే. కాని, స్వాతంత్ర్యనేత్రముతోఁ జూచితిమేని వానియందును బరిపూర్ణత లేదు. ఏలన? అవి భక్తివిరహితములు. కర్మ, భక్తి, జ్ఞానము అను మూఁడు నన్యోన్యసంబంధముగలవి. కర్మయొక్కయు భక్తియొక్కయుఁ బ్రభావముచేఁ గలుగుచున్నయేకాగ్రతయే నిరుపమానమాధుర్యముగలది. దానివలనఁ గలుగఁగల జ్ఞానమే ప్రార్థనీయమైనది.

ఉమా—స్వామీ! అదియును గ్రహించుకొంటిని. కాని, ఇంద్రియసంయమాదులకొఱకుఁ జెప్పఁబడినశాస్త్రనియమము లన్నిటి నెంతవఱకుఁ బ్రతిపాదింపవలయును?

ఘనా—ఆనియమములన్నియు నమూల్యములు; మఱియు నవశ్యపాలనీయములు. కాని, యట్టివాని విషయములో మన మతిశయభావమును గల్గియున్నాము. అసంబంధముగ మనయుద్దేశములన్నియు శాస్త్రసమ్మతములుగావు. మనమింద్రియములన్నిటి నొక్కమాఱుగాఁ బరిత్యజించుట శ్రేష్ఠకార్యమని తలంచుచున్నాము. అది యెంతమా

త్రిమున శాస్త్రోద్దేశముగాదు. ఇట్టి దిగియ ప్రవృత్తులన్నియు జగదీశ్వర విధివిహితములు. ఇంద్రియసంబంధమును బరిత్యాగముచేయుట విధినియమమును లంఘించుట యగుచున్నది. ఇంచుకైన నాహారమును దీసికొనకుండ శరీరధారణము చేయుట యెటుసంభవమో అట్లే ఒక్కమాఱుగా నింద్రియప్రవృత్తుల పరిత్యాగము గావించుటయు నజీవసంస్థితిరక్షణము నసంభవములగుచున్నవి. మఱియు మనోదేహములను సుస్థితియందుంచుటయుం గఠినతరము. సతీసంసర్గరాహిత్యమే ధర్మమార్గగమనమునకుం బ్రధానసాధనమని తెలుపుచెదరు; కాని, శాస్త్రతాత్పర్యమదిగాదు. జీవపరిరక్షణార్థ మత్యావశ్యకముగాం గలుగుచున్న తత్ప్రవృత్తిని నిరోధించుట యీశ్వరోద్దేశమునకు విరోధము. దైవనియమమునకు విరోధములుగానినియమములను బాటించుటే సంయమశబ్దమునకు లక్ష్యార్థము దేనివలన సాంఘికనిర్బంధము సంభవింపదో, దేనివలన నెవ్వరికిని హృదయదుఃఖము సంఘటిల్లదో, దేనివలన వంచనస్వార్థపరత మొదలగు నిందితవ్యవహారసంఘటనలు సంభవములు కావో, అట్టివిధివిహితమైన సాంసారికధర్మములు నిషిద్ధములు కావు. సాధకునకుంగూడ నిట్టిసమయమున నిట్టియవస్థయు సంఘటిల్లుట లేదు. కాని, యెప్పుడాతని నేనియమములను లోంబఱుచుకొనంజాలవో, ఏనియమములను శాసింపంజాలవో, అప్పుడాతఁడు నివృత్తిమాత్రపరితుష్టుండై విమలానంద మనుభవించుచుండును. ఇట్లే ఆహారసంయమమునందును నిరంతరోపవాసనియమము లేదు. అక్కనసలేంద్రియవ్యాపారములందును గూడ నిట్లే గ్రహింపవలయును. యోగి తనయవస్థావిశేషమును బట్టి సకలము నిరోధించినను నిరోధింపగూడదు కాని, అట్టిస్థితికొఱకు మొట్టమొదటనే బలాత్కారముగా సహజేంద్రియవ్యాపారములకుం దీవ్రనిరోధము గలించినచో దేహపీడనము, చిత్తచాంచల్యము, నిరుత్సాహము, మరణము మొదలైన యోగప్రతికూలదుర్లక్షణములు సంభవించి విపరీతము ఘటిల్లును.

ఉమా౦—అట్లయిన, ప్రభూ! ఉపదేశకులైనయాచార్యులు శాస్త్రాచారములకనర్వత్రి సమానమైనవ్యాఖ్యానము లేల వ్రాసి చూపరైరి?

ఘనా—శాస్త్రములకు విరుద్ధార్థములు కల్పింపఁబడుటచేతనే నార్యధర్మములు క్రమముగా నానాస్థానములయందు నానారూపములు వికృతాకారమును ధరించియున్నవి. ఒక దేశములోనియాచారధర్మము కంటె మఱొక దేశములోని శాస్త్రాచారధర్మములు విలక్షణములుగా నున్నవి. శాస్త్రార్థములకు విశేషములైన భేదభావములు గ్రహింపఁబడి సకలధర్మాచారములకు విభిన్నములైనయనుష్ఠానములు పరివర్తితము లైనవి.

ఆకస్మికముగా నప్పుడు దూరమునందుండి నాకంఠనిస్సృతమై, యపూర్వమాధుర్యమయమైన శంఖధ్వని యొకటి ఆగురుశిష్యు లిద్దరి కర్ణరంధ్రములఁ బ్రవేశించెను. వారిద్దరున చకితులై లేచిరి.

ఘనా—వత్సా! నీమనోరథము సఫలము కాఁగల సూచన లగుపడుచున్నవి. సామీప్యముననే యోగేశ్వరీదేవి యావిర్భవించుచున్నది. స్వర్గీయమైన శంఖధ్వని యామెకంఠమునుండి బయలువెడలినదే. నీవు నిశ్శబ్దముగా నావెంట రమ్ము.

ఉమాశంకరునిశరీరము పులకించిపోయెను. ఆతఁడు నిరుపమాన మనోరథచిత్తుఁడై ఘనానందస్వామి ననుసరించి నడువఁజొచ్చెను.

౧.

అయిదవ ప్రకరణము.

## యోగేశ్వరి.

సంధ్యాకాలాచ్ఛన్నమై యున్నయాకాశము నిశలపు క్రమముగాఁ బ్రకాశింపఁజొచ్చెను. వెంటనే పండువెన్నెలలు నలుదెసల నలుముకొనియెను. ఘనానందస్వామియు నుమాశంకరుఁడును మెల్లమెల్లగా

నాదిభోగములేవియు నాకెప్పుడును నాయందుఁ దటస్థింపలేదు. ఈమె ప్రాఁత వస్త్రముల నెప్పుడెప్పుడు ధరించుటఁజూచి నూతనవస్త్రములు కొనఁగుట కేమొకడఁ బ్రసంగించుచుందును; కాని, యావెంటనే యామె నవ్వుచు నాయొద్దనుండి వెడలిపోయి, పరల నమూల్యములైన కౌశేయాంబరముల ధరించుకొని నాయెదుటఁ బ్రత్యక్షమగుచుండును. ఒకానొకప్పుడు నేను మిక్కిలి యాకలిగొనియున్నట్లు నాకుఁ దోఁచి "భోజనాదికములు గావలయునా?" యని ప్రశ్నించుచుందును. అప్పుడును ఈమె నవ్వుచు నవ్వుచు నాయొద్దనుండి యదృశ్యురాలైన వెంటనే వివిధములైన పంచభక్ష్యములను విశేషముగా బంగారుపాత్రిల నించి తెచ్చి నాపాదసామీప్యమునం దుంచుచుండును. ఈమె కెక్కడను ధనాగారముగాని, వస్తుభాండారముగాని, కన్పడదు. అయినను గావలసినంతమాత్రమున నే ధనరాసులును వస్తుసంచయములును ఈమె కెట్లు సిద్ధములగుచున్నవో అవియన్నియుమాత్రము నేను నిర్ణయింపఁజాలకున్నాను. ఈప్రపంచమునం దీమె కేవియును లేవు; కాని, అన్నియు నున్నవి!

ఉమా.—ఆహా! ఏమియలౌకికశక్తి! తండ్రీ! ఇంతకాలమునుండియు నేనేమిపాపముచే దివ్యమూర్తిదర్శనమునకు వంచితుండనైతిని?

సనా.—వత్సా! సకలకార్యములకును సముచితసమయమును గలుగుచుండును గదా! దివ్యమూర్తిదర్శనయోగము నీకు యుక్తసమయము నింతకాలమునకు నేఁడు లభించినది. బిడ్డా! ఈదేవి యెట్లు ప్రథమమునఁ బ్రత్యక్షమైనదో నాకెట్లు ఎక్కడ లభించినదో నీకుఁ జెప్పెదను వినుము. అయిదువందలవత్సరములకుఁ బూర్వము మధురానగరమునందలి యొకఘట్టమునం దీదేవి నాకాశ్చర్యకముగఁ బ్రథమదర్శన మిచ్చినది. అప్పటి కామె వయసు పదునాలుగు వత్సరము లుండును. నాఁటినుండియు నన్నామె "స్వామీ!" యని సంబోధించుచుండెను. అయినను ఈమె నిప్పటికిని చిత్రముగ నేఁడునే నన్ననుసరించి వచ్చుచుండెను. నేను మొట్టమొదట నీమెను "గులబ" యని

యెంచియుంటిని; తరువాత నీమెయొక యున్మాదిని యనుకొంటిని; కాని, యిప్పు డీమెను శాపభ్రష్టదేవతయనియే భావించుచుంటిని. ఈమె నామధేయము, తల్లిదండ్రులు, జాతి, కులము, మొదలగు పూర్వచరిత్రవిషయము లేవియు నే నెఱుఁగను. కాని, యీమె కొక పేరు లేకుండుటచే ననేకసమయములందు నావ్యవహారమున కాటంకమైనది. అందుచే నేనీమెకు "యోగేశ్వరి" అని నామకరణముఁ గావించితిని.

ఉమా.—స్వామీ! ఈమాఱు నాజీవితము సార్థకమైనది. నేనిప్పుడు నామాతృదేవతయైన యోగేశ్వరీదేవిసజీవమూర్తిని బ్రత్యక్షముగ దర్శింపఁగంటిని. కాని, తండ్రీ! ఈపుత్త్రిధముఁ డాదేవితో సంభాషించుటకు సాహసింపఁగూడదా?

ఘనా.—ముఖ్యముగా నట్లే కావింపవచ్చును. కాని, యిది ప్రథమసందర్శనముగావున సంభాషణము సంఘటిల్లకుండుటయు సహజమే. యోగేశ్వరీదేవిప్రకృతి రహస్యజాలజటిలమైనది. ఈమె యెప్పు డెట్టిభావముతో నుండునో స్థిరపఱుపఁజాలను. ఆమె యొకప్పుడు కేవలము మాటలాడుటయు, నొకప్పుడు మాటలాడకుండుటయుఁ గూడఁ గలదు. నీవు నాతోరమ్ము. నేను నీకు యోగేశ్వరితోఁ బరిచయము గల్గించుటకుఁ బ్రయత్నించెదను.

ఘనానందస్వామియు నుమాశంకరుఁడును నించుక దూరము ముందఱికి నడచిరి. యోగేశ్వరిని సమీపింపఁగానే ఘనానందస్వామి "యోగేశ్వరీ" యని పిలిచెను.

యోగేశ్వరి చమకితయై యున్ముఖముగా నిల్వఁబడియెను. అప్పు డామె యం దస్వమనస్కభావము లేవియు లేవు. అపూర్వమైన యానందాతిశయముచే నామె దేహలతి సర్వముఁ బులకాంకితమై యుండెను. ప్రేమావేశముచే నామెవదనమండల మత్యంతరంజితమగుచుండెను.

భక్తిభావముతో నాదేవి ఘనానందస్వామికిఁ బ్రణామ మాచరించి యాయనపాదధూళిని గైకొని శిరసావహించెను. ఘనానందస్వాముల యత్రాకికపత్నియైనయీయోగేశ్వరి యెప్పుడుఁ దనహృదయేశ్వరుని స్పృశించి యెఱుఁగదు. దర్శనమాత్రముననే **దూ**రమునందునిల్వఁబడి స్వామి చరణముల నుద్దేశించి సాష్టాంగప్రణామములఁగావించుచుఁ బదప్రాంతమునందలిభూరజ మించుక గైకొని దానిని బతిపాదరజముగా భావించి యత్యంతభక్తిభావముతోఁ గన్నుల కద్దుకొని నాలుకపై నిడికొని, వక్షమున ధరించి, శిరసావహించుచుండును.

వీణారవమువంటి దివ్యమధురస్వరముతో యోగేశ్వరి యిట్లుపలికెను. "స్వామీ ! నిన్ను నేనింతసేపటినుండియు నాకాశమునందు దర్శించుచుంటిని. నీవు విశ్వవ్యాపివా ? నీవెంటనున్న యీసాధుబాలకుఁ డెవ్వఁడు?"

**ఘనా**—దేవి ! **ఈ**తఁడు, నా**పు**త్త్రుఁడు **ఉమా**శంకరుఁడు.

యోగే—కాదు; నీకుఁ బుత్త్రునితోఁ బనిలేదు. నీకుఁ బుత్త్రుఁడైనచో నేనును బుత్త్రిభావముతో నుండవలయును. కేవలము వానికి స్నేహమమత్వములలో భాగమీయవలయును. నాహృదయమునం దేదిగలదో యదియంతయు నాపతిదేవునకు సమర్పించుకొనియుంటిని. అట్టిదానినుండి యెవ్వరికిని భాగముపెట్టుట కేయుపాయమును లేదు. నీవు గృహస్థుల బిడ్డ నేలగైకొంటివి? ఎవ్వరిబిడ్డయో వారికి మఱల నిచ్చివేయుము. మనకు సంతానముతోఁ బనిలేదు.

ఉమాశంకరుఁడు తత్క్షణము దేవిచరణసమీపమున కరుదెంచి కాతరస్వరముతో "అమ్మా! అమ్మా! ఎట్టిపిశాచమైనఁ జనబిడ్డను బరిత్యజింపదు.నీవో? నీవు దేవతవు. నేనతిశైశవమునందే మాతృహీనుఁడనైతిని. మాతృస్నేహసుఖము నాయదృష్టమునం దెన్నఁడును ఘటిల్లలేదు. అగణ్యపుణ్యఫలముచే నేఁడు నాకు జగజ్జననియే జననిగా లభించినది. అమ్మా! నీవు

నన్ను దూరముగాఁ ద్రోసి వైచినను నేను నీపాదాశ్రయ మెప్పుడును వి డిచి యుండఁజాలను.” అని పలికెను.

యోగేశ్వరి యించుకసేపు యోజించి “మంచిది! ఈయాకాశము నం దనేకమేఘము లున్నవి. వానినుండి కొన్నిస్థలములయందుఁ గొంతవ ర్షముమాత్రమే వర్షించుచున్నది. అట్లేయగుఁగాక! నీవు నాబిడ్డవే. కాని, నీవు మిక్కిలియదృష్టవంతుఁడవగుబిడ్డవు. సాక్షాన్నారాయణుఁడే నీకు గురువుగా లభించెను. అనేకజన్మసంచితసుకృతమువలనఁగాని యీవిధము గ భగవంతుఁడే గురుస్వరూపుఁడై యెవ్వరికిలభించుసు! నీసాధన యెంత యు సార్థకమయ్యెను.” అని పలికెను.

ఆతరువాత నాదేవి యాకస్మికముగా నయనయుగళమును మూ సికొని బాహుద్వయమును వక్షస్స్థలముపైఁ జేర్చికొని నిశ్చలభావమును బొందియుండెను. ఆమెలలాటదేశమునుండి యొకతేజను వెలువడుచుం డెను. లోచనములనుండి యానందాశ్రువుల విరళముగా ప్రవహించు చుండెను. కొంతసేపటికి కామె ఘనానందస్వామిని జూచుచు దీర్ఘనిశ్వా సములతోఁ గరయుగము మోడ్చి యిట్లనియెను. “ప్రభుకటాక్షము ధ న్యము! బాలశిష్యుఁడు ధన్యుఁడు!”

ఆపిమ్మట నమాశంకరునివంక వీక్షించి “ప్రభుకృపావిశేషమువల నను నాభాగ్యఫలమునను నీయట్టిబిడ్డను బడయఁగలిగితిని. నీవు మిక్కిలి శాస్త్రశిష్యుఁడవైనబాలకుఁడవు. నీవిఁకముందు రాజవుకాఁగలవు. నేన రాజమాతనగుదును. నీకొఱకు నేననేకవస్తువులను జాగ్రతపఱిచి యుం చితిని. నాయనా! నీవు వానినిగైకొనవలయును.” అని పలికెను.

ఇట్లు చెప్పుచు యోగేశ్వరి ఉమాశంకరుని హస్తములను బట్టు కొని వనమధ్యమునకు వెడలిపోయెను. ఘనానందస్వామియు నెమ్మదిగా వారిననుసరించి పోఁజొచ్చెను.



# యోగేశ్వరి.

## ద్వితీయఖండము—అంధకారము.

### మొదటిప్రకరణము.

#### ప్రతాపము.

పాఠకమహాశయులారా! మీ రిప్పుడు పుణ్యభూమియైన కాశీనగరమును విడిచి వంగదేశమునందలి సోనాపురమునకు బోవలయును. మఱియు ధర్మప్రదీపకుఁడును విభూతిభూషణుఁడు నైన సన్న్యాసి నామావ్యకుటీరమును వదలి. పాపపంకిలుఁడును విలాసస్త్రీలోలుఁడు నగుశ్యామలాలుని శోభాయుతసౌధమధ్యమునఁ బ్రవేశింపవలయును.

దాదాపు జామురాత్రియైనది. ఆకాశము మేఘాచ్ఛన్నమై చిటపట చినుకులు రాలుచుండెను. ఆపల్లెయందలి జనులందఱును దమతమ యిండ్లలో విశ్రమించి యుండుటచేఁ బురమార్గము లన్నియు నిర్మానుష్యముగా నుండెను.

రమణీయముగా నలంకరింపఁబడిన శ్యామలాలుని కచ్చేరిచావడియందు మనోహరములైన యుజ్జ్వలదీపమాలికలు ప్రకాశించుచుండెను. పాలనురుగును బోలిన యొకపానుపుపై శ్యామలాలుబాబును, ఆతనిప్రాణమిత్రుఁడగు హరిచరణుఁడును గూరుచుండి యుండిరి. ఒక మద్యపాత్రమును నొక గాజుగిన్నెయుఁ జేతఁబట్టుకొని, శ్యామలాలుని సేవకుఁడు రా

ముందు దూరముగా నిల్వఁబడి యుండెను; శ్యామలాలుని కనుసన్న నెఱిం
గి రాముఁడా మద్యమును గాజుగిన్నెలోఁ బోసి యాతనికిని ఆతని ప్రియ
మిత్రుఁడగు హరిచరణునకు నందించెను.

శ్యామలాలుఁడు పొట్టివాఁడు; స్థూలదేహుఁడు; నీలవర్ణుఁడు. ఆతని
కిఁ బెద్దముక్కును చిన్నకన్నులును, హీనవక్షమును గలవు. కాని, యందు
వలన నాతనికిఁ బోవునదేమి వచ్చునదేమి? శ్యామలాలు పితార్జితమైన
విశేషైశ్వర్యమున కధికారి. ఆతనికి భూవసతిపై సాలునకు నాలుగులక్షల
యాదాయము వచ్చుచుండెను; ఏనుఁగులు, గుఱ్ఱములు, అతిమనోహర
ములైన విశాల సౌధరాజములు ననేకములుండెను; పరమశోభామయము
లగు నుద్యానవనములు కావలసినన్ని యుండెను. భాగ్యవంతులగు వారు
సుఖసాధకములుగాఁ బరిగణించెడి పదార్థములన్నియు నాతనికి విశేష
ముగా నుండెను.

శ్యామలాలుని యాకారము జాత్యంతరుని యాకారము వలె నున్న
నుండెను. ఆతనికంఠమునందలి యజ్ఞోపవీతము గూడ విశేషమలినాకృతిని
వహించి యుండెను; ఆతఁ డొకదళసరిపట్టుబట్టను కట్టుకొని యుండెను.
ఇఁక విశేషముగాఁ బరిగణింపఁదగిన వేషభూష లేవియు నాతని దేహము
నం దెక్కడను లేవు. ఆతని శిరోజములు సరిగా వరాహపుఁగుంచెను
బోలియుండె నని చెప్పినచో నింక వానినిగూర్చి వేఱేమియుఁ జెప్పనక్క
ఱలేదు. నడిమిపాపటఁదీసి కత్తిరింపఁబడిన యాతనితల కించుకతైలబిందువు
గాని దువ్వెనగాని యొకనాఁడును దాఁకినట్లు కనఁబడదు.

శ్యామలాలు మూర్ఖుఁడు. ఆతని తండ్రి యాబిడ్డకు విద్యాధనము
నొసంగుటకు విశేషధనము వ్యయముచేసి సకలప్రయత్నము లొనరిం
చెను; కాని, యాగుణధాముని సూక్ష్మబుద్ధి యెట్టిదో కాని, అక్షర
పరిచయమను కొనప్రదేశమునఁ బ్రవేశించుటకే యాతఁడు పరాజయ

ముపొందిపోయెను. ఏమూలనైన నేయక్షరసంజ్ఞమైన ఘుణాక్షరన్యాయ
ముగా నాతనియందించుక నిలిచినను, అది యేయితరాసక్తులమధ్య
మునఁ బడి క్షయమై క్రమముగా మూలమట్టమగుచుండుటఁ జూచి
సంతానవత్సలుఁడగు నాతని ప్రియజనకుఁడు తనకుమారున కిఁక విద్యా
భ్యాసము చేయించుటయం దాశను బరిత్యజించెను.

శ్యామలాలున కిప్పు డిరువదినాలు గిరువదియైదువత్సరముల
వయసుండెను. ఆతనితలిదండ్రులీప్రపంచమును వదలి యిప్పటికిఁ జాల
కాలమైనది. అతఁ డిప్పుడు సర్వస్వతంత్రుఁడు. శ్యామలాలునకు వివా
హమైనది; ఈసంగతి నాతఁ డెఱుఁగును. మఱియు నంతఃపురమునం దొక
రమణి తనపత్నియని యెన్నఁబడుచు నివసించియున్నదనియు నాతనికి
నమ్మకమున్నది; కాని, యాతనికిఁ దనభార్యనుగుఱించి యింతకంటె
మఱెట్టిపరిచయమును లేదు. శ్యామలాలునకొకప్పుడైనను భార్యకు దర్శ
నమైన నొసఁగు నభ్యాసము లేదు; ఆతఁడు రసికుఁడగుటయే యందు
లకుఁ గారణము. బహుపుష్పములమధువును భుజించునభ్యాసము లేకు
న్నచో భ్రమరుని రసికుఁడని యెవ్వరందురు?

శ్యామలాలుని యాప్తుఁడైనహరిచరణుఁడు శ్యామలాలున కా
శ్రితుఁడును బ్రతిపాలితుఁడుఁగూడ నైయుండెను. విలాసవిహారమే యా
తనికి జీవనవ్యాపారము. అన్నివిధములైన మత్తుపదార్థములనాహరించు టే
యాతనికిసిద్ధవిద్య. ఈవిషయమున "చికాగో" వస్తుప్రదర్శనమునందుఁ
బదకములను బహుమానముగాఁ బొందుట కాతఁ డర్హుఁడు. ఈహరిచర
ణుఁడు శ్యామలాలున కత్యంతవిశ్వాసపాత్రుఁడును, అతని రసికతారాజ్య
మునకుఁ బ్రధానమంత్రియు నై యుండెను. వయసునం దీతఁడు శ్యామ
లాలునకంటెఁ గొంచెము పెద్దవాఁడు; వ్రాయుటలోను జదువుటలో
నుగూడనీతఁ డాతనికన్న గాఁడే కాని, శ్యామలాలునివలె నిరవచ్ఛిన్నమైన
బుద్ధిమాంద్యమీతనికి లేదు.

శ్యామలాలునిదుష్కృత్యములకుఁ బారము లేకుండెను. ఈతని యత్యాచారములచే నచ్చటిసామాన్యజనులనేకులు తమభాగ్యాభివృద్ధి కలతో నచ్చట వాసముచేయుట యసంభవముగాఁ దలఁచి యాగ్రామమునుండి కాపురము లెత్తికొని వెడలిపోఁజొచ్చిరి. ఆతనిదుర్వాంఛాహుతాశనునియందనేకకులకాంతలధర్మధన మాహుతిప్రదాన మైపోవుచుండెను. ఆతనిలాలసాపూర్ణమైనదృష్టిపథముచం దేనారీమణులుదవులొకాని నను, ఏకుత్సితమార్గములచేనైన వారు వంచింపఁబడి యాతనిచేతులలో నాత్మసమర్పణముఁగావించుకొని సర్వనాశనము గావలసినదే. ఎట్టియాధిక్యముగలవారైనను, ఈదారుణదురాచారునిచేతిలోనుండి తమస్వాతంత్ర్యమున గాపాడుకొనఁజాలకుండిరి. ఇప్పుడు శ్యామలాలుఁ డొకగురుతరమైన పాపానుష్ఠానమున కుద్యోగించుచుండెను.

"రఘునాథసార్వభౌముఁ" డనునొకయుత్తమబ్రాహ్మణుఁడు గలఁడు. ఈతనినివాసము సోనాపురమునందే యైనను వంగదేశమందంతటను, ఈతఁడు సుప్రసిద్ధుఁడై సన్మానితుఁ డగుచుండెను. అసాధారణపండితుఁడని యీతఁ డందఱిచేఁ గీర్తింపఁబడుచుండెను. ఈతనిధర్మనిష్ఠ, సుశీలత, విజ్ఞత, నిరుపమానములు; ఈతని యేకైకపుత్త్రుఁడగు "నవీనకృష్ణచంద్రుఁడు" తండ్రిదగ్గఱనే, ఇంకను శాస్త్రాభ్యాస మొనరించుచుండెను. నవీనకృష్ణునిభార్యకుఁ బదునాలువత్సరములుగలవు. ఆమెపేరు సుహాసిని. సుహాసిని తనదురదృష్టవశమున దైవికముగా నొకనాఁడు శ్యామలాలునిపాపిష్ఠినయనపథమునఁ బడిపోయెను. సతీత్వతేజోవిరాజితయైనయాబ్రాహ్మణబాలిక యలోకసామాన్యమైనరూపరాశింజూచినది మొదలాదురాత్ముఁ డామెకొఱ కత్యంతవ్యాకులితచిత్తుఁ డగుచుండెను. శ్యామలాలునిదూతిక యొకతె సుహాసినీసుందరికడ కేఁగి యామెకనేకవస్త్రాభరణములు ధనాగులు నెఱవేట్టుటకుఁ బ్రయత్నించెను.

కాని, యభిమానినియైన యామానవతీమణి యాదుష్టురాలి యవజ్ఞతాపూర్వకమైన యాప్రస్తావమును వినకయే యుపేక్షించెను. మఱియు సార్వభౌమమహాశయునికడ సమస్తవృత్తాంతమును గూడ నివేదించెను. సార్వభౌముఁ డదియంతయు విని విషాదమును బొంది యున్న, ప్రబలప్రతాపవంతుఁడగు నాజమీందారునితో విరోధ మసంభవమని తలపోసికొనెను. వెంటనే యతఁడు సుహాసినిని బుట్టినింటికిఁ బంపివేయుటకు మాత్రము దృఢమైన యేర్పాటు గావించివేసెను. కాని, శ్యామలాలుఁ డీసమస్తవృత్తాంతమును "గర్ణపిశాచుల" వంటితనదూతికలవలన వినఁగలుగుటచే సుహాసినిపుట్టినింటికి వెళ్ళులోపలనే బలాత్కారముగాఁ దనయింటికిఁ జేరునట్లు దృఢతరమైన కట్టుదిట్టములు గావించియుంచెను. గదుఁడను పేరుగలదుష్టచండాలుఁ డొకఁడు శ్యామలాలున కిష్టకార్యములు సానుకూలములు గావించుటయందుఁ బరమసహాయుఁడుగా నుండెను. అంధకారాచ్ఛన్నమైన నేఁటిరాత్రియందెట్లయినను రఘునాథసార్వభౌముని కోడలిని శ్యామలాలుబాబుగృహమునకుఁ బ్రవేశపెట్టుటకు నిశ్చయించుకొని గదుఁడు తనయనుచరులతోఁ గూడ బయలుదేఱెను. శ్యామలాలు మిక్కిలి యుత్సుకతతో గదునిరాకకుఁ బ్రతీక్షించుచుండెను. శ్యామలాలునకు గదునిరాక యాలస్యమగుచున్నట్లు తోఁచుటచే నాతఁడు మహాందోళనము పొందజొచ్చెను. "ఏమీ! గదుఁ డింతయాలస్యము చేయుచున్నాఁడు? ఇట్టివిలంబమున కవసర మేమియు లేదే" యని పలవించుచుండెను.

హరి.— తెలిసినది. ఆతనికిఁ గార్య మనుకూలింపలేదు.

శ్యామ—(క్రోధస్వరముతో) అనుకూలమా? ఏమియనుకూలము? ఎవ్వరైన నడ్డమువచ్చినచో వారిప్రాణములుగూడఁ బుచ్చుకొనుటకు వెనుదీయవలదని వాని కాజ్ఞయిచ్చితినే. కార్యము గాకుండ వెనుదిరిగి రమ్మని నేను జెప్పలేదు.

హరి—అట్టి తనూత్రిమును రాఁజాలఁడు. కార్యము సులభము గనే నెఱవేఱఁగలను. ఇట్టియవసరములకుఁగాకున్న గదుఁ డీక నెందులకు?

శ్యామ—దానిరూపగర్వమును, సతీత్వగౌరవమును నేఁడంతయు విధ్వంసముగావింపవలయును. ఇట్టివారి సేవలకేమ్చుటయే మహాభాగ్యమని భావింపకుండుట యవమానముగాదా? చూతుము. నేఁడు దానిసతీత్వధన మెక్కడ దాఁచుకొనునో?

హరిచ—ఓహో! మనసాన్నిధ్యమునకై సీతాసావిత్రులవంటి వారే పరితపించుచుండ సార్వభౌమునికోడు లోకలెక్కయా?

శ్యామలాలునిచుట్టు పెదవులలోనుండి యొకమందహాసరేఖ యావలఁబడియెను. అతఁడు హరిచరణునిఁజూచి "బాగుగాఁ జెప్పినావు; గదుఁడు అన్యాయముగా నింతియాలస్యము చేయుచున్నాఁడేమి?" అని, "రామా! నీవొకమాఱు సాంబునిఁ బిలిచి సార్వభౌమునియింటి కేఁగి గదుని సమాచారమును దెలిసికొనిరమ్మని చెప్పుము; త్వరగాఁ బొమ్ము." అని పలికెను. రాముఁడు వెంటనే పరుగెత్తెను.

హరి—నీవీదేశమునకు రాజవు; అదిగాక రసికశిఖామణివి. నిన్నుఁజేరినవారి కేమిగొదవయుండును! అన్నినవ్వలువలు వారివే; అన్ని రత్నభూషణములు వారివే; అన్ని సుగంధద్రవ్యములు వారివే; ఇన్నియున్ని యననేల? వారిసకలమనోరథములు పండిపోవును. నిన్నుఁ గోరనివారెవరుందురు! వారును నింతిలో వచ్చుచునేయుందురు.

శ్యామలా—చెలికాఁడా! నీవామె నెప్పుడును జూచియుండలేదు గాని చూచినచో నీకన్నులుసార్థకములైపోవును. ఆరూపు మవగు వర్ణింప[illegible]రు? ఆమెకు మణిరత్నభూషణములతో—మనవువ్వలువలతోఁ బనిలే[illegible]. ఆసన్న్యాగిసుందరి సహజముగా నిత్యాలంకారిణివలె వెలిఁగిపోవుచుండును. ఆరూపమును జూడఁగలిగినచో మునులు గూడ విచలితులై పోవలసినదే.

"చూచితిని చూచితిని; ఆమె నొకదినముఁ జూచితిని. ఓహో! అది దేవరవారికి యోగ్యమైనవస్తువే." అనుచు హరిచరణుఁడు త్వరితముగా నచ్చటనున్న సురాపాత్రము నందుకొని శ్యామలాలుని చేతిలోఁ బెట్టెను. వెంటనే నిశ్శబ్దముగా శ్యామలాలాపాత్రిలోనిపదార్థమును నోటఁబోసికొని "అరే! నీవు చూచితివిగదా! అయిన నేనూరకే పిచ్చివాఁడను గాలేదుగదా! గదుఁడేమి యింతయాలస్యము చేయుచున్నాఁడు? ఏమైనను సరే. యింటియొక్క వర్తమాన మంపుట మంచిది" అని యటనుండి లేచి యాతఁడు కచ్చేరివాకిటఁ బచారుచేయుచుండెను. ఒక్కనిముసములో నాతనిదృష్టి యాప్రక్కగోడపైకి మరలెను. ఆతఁడు వెంటనే యాగోడ నమర్పఁబడియున్న యొకపెద్దయద్దమునొద్దకుఁ బోయి భల్లూకతుల్యమైనతనసౌందర్యశ్రీని, ఆనిలువుటద్దములో సదేవనిగాఁ జూచుకొనఁజొచ్చెను. స్వస్వరూపానుసంధానమైనకొలఁదిని ఆతనియానందము ఖండితమైపోఁజొచ్చెను. "ఏయిందుఁడు, ఏచంద్రుఁడు, ఏవసంతుఁడు, ఏజయంతుఁడు ఈనారూపమునకు సాటిరాఁగలఁడు! నారీలోకమంతయు నిరూపమునఁజూచి పిచ్చివారగుచున్నారనుటలో నాశ్చర్యమేమున్నది? ఆహాహా!" అనుకొనుచుండెను.

ఆకస్మికముగా దూరమునం దెవ్వరిదో యడుగులచప్పుడు వినవచ్చుటచే నాతఁడాత్రముతో నొక్కపరుగున గుమ్మమునొద్దకుఁబోయి, "ఎవ్వరు? గదుఁడా" అని కేక వేసెను.

దూరమునందుండి "కాదు, మహారాజా! నేనులాలును." అని సమాధానమువచ్చెను.

శ్యామ—రామచరణలాల్! ఏమికథ? ఇటురమ్ము! గదుఁడేఁ[illegible]డు?

అంతలో రామచరణలాలు తనప్రభుసన్నిధికరుదెంచి "గ[illegible]ఁడు లేఁడు మహారాజా!" అని పలికెను.

శ్యాము-(సవిస్మయుఁడై) లేనే లేఁడా? వాఁడెక్కడకుఁ బోయినాఁడు?

లాలు—వాఁడేమైపోయినాఁడో తెలియదుమహారాజా! ఎవ్వరి కిని దెలియలేదు.

శ్యామ—ఏమీ! అయిన భట్టాచార్యునికోడలో?

లాలు—ఆమెయును లేదు మహారాజా! గదునికోరికతీఱినది. గదునియింట నందఱు నేడ్చుచుండిరి మహారాజా!

శ్యామలాలునితలపై నాకాశమువిఱిగిపడిపోయెను. ఆతఁడు "ఏమి యీదుర్వార్త! సార్వభౌమునికోడలు వారియింట లేదా? గదుఁడామెను దీసికొని యెటకేనిపోయియుండును. కానిమ్ము; వారెక్కడకుఁబోఁగలరు? నిశ్చయముగా నేదియో కుతంత్రము జరిగిపోయినది. అరే! గదా! నేఁడీ లోకములో నీవైనన నుండవలయును; నేనైన నుండవలయును." అని యఱచుచుఁ గ్రోధాంధుఁడై శ్యామలాలుఁ డతివేగముగా నింటనుండిబయలు దేఱెను. హరిచరణుఁడును, లాలును నాతని వెనువెంటనే బయలుదేఱిరి.

---

## రెండవప్రకరణము

### పతనము.

మధ్యాహ్నము శ్యామలాలునియంతఃపురసౌధముపై నాతని భార్య విధుముఖీదేవి విహరించుచుండెను. విధుముఖ కప్పుడు పదునెనిమిదివత్సరములుండియుండును. విధుముఖ సుందరీశిరోమణిగాకపోయినను ఆమె మిక్కిలిలావణ్యమును, మంచియంగసౌష్ఠవమును గల్గియుండెను. దూరమునుండి చూచినవారందఱు నామెను సుందరీలలామయే యనకొందురు. కాని, సామీప్యమునందుండి చూచిన నామె దేహసౌందర్యమునం దనేకసామాన్యలోపములు గన్పడఁగలవు. ఆమెశరీరచ్ఛాయ తెల్లనిది. కాని, యందు రక్తకాంతిలేదు. ఆమెకన్నులు

విశాలములే. కాని, వానియందు సరళతాదృష్టులు లేవు; అవి కటాక్షశరములకు క్షయతూణీరములు. నాసిక యున్నతమైనదే కాని, స్థూలమైనది. నాసాపుటము లించుక విడంబములుగా నుండిన బాగుగనుండును. ఆమె నోరించుక చిన్నదియుఁ, గుబ్బగిల్లించుక పల్లవివియు నైనచో బాగుగనుండును. పెదవులుగూడఁ గొంచెము స్థూలములే. మొత్తముమీఁద నంగసౌష్ఠవముమంచిదే. కాని, యించుక మోటుగామాత్ర ముండును. కొంచెము పురుషాభినయముగలదైనను సగటున విధుముఖసుందరియే యనఁబడుచున్నది. విధుముఖ సంతతము సుందరియని చెప్పుకొనుటయే కాక, స్వయముగా నామె సౌందర్యగర్వముచే గర్వితురాలుగూడ నైయుండెను; ఆమె విశేషవిలాసవతి. అనేకములగు సబ్బు లామె దేహమునం దఱుగుచుండెను, అనేక పుష్పతైలము లామెశిరోజములను నాశ్రయించి చరితార్థములగుచుండెను; అనేకములగు నత్తరు లామెశరీరమున విలీనములై సామోదించుచుండెను. అనేకభూషణము లామె దేహసహవాసమున విభూషితము లగుచుండెను. నానాసమయములందు నానావస్త్రాలంకారశోభ లామెశరీరము నావరించుకొనఁగలయదృష్టము నంది కృతార్థము లగుచుండెను. విలాసములయందున దేహాలంకరణక్రియాకలాపములయందును నామెకు దినమంతయుఁ జాలియే యుండదు.

నేఁడు విధుముఖి సంపూర్ణాలంకారిణియై తన సౌధాంతరమునఁ బచారుచేయుచు నేమేమో చింతించుచుండెను. "నాయీసౌందర్యమంతయు, నీప్రాయమంతయు వ్యర్థముగదా! ఎవ్వరితృప్తి వలన, నెవ్వరివినోదము వలన నివియన్నియు సార్థకములు గాఁగలవో, నాతఁడొక్కమాఱైన నావంకకుఁ దిరిగి చూచుటలేదు; ఒకప్పుడైన నొక్కపలుకైనఁ బలుకుటలేదు; మఱచియైన నొక్కమాటయు నాడుటలేదు. ఇంతనిగ్రహము దుస్సహనీయముగదా; కాని, ఇదియంతయు నిగ్రహముగాక

యున గృహమేమైనను విధుముఖి దానివలనమాత్ర మేమిసుఖింపఁగల దు?" ఈవిధముగా నాసుందరి తనలోఁ దా ననేకప్రశ్నలు వేసికొనుచుండెను; అనేక తర్కవితర్కములు, ననేకాలోచనలుఁ జేసికొనుచు వానికి సమాధానములు స్థిరపఱచుకొనుచుండెను. చివరకు విధుముఖి సిద్ధాంతీకరించిన దేమి? "శ్యామలాలు హానికము; అతనివక్షమునం దెప్పుడును నీమౌక్తికహారము శోభఁగనఁజాలదు. శ్యామలాలు మూర్ఖశేఖరుఁ. ఈరత్నముయొక్క మహిమను గ్రహించు శక్తి యాతని కసాధ్యము. శ్యామలాలువంటి నరాధములకొఱ కీదేవభోగ్యపదార్థము సృష్టింపఁబడ లేదు. మానవసమాజము శ్యామలాలునిభాగ్యసూత్రమునకు విధుముఖిని ముడి వేసినమాట సత్యమే; కాని, దూరదృష్టి లేనియాసామాజికనియమములకు బాధ్యురాలై యుండుటమాత్రము విధుముఖి కిఁక సమ్మతముకాదు. శ్యామలాలుఁ డేమైన నట్టినియమగౌరవమును పాటించెనా? లేదు. అతఁడు సకలనియమములను సకలసదాచారములను త్రెంచివైచి బాహాఘాత మొనరించి నిత్యనిషేధములైన దుష్కార్యములయందు యథేష్టముగా మునిఁగి తేలుచు నానందించుచున్నాఁడు. అందుచే నిఁక విధుముఖిమాత్రము కుత్సితములు-ననాలోచితములు నగునట్టి సామాజికనిబంధనల కెందులకధీనురాలై యుండవలయును?" అని యామె విశ్వసించెను.

"శ్యామలాలునివంటి గర్దభముతో వివాహము గావించుకొనుటవలననే యీ వేషభాషలును, విలాసభోగ్యములగు నీయిష్టవస్తుసముదాయములును గావలసినన్ని సంపాదించినమాట నిజమే ఇందులకు శ్యామలాలునెడ కృతజ్ఞతగల్గియుండవలసినకారణం బేమియుఁ గనఁబడదు. ఈసుఖసౌభాగ్యములన్నియు నాయదృష్టమున విధినియోగముచే ఫలించినవి. శ్యామలాలునకుఁ గాక యేభిక్షుకునకు గృహిణినైనను విధుముఖి కీప్రార్థనీయపదార్థములన్నియుఁ బురాకృతపుణ్యముచే లభించియేతీరును." అని యామె భావించుకొనెను.

ఎంతయో వ్రాయుట మొదలకు? విధుముఖి నాయికలకళంకస్వరూపిణి-దుష్టకామినీగణాగ్రగణ్య. ఎట్టిపురదృష్టమువలననో మాకిట్టిపాపిష్టురాలిప్రసంగము లిపిబద్ధము గావింపవలసివచ్చినది. అయినను, ఈస్థలమునం దదియు నావశ్యక మేమైనది. హృదయాంతరమునం దేమికలదో కాని, పైకిమాత్ర మింతవఱకు నామె తనచరిత్రము కలంకితముగాకుండఁ గాపాడుకొనియేయుండెను. ఆమె యెవ్వనిగర్దభమనియు, సూకరమనియుఁ దనమనసులో నెంచుచున్నదో ఆశ్యామలాలునిచిత్తమును దనవంక కాకర్షించుకొనుటకై యనేకవిఫలప్రయత్నములు నేఁటివఱకుఁ గావించియే యున్నది. కాని, యిఁక నేఁటినుండియు విధుముఖి పాపమార్గమునం దడుగిడుటకు సంకల్పించుకొనినది.

విధుముఖి యెంతసేపటినుండియో తన యదృష్టమునుగూర్చి చింతించుచుఁ గ్రమ్మఱఁగాఁ బాపసంకల్పములైనకోరికల కాశ్రయ మిచ్చుచుండెనో, అంతసేపటినుండియు నామె వెనుకదిక్కునం దింకొక పడఁతి పొంచి నిలిచి యుండెను. ఆమెకు ముప్పదినలువదివత్సరముల నడిమివయసుండి యుండును. ఆమె యెఱ్ఱగాగరపై నొకనీలాంబరమును వల్లెవాటుగా ధరించియుండెను. ఆమెశరీరమునం దక్కడక్కడ విలువగలకొన్నిభూషణములు నుండెను. ఆమె నల్లనివర్ణముగలది. ఆమెహావభావములఁజూచిన నామె కుటిలస్వభావయని తోఁచుచుండెను. ఆమె చాలసేపటినుండి నీరవమై విధుముఖికిపశ్చాద్భాగమున నిల్వఁబడి నిల్వఁబడి చివరకొక్క నిట్టూర్పువిడిచి యిట్లుపలికెను. "నేనుఁ పురుషుఁడ నే నైయున్నచో నేమగును?"

విధుముఖి తత్క్షణమే యొకపెద్దనవ్వునవ్వి వెనుదిరిగి నిల్వఁబడియెను. "అట్లైనమాత్రమున నేమి? శారదా!" అని పలికెను.

శారద—అట్లైనచో నీచరణదాసుఁడనై జన్మసార్థకత గావించుకొనియే యుందును.

విధు—(సగర్వముగా) ఓహో! అటులయా? అది నాయదృష్ట మునందు లేదు. పురుషునిదాసునిగావించుకొనుట యొకసుఖమను మాట నిజమే. కాని, నేనట్టిసుఖానుభవముకొఱకుఁ బుట్టలేదు, నీవు పురుషుఁడవే యైనచో నీవంకఁ దిరిగిచూడకయే పోదును.

శార—అట్లైనచో నేను నీసమక్షమునఁ గత్తితో వక్షముఁ జీల్చుకొని ప్రాణములను విడిచియే యుందును.

విధు—(ఇంచుకవిషణ్ణస్వరముతో) ప్రాణత్యాగమను మాట నటుంచుము. మనసిచ్చి మాటాడువారైనను నాకిప్పటికగపడలేదు.

శార—నీమనసట్టిదగుటచే, నీ వట్లనుకొనుచున్నావు. నీ వెవ్వరిని గుఱించి చెప్పుచున్నావో, వారిని నీవు మనస్సులో నుంచుకొనలేదు.

విధు—వారు నేను ప్రేమించుచున్నట్లు నమ్ముట లేదాయేమి?

శార—నమ్ముటతో సరిపోలేదు; పిచ్చియే యెత్తిపోయినది. నోరారఁ దిండిలేదు.—కన్నారఁ నిద్రలేదు.

విధుముఖి శారదను మఱికొంత సమీపించి "నీకుఁ గనఁబడియెనా?" అని యడిగెను.

శార—కనఁబడియెను; మాటలాడెను.

విధు—నిజముగా?

శార—నేఁటిరాత్రి విధుముఖి యుద్యానములోనికి హరిచంద్రుఁడు వచ్చుటకు నిశ్చయించుకొనినాఁడు.

విధు—(సానందవదనయై) నీవు ప్రాపదివి గమ్ము.

శార—(నవ్వుచు నవ్వుచు) తొట్టద వెందుకువదినే? బీదవాండ్రనఁగానే యంతలోకువా?

విధు.—పోనిమ్ము, అట్లు నీకిష్టములేకున్న మాన్పివేసికొమ్ము.

తరువాత విధుముఖి తలవంచుకొని విచారభావముతోఁ జాలసే పొక్కచోటనే నిల్చుండి యాలోచింపఁజొచ్చెను. పిమ్మట నామె తన మనసులో నిట్లనుకొనియెను.—"ఏమో నేనెఱుఁగను; పాపమేమి పుణ్యమేమి? కాని, యేదారిలో నడుగిడుచున్నానో యాదారినుండిమాత్రము నేనిఁక వెనుదిరుగను. నేను మనుష్యజన్మమే యెత్తినచో సకలసుఖముల నేల విడుచుకొనవలయును? ఎవ్వరి నిర్బంధముచేతనో, నే నీ యాశాపూరితమైన జీవితమును దుఃఖములలో ముంపఁగలనా? చాల దుఃఖ మనుభవించినాను. ఈబంధమును ద్రెంచికొనఁగలను"

పిమ్మట నామె శారదవంకఁ జూచి "పద! లోనికిఁబద. ఏమేమి సంగతులు జరిగినవో, నీవేమి కట్టుదిట్టములు చేసితివో చెప్పుదువుగాని పద" అనియెను.

పాపపుణ్యవిముక్తులైనవారిరువురును లోనికేఁగిరి.

---

## మూఁడవప్రకరణము.

---

### ఉపదేశము.

ప్రత్యూషకాలమునందు శ్యామలాలు తనగృహోద్యానమున విహరించుచుండెను. అతనివెనుకనే యతని దివాను, హరకుమారచక్రవర్తి వచ్చుచుండెను. అతఁడు బహునిపుణుఁడు; అతనికి వయస్సు, ఏఁబదివత్సరములు దాఁటియుండును. అతఁ డతిశాంతసౌమ్యమూర్తి; విజ్ఞుఁడు. శ్యామలాలునియాకారము మిక్కిలి సత్యగ్రాహిగాను, అతనిగమనము నిచంచలముగాను ఉండెను.

హరకుమారచక్రవర్తి శ్యామలాలుని సామీప్యమునకువచ్చి వినీతభావముతో నిట్లుపలికెను-"చక్కఁగా నాలోచించి చూడవలయును. ఇది యెంతమాత్రమును మంచిపనికాదు."

శ్యామ——నేను చక్కఁగా వివేచించికొనియే యుంటిని. ఇది చాలమంచిపనియే; ఇంక నేసందర్భమునందైనను మీరు నాకాలోచన చెప్పవలసినయవసర ముండవచ్చుఁగాని, యీసందర్భములోమాటాడవలసినయావశ్యకము లేదు.

హరికుమా——నీకావశ్యకము లేదని నేనెఱుఁగుదును. కాని, యీదుష్కార్యమునుండి నిన్ను మరలించుట నాకు ముఖ్యకర్తవ్యము. సార్వభౌమభట్టాచార్యమహాశయుఁడు, నాతనికుమారుఁడు నవీనకృష్ణచంద్రుఁడు నజాతశత్రులు; పాపభీరువులు. అట్టివారిని నీవెట్టికష్టములో ముంచివైచితివో, అతనికింకను అనంతమైనదుష్కీర్తిలో నీవు మునిఁగి యుంటివి.

శ్యామలాలునకుఁ బట్టఁజాలనికోపము వచ్చెను. అతఁడు "దుష్కీర్తియా? నాకు దుష్కీర్తి నాపాదింపఁగలమగవాఁ డెవ్వఁడును నీప్రాంతములందు లేఁడు. కాని, నీనోటనే నేఁ డిట్టినిందావాక్యమును వినుచుంటిని; నీయీప్రసంగమాత్రము నాకుఁ జాల నసహ్యముగ నున్నది సుమా! నవీనకృష్ణునిభార్య యెచ్చటనున్నదో, నాఁ డామెను నోటఁబెట్టుకొని యేవిధముగా నెక్కడకుఁ బోయియున్నాఁడో యీసమాచారమంతయు నిశ్చయముగా నవీనకృష్ణచంద్రుఁడును నాతనితండ్రియు నెఱుఁగుదురు. వారెంతటిమోసగాండ్రో గాని యెట్టిప్రయత్నములుచేసియు నింతవఱకు వారినోటినుండి యీసంగతి బయటఁబెట్టింపలేకపోయితిని. నీవేమో వారినిగూర్చి మహాందోళన మొందుచున్నావు; అట్లయిన నీవు వారికడకుఁ బోయి యీరహస్యముఁ దెలిసికొనివచ్చి నాకుఁ జెప్పుము; నేను తక్షణము వారిని విడిచిపుచ్చెదను." అని పలికెను.

హరికుమా——నేనాసంగతి దెలిసికొనుటకనేకవిధములఁ బ్రయత్నించితిని. కాని, యీవిషయము వారెంతమాత్రము నెఱుంగరు.

గడుచు రాత్రి పదిగంటలవేళ నవీనకృష్ణునిభార్యను వెంటఁబెట్టుకొని పోయెను. ఆసిమ్మట నేమిజరిగినదో యింతపర్యంతము వారికించుకయుఁ దెలియనే తెలియదు.

శ్యామ—అది కేవలము వట్టిమాట! నీకువయసు పెద్దదైనకొలఁదిని బుద్ధి చిన్నదగుచున్నది; అందుచే నీవీయబద్ధపుమాటలు నిజమని నమ్ముచున్నావు. భట్టాచార్యుఁడును వానికుమారుఁడును నేటివఱకు నబద్ధవాదమే చేయుచున్నారు; రేపటినఱకుఁ జూడఁగలను; రేపటియుదయములోపల నవీనకృష్ణునిభార్యసంగతి యంతయు వారు తెలుపనియెడల రేపు వారిపాట్లు చూడఁగలము. రేపటినుండి వారికి గుప్పెడునాఁడే భోజనము పెట్టుదు; ఇంకను నెన్నియోపాట్లు పడవలసియున్నది. అప్పుడైనను నిజము నెక్కడదాఁపఁగలరో చూతము.

హరికుమా—నారాయణ! నారాయణ! ఇట్టియన్యాయకర్మములు జరుగునని యెప్పుడు ననుకొనలేదు. చిరకాలమునుండి నేను మీసంస్థానమునఁ బాలింపఁబడుచుంటిని. స్వర్గస్థుఁడైనమీపితృదేవుఁడు నన్నుఁ దనసహోదరునిఁగా భావించుకొనుచుండెడివాఁడు. ఆయన యాత్యాదశయందలికడపటివాక్యమున నాకాదేశించినదియుండే నేనింతవఱకు నియుక్తుఁడనై యుంటిని. నీకష్టసుఖములను జూచుచుండుటనిమిత్తమాతఁడు నాచేతిలోఁ జేయివైచి నాచేవప్పగింతచేయించుకొని మఱిప్రాణములు విడిచినాఁడు. అందుచేత నేను సర్వదా నీబాగు చూచుచుండుటే నాకు ముఖ్యకర్తవ్యముగా నెంచుకొనుచున్నాను. కాని, నాదురదృష్టమువలన నీవు నామాట లొకనాఁటికిని వినకయేయున్నావు. మంచిమార్గమునందు నీకు మిక్కిలి విరక్తి.

శ్యామలా—అవును; మీయనకోధమువలన నేను చాల సురక్షితుఁడ నగుచున్నట్లే కనఁబడుచున్నది! నాకానందముగాని, సుఖము

గాని, మేలుగాని, దేనివలనఁ గలుగఁగలదో దానికి మీరు విశ్వప్రయత్నముచేఁ బ్రాణమైన నొడ్డి యడ్డుపెట్టుచునేయున్నారు! మీరు నాకీవిధముగా హితకార్యమెలు చేయుచున్నారు. ఇఁక మీమాట వినుటయెట్లు? మాటతోమాటఁ గలిసినచో నవశ్యముగా మీమాట వినియేయుందును. నాకిప్పుడు నవీనకృష్ణునిభార్య లభింపకున్నచో నీప్రపంచముతో సకలసుఖములు వినష్టములైపోవునట్లె తోఁచుచున్నది; మీరేయుపాయముచేనైనను దానిని సమకూర్పకపోయినచో నాకుఁ గేవలము విరుద్ధకార్యమొనరించినట్లైకదా?

హరకుమారుఁడు తనలో "ఛీ! ఈలజ్జాహీనుని, యీజ్ఞానశూన్యుని, యీపాషండుని, యన్నముతినుట ఘోరపాపము! స్వార్థపరుఁడైన ప్రభుని కోరికచేఁ జాలనాళ్ళనుండి యీదురాత్మునియధీనమునఁ గాలయాపనముఁ గావించితిని; కాని, యిఁక నీనరాధమునితో సహవాసము దుస్సహమై పోవుచున్నది;" అని చింతింపఁజొచ్చెను. పిమ్మట నాతఁడు ప్రకాశముగా—"నీతోఁ దర్కముకావించుట యనవసరకార్యము. ఏలన? ధర్మసంగతియును యుక్తిసంగతియునగు నామాటకుఁగాని నీవించుకయుఁ జెవియొగ్గవు. అయినను నీకు నుపదేశ మొనరించుట నాకర్తవ్యము; నేనట్లే చేయుచుందును; వినుము; వినకుండుము; నీయిష్టము. నవీనకృష్ణునిభార్యను బొందకున్న నీకు మహావిపత్తు సంభవించునట్లే యెంచుచున్నావు. ఆమె పరస్త్రీగదా! ఆమెను బరిగ్రహించుటకు నీకెట్టి యధికారమున్నది?

శ్యామ—నాకు సంపూర్ణాధికారము గలదు. నేను ధనవంతుఁడను; బలవంతుఁడను; జమీందారుఁడను; వెంటనే రాని యెడల బలాత్కారముగాఁ దెచ్చుటకును నాకు శక్తిగలదు.

హర—అనేక కారణములచే నీవు మహాభాగ్యవంతుఁడవే; జమీందారుఁడవైనమాటనిజమే; కాని, యిదియంతయు మనకెక్కడిది?

అఘటనఘటనాసమర్థుఁడు వాఁ డెప్పటికేమిఘటిల్లఁజేయునో యేమి తెలియును! సరి దీని కేమి; ఇట్టియన్యాయాధికారము మాత్రము నీ కెంతమాత్రమును లేదు. శాసనములుగలవు; రాజుగలఁడు; సంఘమున్నది; ధర్మమున్నది; అన్నిటికి పైని పరమేశ్వరుఁ డున్నాఁడు. ఎట్టివ్యవస్థయుండైనను, ఎవ్వరికైనను నిట్టి యన్యాయాధికారముఁ గైకొనఁజెల్లదు. ఒకరియొద్దనున్నయొకముంటిచెల్లియైనను, నొకచింకిగుడ్డయైనను బలాత్కారముగ నూడఁబెఱికికొనుట కెవ్వరికి నధికారము లేదు. కులములోనుండి కులస్త్రీలను దెచ్చుట యెట్టిపనియో విచారించుము.

శ్యామ.—సరిసరి; ఇది నాకొకక్రొత్తపనిగాదు. ఇప్పటివఱకు నెన్నియో గొప్పకుటుంబములనుండి బాలికలను దెచ్చియున్నాను. నాకధికారములేనిచో నీవిధముగా నెట్లుజరుగును?

మాధవకుమారుఁడు, మూర్ఖుఁడైన శ్యామలాలుని యుక్తికిని దిగ్భ్రమువడిన దనలోఁ దానే యాలోచించుకొనుచు నవ్వుకొనఁజొచ్చెను. ఆతఁడు మరల శ్యామలాలునిఁ జూచి "సరియే, నీవు చిరకాలమునుండి యిట్టికార్యములే చేయుచున్నావు; కాని, యన్యాయకృత్యము లెన్నిమాఱులు చేసినను, అవి యెప్పటికి నన్యాయకృత్యములే. ఒక దొంగవాఁడు పలుమాఱు దొంగతనముచేయుచుండినను వాఁడంతమాత్రమున నిఁక దొంగతనముచేయుట కధికారి కాఁగలఁడా? అది మంచిపనియని యెవ్వరైనఁ బరిగణింతురా?" అని పలికెను.

శ్యామ.—ఏమో, నేను చేయుచున్న యీకార్యముల నెట్టిదుష్కార్యమో నాకుఁ దెలియలేదు. నేనెప్పు డెవ్వరిని దెచ్చుచుందునో; అప్పుడే వారి కనేకమర్యాదలు, ననేకబహుమానములు గావించి మఱి పంపుచుందును. ఇది వారియెడల నొకవిధమగు నదృష్టముగాఁ జూడఁ బరిణమించుచున్నది!

హరి—నాతర్కమువలన నీవు విరక్తుఁడవు, సంతుష్టుఁడవు నగుచున్నట్లు తోఁచుచున్నది; కాని, నీకు హితవాక్యము లుపదేశించుట నాకావశ్యకము. చూడుము. నీయంతఃపురమునందు నీకు సుందరమణియైనభార్య యున్నది. ఈలోకములో నీకంటె ధనవంతులును బలవంతులును సమర్థులు నగువా రనేకు లున్నారు. ఈసంగతి నీ వెఱుఁగనిది గాదు. దైవయోగమున నీకంటె నధికుఁ డొకఁడు నీపట్టణమున కేకార్యముకొఱకైన వచ్చి యుండెననుకొనుము; సుందరియగు నీభార్య యెట్లో వానికంటఁ బడెననుకొనుము. తత్క్షణ మాతఁడు తనసేవకులైనసిపాయీలనుబిలిచి "ఈజమీందారుని భార్య సుందరి. ఆమె నేయుపాయము చేతనైనను నాకడకుఁ దీసికొనిరండు" అని యాజ్ఞాపించెననుకొనుము. అప్పుడాసిపాయీలు బలోద్రేకులై నీపైఁబడి భయానకముగా నిన్ను నిరోధించి నీభార్యను దమయజమానుని కర్పింతురనుకొనుము. అప్పుడాపరమపాపాత్ముఁడు ధనబలశక్తిగర్వితుఁడై నీభార్యను సర్వనాశము నరించి యనేకమణిమాణిక్యాదులనిచ్చి యామెకు సెలవొసఁగునను కొనుము. ఇట్లయినచో నీహృదయ మప్పు డెట్లుండును చెప్పుము?

శ్యామలాలు సకలప్రకారములచేతను దానీజగములోనద్వితీయుఁడనని నమ్మియుండుటచే హరకుమారునకు సులభముగా నిట్లుత్తరమిచ్చెను. "అట్లగునని యెన్నఁడు ననుకొనవలదు; అట్లని స్వప్నమందైనను దలఁపవలదు. శ్యామలాలునినామము విన్నంతమాత్రముననే భయపడని ప్రాణియుండునని యైన నెంచవలదు.

హరకుమారుఁడప్పుడు లోలోన నవ్వుకొనుచు "సరే, ఆమాటకేమి! నీవు బలవంతుఁడనుగదాయని ప్రజలయెడల నిట్టియన్యాయాచరణము లొనరించుట యుచితమగునా? నీవు దేశమునకు రాజవు; అందఱకును రక్షకుఁడవు. నీవిట్టిదుష్కీర్తిని బొందవచ్చునా?" అని యెను.

శ్యామ—ఏమియన్యాయాచరణము?

హర—అన్యాయకృత్యమేమో నీకుఁ దెలియుటలేదా? నీవెంత బాలికామణులను సర్వనాశ మొనరించుచున్నావో, అట్టివారితో నీవొక దినమో యర్థదినమో కృత్రిమామోదము నొందుచున్నావు; మఱికొందు దినములకు వారినామములు వారియాకృతులు మఱచియే పోవుచున్నావు. అది నీకు క్షణికామోదము; కాని, వారుమాత్రము చిరస్థాయిగా సర్వనాశ మొందుచున్నారు. వారికి జాతి, సంఘము, ధర్మముఁబోవుచున్నవి; సంసారమునందలి సకలసుఖములు నాశనములగుచున్నవి. ఎందఱు స్త్రీలీవిధముగా సర్వనాశ మొందుచున్నారో వారియాత్మీయులైన స్వజనులు, వారితల్లిదండ్రులు, అత్తమామలు, సోదర సోదరీమణులు, మొదలగు వారందఱుఁ జిరకాలము మహాంతికదుఃఖములపాలై తలలు పాతాళలోకమునకు వంచుకొని బ్రతుకవలసినవా రగుచున్నారు.

శ్యామ—నాకుమీయీవృథాతర్కమునఁ గేమియు నర్థము కన్పటలేదు. భగవంతుఁడు సకలోపాయములను నాకెఱింగించియే నన్నుఁ బుట్టించినాఁడు. ఎవ్వరో యేమో అనుకొందురని, యెవ్వరికో యేమో కష్టముగానుండునని మనము మాటాడక కూర్చుండవలసినదేనా? సరిసరి! ఆవ్యాపార మంతయు సామాన్యమానవుల పక్షమునకుగాని, మాబోటి గొప్పవారిచర్య లట్లుండవు. అవి వేఱు. మీరు తత్క్షణమే బయలుదేఱి పోయి యేప్రయత్నముచేతనైనను నవీనకృష్ణుని భార్యవృత్తాంతము తేవలయును.

హరకుమారుఁడు తనలో "అయ్యో! ఏమి చేటుకాలము! ఈనరాధముఁడు తుట్టతుద కిట్టిదుష్కార్యములకును నాపైఁగూడఁ బెట్టయత్నించుచున్నాఁడు. నేను వీనితండ్రియీడువాఁడను; పితృబంధువుఁడను; పితృతుల్యుఁడను. పరమేశ్వరకటాక్షమున నిప్పటికైన నీపాపపురినుండి నెమ్మదిగా నావలఁబడుట మంచిది." అనుకొని ప్రకాశముగా నిట్లనియెను. "నామూలమున నిట్టివార్తలేమైన నీవు సంగ్రహించుట యసంభవ

ము. ఇదిగాక నాపై నిట్టికార్యభారముపెట్టుట నీకు లజ్జాకరమైనసం
గతి."

శ్యామ.—ఏమీ! నీవు నాకు సేవచేయుటలేదా? నాయన్నము తినుటలేదా? నాకెప్పు డెట్టికార్యము లవసరములో, అప్పు డెల్ల వానిని జేయుచుండుటకు నాసేవకు లందఱు బాధ్యులు; నీవును బాధ్యుఁడవే.

హారకుమారుఁ డీమాటలు తనలో "నీకు సర్వనాశ మతిసామీప్యమునందే యున్నది. ఈపాపశాంతి యవశ్యముగా నతిశీఘ్రముగాఁ గావలసినదే." అనుకొని ప్రకాశముగా నిట్లుపలికెను "నేను వృద్ధుఁడ నైతిని. చిరకాలమునుండి మీయన్నముతినుచుంటిని. ఇఁక మీకార్యము లన్నియు నేఁజక్కఁబఱుపలేనని మీకుఁ దెలియును. దయచేసి యిఁక నాకు మీసేవనుండి సెలవొసంగుటయే మంచిది."

శ్యామలాలు "హీహీహీ"యని నవ్వుచు నిట్లు చెప్పెను. "నీవిప్పుడు మిక్కిలి వృద్ధుఁడవైతివి; పనిచేయఁజాలవు. ఈసంగతి నేను చాలదినములనుండి గ్రహించుచునేయున్నాను. అయినను నీవిప్పుడు స్వయముగానే సెలవు దయచేయుమనుచున్నావు. ఇది నీయదృష్టమే. లేకున్న నేనెప్పుడో నాయంతటనే స్వయముగాఁ దఱిమివేయవలసియుండును.

హారకుమారుఁడు "చిత్తము."అని తనలో "పాపస్వరూపుఁడైన యీపాపభువున కిటనుండి, రెండవబలిపురుషుఁడైన హరిచరణునకు ప్రధానమంత్రిత్వము కాఁగలందుకు గాఁబోలును. సరే! ఇఁక వ్యవహారధర్మము లన్నియు రసాతలమునకు వేంచేయుఁగలవు. ఏదియెట్లైనను నేను మాత్రము దూరముగాఁగల్గితినా ధన్యుఁడను." అనుకొనుచు నెమ్మదిగా నటనుండి వెడలెను.

సరిగా నాసమయముననే యింటియొకప్రక్కనుండి దుర్మార్గుఁడైన హరిచరణుఁ డక్కడకువచ్చి దూరముగా నిల్వఁబడి శ్యామలాలునిఁ

జూచి యిట్లనియెను. "నవీనకృష్ణునిభార్య దొరకినది; మనయొద్ద నెవరు దాఁగియుండఁగలరు?"

శ్యామ—(ఆతురముతో) ఎక్కడ? ఎక్కడ?

హరి—చాలదూరముననున్నది. నాకుఁ బరిచయమైనయొక చోట నొకగృహస్థులయింట గనుఁ డామెను దాఁచివచ్చినాఁడు. ఇప్పుడిక్కడకు మనము తీసికొనిరావలయును.

శ్యామ—నిజము. ఎంతసొమ్ము వ్యయమైననుసరే; ఏమైననసరే; త్వరలో మాపనియే చేయవలయును.

హరి—ఈసార్వభౌమభట్టాచార్యులు నీతనికుమారుఁడును బహుదుష్టులు; వీరు నిజముగా నంతయు నెఱుఁగుదురు. అయినను నించుకయు నెఱిఁగియున్న ట్లంగీకరించినారుగారు. వీరికిఁ దగినశిక్ష చేయుటయే మంచిది.

శ్యామ—ఏమైననుసరియే; వీరలను గాలుసేతులు బంధించి కొట్టులోఁ బెట్టించియే యుంచెదను.

హరి—బలే! మీరుధర్మస్వరూపులు. మంచియేర్పాటుచేసినారు. నిశ్చయము. అట్లే చేయవలయును.

శ్యామ—హరిచరణా! నీవ్యవహారమును, నీకార్యతత్పరతయుఁ జూడఁగా నాకుఁ జాల సంతుష్టియగుచున్నది. నేఁటినుండి నిన్ను నాప్రధానమంత్రిగా నుంచుకొనుటకు నిశ్చయించుకొంటిని. నీవిప్పుడే పోయి హరకుమారునిగుమాస్తావద్దనుండి కాగితములను గైకొని పనియందుఁ బ్రవేశింపుము.

శ్యామలాలుని యీమాటలు వినఁగానే హరిచరణుఁ డించుక సేపు నిశ్చేష్టుఁడై నిల్వఁబడిపోయెను. కంచుకాగడలతో వెదకినను గుక్షిలో విద్యాలేశమైనలేని హరిచరణుఁడు స్తోత్రపాఠములును, దుష్ప్ర

చర్యలు నవలంబనములుగాఁగల హరిచరణుఁడు- ఒకచిన్నగుమాస్తాపనిచే యుటకైనను సమర్థుఁడుగాని హరిచరణుఁడు నేఁడు ఈమహావిభవమునకు సకలకార్యకర్త కావలసివచ్చెను. అందుచే నాతఁడు కొంతసేపటివఱకు హృదయావేదనకుఁ బాల్పడియెను. కాని, యాతఁడు వెంటనే సహజమైన తనమొండిధైర్యముచే గుండెను దిటవుపఱచుకొని శ్యామలాలునిఁజూచి తనచేతులుజోడించుకొని "ప్రభువా రీమా అత్యంతోపయోగమైన కార్యభారమును నాపైఁ బెట్టినారు. వ్యవహారకార్యములయందు హరిచరణున కెట్టిదక్షతగలదో ధర్మస్వరూపులగు ప్రభువా రీమాయు చిత్తగింపఁగలరు. చుట్టుపట్టులఁ బదికోశముల దూరములోనున్న సంసారుల యిండ్లలోని బాలికల నందఱను జాగ్రత్తపెట్టుట హరిచరణుని ప్రధానకర్తవ్యము." అని పలికెను.

హరిచరణునియీసాధుసంకల్పమును, గర్తవ్యపరాయణతను తెలిసికొనుటచే శ్యామలాలు నిరతిశయప్రీతిసాగరమున నొక్కమాఱుగా మునిఁగిపోయెను. పిమ్మట వారిరువురు నిట్టిశుభకార్యపరంపరలను గూర్చి యాలోచించుకొనుచు నక్కడనుండి వెడలిపోయిరి. పోవుచుఁ బోవుచు హరిచరణుఁడు మనస్సులో "ఈమహారాజ్యమునకు నేనుగూడ నేఁటినుండి యొకవిధముగా రాజునైతిని. ఈరాజ్యమునకు రాజేశ్వరి యిదివఱకే నాచరణసేవకురాలయ్యెను. ఇఁకఁ గంటకస్వరూపుఁడైనశ్యామలాలు నేవిధముచేనైన దూరముచేయఁగల్గితినా నామనోరథము ఫలించిపోవును. అదెంతపని! క్రమముగా నాకార్యము నెఱవేర్పఁగలను; లేకున్న నాయతిశయమేమి? ఆహా! నేఁడు నాపిఘుముఖసంతోషమునకు పారముండదుగదా" అనుకొనఁజొచ్చెను.

---

## నాల్గవప్రకరణము.



### సంకల్పము.

హరకుమారబాబు విశేషానందముతో నుద్యానవనములోనికిఁ బోయెను. హరకుమారుఁ డతిబాల్యమునుండియు, శ్యామలాలుని తండ్రియు స్వర్గస్థుఁడునైనరాధావినోదవన్ద్యోపాధ్యాయునియనుగ్రహముచేఁ బ్రతిపాలితుఁడగుచువచ్చెను. హరకుమారుఁడు నిరుపేదలయింటిబిడ్డ; బాల్యమునందే యీతని కధ్యయనమునం దత్యంతమైనయనురాగము కల్గెను; కాని, పఠనగ్రంథములు సంగ్రహించుటయు, నధ్యాపకునిఁబడయఁగల్గుటయుఁగూడ నాతనిస్థితికి నసంభవములుగానే యుండెను. హరకుమారునియదృష్టమున నిట్టిసమయమునం దొకనాఁడు విశేషైశ్వర్యశాలియైన రాధావినోదవన్ద్యోపాధ్యాయునితో దైవికముగా మాటాడుట సంఘటిల్లెను. ఈపరిసంగమునందే హరకుమారుని బ్రదుకుఁ దెరువు నిర్ణయింపఁబడి యాతనిజీవనపరిణామమునందలియడ్డంకు లన్నియుఁ దీఱిపోయినవి. రాధావినోదబాబు, బుద్ధిమంతుఁడును బ్రియదర్శనుఁడునగునీబాలునికిఁ దనయింటనే వసించుచుండుటకును, దన యధ్యాపకునిసమక్షముననే తనతో నధ్యయనమొనరించుటకును సమ్మతి నొసంగెను. హరకుమారునికంటె రాధావినోదబా బించుకపెద్దవాఁడు, అయినను వీరిరువురు నొకచోటనే యుండుట, యొకయధ్యాపకునికడనే యధ్యయనమొనరించుట మొదలైనకారణములచే, వీరి కన్యోన్యస్నేహబంధ మేర్పడియెను. వీరి కితరములైనస్థితిగతులయం దెంతటిప్రభేదమున్నను బైకారణముచే వీరిస్నేహలత క్రమముగా యథేష్టముగాఁ బెఱిగి పెంపొందసాగెను. హరకుమారుఁడు సహజమగునసాధారణప్రతిభాబలముచే యథేచ్ఛగా విద్యాధన మార్జించుకొనఁజొచ్చెను; మఱియు నీతఁడు కేవలవిద్యార్జనమేకాక, సద్వివేచనము, సుధీరబుద్ధి మొదలైనసుగుణ

ముల నత్యంతము నభ్యసించుచుండెను. రాధావినోదబాబు పితృహీనుఁడగుటచే నాతఁడుస్వయముగనే జమీందారీపనులయందు ప్రవేశింపవలసి వచ్చెను. ఈతఁడు క్రమముగా హరకుమారుని దనప్రభుత్వకార్యముల యందు సహాయునిఁగను, దనకార్యాలోచనలయందు బెద్దగను జేసికొనియెను. ఈకారణములచే హరకుమారునివ్యావహారికజ్ఞానము క్రమముగా విశేషపరిపక్వము గాఁజొచ్చెను. రాధావినోదబాబు క్రమముగా సకలకార్యభారము హరకుమారునిచేతఁబెట్టి తాను ప్రభుత్వసంబంధములైన ముఖ్యకార్యములయందుమాత్రమే సంబంధముగల్గియుండెను.

హరకుమారుఁడును, ఉత్తరోత్తరాభివృద్ధినొందుచున్నతనకార్యదక్షతచే రాధావినోదునకుఁ బ్రధానమంత్రిగానుండి నెలకైదువందలరూప్యములవేతనమును బడయుచుండెను. హరకుమారున కిండ్లు, వాకిండ్లు, భార్య, సంసారము, నన్నియు నేర్పడి యాయనయొకగొప్పసంసారియయ్యెను. కాని, యాతనికి సంతానముమాత్రము కలుగ లేదు.

రాధావినోదబాబుతోడిహరకుమారునిస్నేహబంధము క్రమముగా మిగులబలవత్తరముగాఁజొచ్చెను.వారియంతరంగములయందు ప్రభుభృత్యవ్యవహారము తిరోహితమైపోయి వారేకప్రాణముగానుండిరి.

ఇట్లుండఁగా రాధావినోదబాబునకుఁ గాలమాసన్నమయ్యెను. మరణకాలమునం దాతఁడు తనసకలవ్యవహారకర్తృత్వమును హరకుమారునిహస్తమునందుంచి చనిపోయెను. ఆతఁడు చనిపోవునప్పటికే తనపుత్త్రుఁడైనశ్యామలాలునిభవిష్యజ్జీవన మత్యంతనిందనీయము గాఁగలదని యాతని కనుమానము కలిగియుండెను. అందుచే నాతఁడు పదింబదిగా శ్యామలాలునకు సర్వదా హరకుమారునియుపదేశాధీనుఁడవై యుండవలయుననియు, నాతని జనకసమునిగా భావించి విశ్వసింపవలయుననియు నుపదేశించెను. శ్యామలాలు తండ్రియుపదేశము నేరీతిగాఁ బరిపాలించుచుండెనో చదువరులకుఁ దెలిసియేయున్నది.

రాధావినోదబాబు కాలధర్మమునొంది మూఁడుసంవత్సరములైనది. ఆతనితదనంతర మాతనికుత్తరాధికారియు-నేకమాత్రపుత్త్రుఁడునైనశ్యామలాలుఁడాతనిధనసంపత్తిని హస్తగతము గావించుకొనియెను. శ్యామలాలు కేవలధనాదాయము పరిచూచుకొనుపనిమాత్రమే తాను స్వీకరించి ధనమును యథేచ్ఛముగా దుర్వ్యయముగావించుచుండెను. హరకుమారబాబు తక్కినకార్యభారమంతయుఁ దనపైవైచికొనినవరించుచుండెను. హరకుమారుఁడు శ్యామలాలునిదుర్వ్యయప్రవాహమునకడ్డుదగిలి యనేకవిధముల దానిని నివారించుటకుఁ బ్రయత్నములు కావించుచునేయుండెను. కాని, యాతని కందువలనఁ బరాభవముకొంటె వేఱుఫలములభింపకుండెను.

మఱియొకవత్సరమయ్యెను; శ్యామలాలునితల్లియు నీయిహలోకమును విడిచిపెట్టెను. అంతటినుండియు శ్యామలాలునిదుర్వ్యయములును, దుర్నయములును మేరమీరి పోజొచ్చెను.

హరకుమారుఁడు తనప్రభువును, సజ్జనుఁడును, బరలోకగతుఁడునునైనతనప్రాణమిత్రుని-రాధావినోదుని మనోరథమునకుఁ బరతంత్రుఁడై యతికష్టముతో శ్యామలాలునియధీనమునందెట్లో కాలము వెళ్లఁబుచ్చుచు నీమూఁడునాల్గువత్సరములును గడిపెను. కాని, యింకను నిట్టిపాపప్రవాహమును వృద్ధిబొందించుట హరకుమారునివంటిధర్మభీరువునకు మిక్కిలి యసంభవముగదా. కావున నాతఁ డక్కడనుండి శాశ్వతముగా సెలవుఁదీసికొనుట కనుకూలమార్గముల నన్వేషించుకొనుచుండెను. నేఁడట్టిశుభసమయము సంఘటిల్లుటచే నాతఁడు పరమానందమును బడయఁగల్గెను. స్వయత్నరక్షితమును బహుదినసేవితమునైన యావిపులసంపత్తికిక ముందు విధ్వంసదశ రాఁగలదుగదాయని యాతఁడు తెలిసికొనియును, అందుల కాతఁడు దుఃఖితుఁడు గాలేదు. ఎందుచేత? అట్టిసంగతి యాతనిచేతిమీఁదుగా జరుగదుగనుక.

హరకుమారుఁ డప్పు డుద్యానవనమునుండి బయలుదేఱి కచ్చే రిభవనమున కభిముఖముగా నడువఁజొచ్చెను. ఆమార్గము రెండుప్రక్కల వృక్షపంక్తులుగలిగి మనోహరముగా నుండెను. ఆదారి ననేకులువచ్చుచుఁ బోవుచు నుండిరి. వారందఱును దర్శనమాత్రముననే హరకుమారు నకు సంభ్రమముతోఁ బ్రణామాదికములొసంగుచు దూరముననొదిగి నిల్వఁబడుచుండిరి. బలిష్ఠదేహుఁడైనను ధవళకేశాలంకృతుఁడై యొడలి నిండ వస్త్రమునుగప్పికొని వచ్చుచున్నయొకముసల్మానుఁ డాతని కవనతమస్తకుఁడై నమస్కరించిప్రక్కకొత్తిగిలి నిల్వఁబడియెను. ఈతఁ డాదివాణమునకుఁ బ్రాచీనభృత్యుఁడు; ప్రధానుఁడైన గుజ్జపువాఁడును. ఈతనిఁజూచినంతనే హరకుమారుఁడు "జరిఫ్!" నేఁటినుండియు మీరుఁ గ్రొత్త "దివాను"గా నేర్పడినారు. నేను నాయుద్యోగమునుండి సెలవు దీసికొంటిని." అని పలికెను.

జరిఫ్—ప్రభూ! ఇట్లుగావించుట కిచ్ఛగించితి రేమి ?

హర—ఇచ్ఛగింపక చేయునదేమి ? ఇఁకను బదిదినము లిచ్ఛగింపకున్నచో నవమానితుఁడనై మఱిపోవలసివచ్చును.

జరిఫ్—అదిసత్యము. ఈసంస్థానమును మీవలె నుద్ధరించువా రెవ్వరు ? కాని, యిటుపిమ్మట నీసంస్థానముగతి యేమికావలయును ?

హరకు—ఈశ్వరేచ్ఛ యెట్లో యట్లే కాఁగలదు. అతికష్టముతో నేనీమూఁడుసంవత్సరములకాలము వెళ్లఁబుచ్చితిని; ఇఁక నొక్కదినము దొర్లించుటకుఁగూడ నాకు సాధ్యముగాదు.

జరిఫ్—నేఁటినుండియు నీకార్యభారం మెవ్వరిచేతికివచ్చునో ప్రభువువా రెఱుఁగుదురా ?

హరకు—ఓహో, ఎఱుఁగకేమి ? హరిచరణబా బింతటినుండి మీకు దివానుకాఁగలఁడు.

జరీఫ్——ప్రభూ ! ఎవ్వరు ?

హారకు——ఆతని నీవెఱుఁగవా ? ఆతఁడు సర్వదా బాబుగారి కనువర్తియై యుండునే ! ఆతఁడు బాబుగారికార్యము లన్నియు స్వయముగా నెఱవేర్చుచుండును !

జరీఫ్——ఓహో, ఆతఁడా ! నిజము ! సదా బాబుతోఁగూడ నొడలు తెలియక తిరుగుచుండు నామహాభాగ్యుఁడు సకలగుణాభిరాముఁడే !

హారకుమారుఁ డొకచిఱునవ్వు నవ్వెను.

జరీఫ్——ప్రభూ ! ఏమనెదరు ? ఆమూర్ఖుఁ డీయెస్టేటునకు దివానుగాఁగలడా ? అయ్యో ! సర్వనాశముకాఁగలదే ! ధర్మస్వరూపులైన నాప్రభువువారు నాకనుజ్ఞయిచ్చినచో నేనుగూడ బాబువద్ద సెలవు గైకొందును. ప్రభువువారు లేనిచో నెవ్వరియొద్ద నేను నౌకరీచేయుదును ?

హారకు——వద్దు, జరీఫ్ ! నీవు వెడలిపోవలదు. మనమిరువురము నీసంసారమునకుఁ బురాతనభృత్యులము. నీవు కోచిమేన్‌గా నున్నను సకలవిషయములు నెఱిఁగినవాఁడవు. స్వర్గస్థుఁడైనప్రభువు నిన్నును నీగుణములను జాలఁ బ్రేమించుచుండెడివాఁడు. ఆకస్మికముగా నీయుద్యోగమును వదలవలదు. ఈయైశ్వర్యమంతయు-శీఘ్రకాలములోనే సర్వము నంతరింపఁగలదని తోఁచుచున్నది. ఆవిమ్మట నీవిటనుండవలసినపనియే యుండదు. కాని, నీవంతవఱకు నుద్యోగమును స్వయముగా వదలవలదు. నీవిచటనుండినచో నాకనేకవిషయములు తెలియఁగలవు. ఈశ్వరకటాక్షమున్నచో ననేకసంగతులు నీవలనఁ దెలిసికొనవలసిన ప్రయోజనముగూడ సంఘటిల్లఁగలదు.

జరీఫ్——ధర్మావతారులైనప్రభువువారియాజ్ఞ శిరసావహింప

గలను. కాని యిక్కడనుండునంతకాలము మరణతుల్యమైనజీవనము చేయుచున్నాననుట మఱవవలదు. సరియే! దానికేమి. ధర్మావతారులైన నాప్రభు విప్పు డెక్కడకు వెడలిపోవునో, యేమిచేయునో, అదిమాత్రము నాకెఱింగింపవలయును.

హారకు.—నేనిప్పుడు శీఘ్రముగా నీదేశమును విడుచుటకును, తరువాతఁ బుణ్యక్షేత్రమైనకాశికిఁ బోవుటకును నిశ్చయించుకొన్నాను.

జరిఫ్—ప్రభువును సదా హృదయములో నుంచుకొనెదను. ప్రభువుహా రెఱుంగని దేమిగలదు? మంచిదినములు సంఘటిల్లినప్పుడు కార్యసంధానము చేయుటకుఁ బ్రభువు నన్ను మఱచిపోవలదు. అట్లయినచో నాకుఁ బాపముమాత్రమే మిగులును.

హార—ఒక్కనాఁటికి నిన్ను మఱవను; ఎప్పుడును మఱవను. అట్టిసుదినములు ఘటిల్లినప్పుడు ముందుగా నీకే తెలియఁబఱచెదను. అందుకొఱకే నిన్నిచ్చటనుండుమని నేఁజెప్పియున్నాను. అందువలనఁ జాలఁబ్రయోజనముగలదు. ఇప్పుడు నేను బయలుదేఱుటకుముందు నిన్ను మఱియొకసారి కలిసికొనియెదను.

జరిఫ్ అవనతశిరస్కుఁడై తనరెండుచేతులు భూమికిఁ దాకునట్లు హారకుమారునకుఁ బ్రణామముఁ గావించెను. హారకుమారుఁడు నిష్క్రమించెను.





# యోగేశ్వరి.

తృతీయఖండము—ఎండ—నీడ.

## మొదటి ప్రకరణము.

### ధర్మకళంకము.

పగలు రెండుయామముల వేళ యైనది. విలాసపురమను నొక పల్లెటూరిలో రామచంద్రముఖోపాధ్యాయుని భవనమునం దొక మూలగదిలో నధోముఖియై యొక యువతీమణి కూర్చుండియుండెను; ఆమె మోము మిక్కిలి వాడియుండెను. ఆమె హృదయనాళము లతితీవ్రము గఁ గొట్టుకొనుచుండెను! ఈసుందరీరత్నము సార్వభౌముని కోడలును, నవీనకృష్ణుని భార్యయు నైన సుహాసిని. ఈసుందరీతిలకము సౌందర్య మత్యంతమాధుర్య మయమైనది. ఈసౌందర్యమునందు, ఆతపతీక్ష్ణత గాని, విద్యుచ్చాంచల్యముగాని, భాద్రపదగంగాప్రవాహవేగము గాని, ప్రభంజనగతిగాని కన్పట్టదు. ఆయందములోఁ జంద్రకిరణముల స్నిగ్ధత్వమును, మలయమారుతముల శీతలత్వమును సుమముల సురభిళత్వమును మఱియు దూరాగతకోకిలారవమునందలి మధురత్వమును గలవు. ఆమె యుజ్జ్వలవిశాలలోచనములు సరళదృష్టులకంటె నన్యమెఱుఁగవు; అవి కుటిలకటాక్షవివర్జితములు. ఆమెవాక్కులు పవిత్రతాసంశ్లిష్టములు; కుత్సితప్రసంగవివర్జితములు. ఆసర్వాంగసుందరి సర్వావయవములను లజ్జ యనుస్వాభావికవసన మొకటి యాచ్ఛాదించుకొని.

యుండెను. ఆమెకు సుహాసినియను పేరెంతయు సార్థకముగా నుండెను. ఆమె యెప్పుడు నవ్వినను ఆనవ్వునుండి పెద్దశబ్దము వినఁబడదు; ముఖకాంతి వికారమును బొందదు; ముఖగహ్వరము విస్తృతమైపోయి నోటిలోని దంతములన్నియుఁ బరిదృష్టములు గావు; మఱియు గంభీరభావసూచకములైన ప్రసన్నతావిశేషములేమియు నానవ్వులోఁగన్పట్టవు. ఆమెహాసము మెల్లమెల్లగాఁ బెదవులప్రాంతములయందు విలీన మగుచుండును; ఆణిముత్యములనిరసింపఁజాలిన రదనములు కెంపు,మూఁతెప్పలైనను, ఆనవ్వులోఁ గన్పట్టుటయుఁ గలదు. ఆమెలోచనద్వయముఁ గపోలభాగములు, లలాటఫలకమును నామె నవ్వునప్పుడు ప్రదీప్తము లగుచుండును. ఆహాసము చూపఱహృదయములయం దత్యంతానందజనకములైన స్థాయీభావముల సంచరింపఁజేయును.

సుహాసిని మోము వాల్చుకొని యేమో చింతించుచుండెను. ఇట్టి సమయమునం దొక ప్రౌఢవయస్కురాలైన పితామహస్త్రీ యక్కడకరుగుదెంచెను. ఆమె దూరమునందే నిల్వఁబడి సుహాసిని నిట్లు పలుకరించెను, “నీ విప్పుడేమిచేయుటకు నిశ్చయించుకొన్నావు ?”

సుహా—అమ్మా! యేమిచేయుదును? ఏమిచేయుటకు నేమియును దోఁచుట లేదు. మీకంటె నాప్తులు నాకిక్కడ నెవ్వరును లేరు మీరెట్లు చేయుమనిన నట్లు చేసెదను.

పిత—ఏమిచెప్పుటకు నేమియుఁ దెలియుట లేదు. నీవొంటియింటికోఁడలవు. నీవు మాకు సమీపబంధువురాలవే మోయనిన నదియును గాదు. మీతల్లి మాతండ్రి మేనమామకుమారునకుఁ బినతల్లి. ఆసంబంధమున కేమిగాని, మర్యాదగల యింటిబిడ్డ ఆపదలోఁ బడి వచ్చినప్పుడు పదిదినము లింట నుంచుకొనుటలో హానియేమియు లేదు; కాని,లోకులు పదిమందియుఁ బదిమాటలు ననఁగానే మాకుఁగొంచెము సిగ్గుగానున్నది.



సుహా—సిగ్గా! సిగ్గెందులకు?

విత—సిగ్గునకుఁ గారణ మడిగెదవా? నీవేమో అత్తింటినుండీ బయలుదేఱి వచ్చితివి. నీవు వచ్చుట మీయత్తవారెవ్వరు నెఱుఁగరని చెప్పుచున్నావు. నీవొక భయంకరచండాలమానవునితో రాత్రివేళ వచ్చితివి. జమీందారునిభయముచే నిట్లువచ్చితినని చెప్పుచున్నావు. ఆజమీందారుఁడు పరమదుర్మార్గుఁడని మేమును వినియున్నాము. కాని, దానికి మాత్రము హద్దులేదా? ఇంటిలోనివారెవ్వరు నామాత్రముజాగ్రత్తదీసికొనరా? అయినను, మీయింటివారెవ్వరు నిన్నిమూఁడుదినములనుండి వెదకుచున్న జాడయైనఁ గన్పట్టుటలేదు. ఇదంతయుఁ జాల నాశ్చర్యముగా నున్నది; నాల్గుమూలల నుండియు నలుగురు హేళనము చేయుచున్నారు. మేము నీమామగారికి నీభర్తకు వర్తమానము చేయుదు మనఁగా వారి వర్తమానమునకుఁ జాలభయపడుదురని నీవు విచారించు చున్నావు. ఇదంతయు నాకేమియు బోధపడుట లేదు. ఎవ్వరితో నేమియుఁ జెప్పఁజాల కున్నాము. ఇందువలన మాకెంతయు లజ్జగా నున్నది.

ఈమాటలన్నిటిని సుహాసిని నెమ్మదిగా వినియెను. ఆయింటివారి హృదయములలో నెట్లున్నను పైవారి సాధారణదృష్టి కంతయు దోషావహముగనే యున్నదని తత్క్షణ మామె గ్రహించుకొనియెను. ఆమె మోము వంచుకొని యించుకసేపు చింతించెను; ఆమె విశాలనేత్రముల నుండి వేడికన్నీటిచినుకులు భూదేవిపై నొలికెను. కాని, యప్పుడామె మాటాడుట కశక్తురాలై పోయెను. విశేషసంభాషణమూలమునఁ దననిర్దోషత్వమును స్థిరపఱచుకొనుట కామె కిప్పుడు సాధ్యము గాకుండెను. ఆమె యించుకసే పట్లు చింతించి నెమ్మదిగా నిట్లనియెను. "మీరు నన్నిప్పుడేమి చేయుమన్నారు?"

విత—చెప్పుట కేమిగలదు? నీవును బుద్ధిమంతురాలవు. ఇప్పుడేమి చేసిన బాగుగనుండునో యోజించుకొనుము. మామగారి యింటికి





## తృతీయఖండము.

కేఁగుట యుత్తమము; ఇప్పుడిట్లు చేయుటకు నీకుఁ గష్టముగా నున్నచో నిక్షేపమువలెఁ బుట్టింటికిఁ బోవచ్చును.

మరల సుహాసిని చాలసేపు చింతింపఁ జొచ్చెను. సుహాసిని పితృహీన. ఆమెకుఁ దల్లితక్క పుట్టినింట నింకెవ్వరును లేరు. ఆమె పుట్టినింటివా రించుక ఉపపత్తిగలవారే. కాని, వారియూరుమాత్రము శ్యామలాలుని జమీందారీలోనిదే. కావునఁ బుట్టినింటికిఁ బోవుటకు సుహాసినికిఁ బొత్తుగా సమాధానము కాకుండెను. అక్కడఁ దనకు ధర్మరక్షణము దొరకదని యామెయూహ. దుర్వృత్తుఁడైన శ్యామలాలుఁ డెట్టి దుస్సాధనములచేతనైన, సాధ్యమగునంతవఱకుఁ దనమనోరథసిద్ధికి సకలప్రయత్నములు చేయుటలో వెనుదీయువాఁడు గాఁడని యామె యెఱుఁగును. సుహాసిని మనసులో నిదియంతయుఁ దలపోసికొని యిఁక బుట్టినింటికెంతమాత్రమును వెళ్ళఁగూడదని నిశ్చయించుకొనియెను. ఇవియన్నియుఁ జింతించియే సుహాసిని యత్తిల్లుఁ బుట్టిల్లు వదలి యేకుటుంబికుల యింటనో, యేమారుమూలనో దాఁగి ధర్మరక్షణము గాపాడుకొందమని నిశ్చయించుకొని యిక్కడకు వచ్చిచేరెను. కాని, తనలోపలఁగల యీ సంగతి యంతయు నామె పరులసమక్షమునఁ జెప్పఁజాలక పోయెను. ఇతరుల యెదుట నింతసమాచార మామె నోటినుండి వెడలుట యసంభవమే.

“అయ్యో! ఈ దూరపుబంధువులు నామూలమున నెంతె లజ్జితు లగుచున్నారు! నిజముగా నాస్థితి యసంగతముగనే యున్నది. కాని, యేవిధముగా నేనింతకంటె సుస్థితి నిప్పుడు పొందఁగలను? ఎట్లు స్థిరపఱచు కొనుటకును నాహృదయమునకుఁ గుదురు లేకున్నది” అని యామె చింతించుచుండెను. ఆమె చరిత్రము లోకదృష్టిలోఁ గళంకితమై యున్నది. లజ్జచేతను, గలఁతచేతను, దుఃఖముచేతను ఆమెగుండెలు పగిలిపోఁజొచ్చెను. కాని, ఆమె యిట్టియవస్థలో నుండియు బాహ్య



కళంకమువలన నేను ధైర్యము విడువఁ గూడదు. నాయంతరంగపారిశుద్ధ్యమే నన్ను రక్షింపఁగలదు" అని ధైర్యము తెచ్చుకొని "మిక్కిలి కష్టసమయములో వీరి యాశ్రయము చేరి నాజాతిధర్మమును గాపాడుకొంటిని. వీరిప్పుడు నావలన లజ్జితులు గావలసి వచ్చుచున్నది. నానుదుట సర్వేశ్వరుఁ డేమి లిఖించెనో యదియే కాఁగలదు; కాని, యిఁక వీరికి నావలన నెంతమాత్రమును గష్టము మాత్రము కలుగఁ గూడదు." అని నిశ్చయించుకొని యావితంతువును జూచి, యిట్లు పలికెను. "అట్లే చేసెదను. అమ్మా! రేపటి యుదయమున నేనిఁక నిక్కడ నుండను."

ఆవితంతు వక్కడ నుండి లేచెను. ఆమె పోవుచుఁ బోవుచు "అమ్మా! అట్లుచేయుము. లేకున్నఁ దలయెత్తుకొని తిరుగుట కష్టముగా నున్నది." అని వెడలిపోయెను.

సుహాసిని "ఇఁక నిక్కడ నెంతమాత్రము నుండఁగూడదు. కాని, యెక్కడకుఁ బోవలయును? ఏమిచేయుదు? ఏమియు స్థిరపఱచుకొనఁ జాలకున్నాను." అని విచారింపఁ జొచ్చెను. అప్పు డామెకు "గదుని మాట జ్ఞప్తికి వచ్చెను. అత్యంత కష్టసమయమునందు వాఁ డామెకెంతయు నుపకార మొనరించియున్నాఁడు. శ్యామలాలునివద్దకుఁ దన్ను బలాత్కారముగా నెత్తుకొని పోవుటకు గదుఁడు వచ్చినప్పుడు, ఆమె, తన మామగారు గాని, తనభర్త గాని శ్యామలాలుని బారి నుండి తన్ను రక్షించుట యసాధ్యమని గ్రహించెను. వెంటనే యామె దీనదయాపరుఁడగు పరమేశ్వరున కొక సాష్టాంగనమస్కారముఁ గావించుకొని, గదుని మెల్లదిగాఁ బిలిచి తన శరీరముపై నున్న సకలాభరణములును వానికి నొలిచి యిచ్చుటకును దన్ను వాఁడు విలాసపురమునందలి తనబంధుగులయింట జాగ్రతగా విడిచి పెట్టుటకును బ్రార్థించెను. ఆమె మేనితొడవులన్నియు, వెండిబంగారములు కలిపి యొకవేయి రూప్యములు విలువగలవి యుండెను. ఈశ్వరకృపచే గదుని కవియన్నియుఁ జూడఁ

గనే కన్నులు దిరిగిపోయెను. వానిజన్మములో వాని కొక్కసారిగా నింతధన మెప్పుడును లభింపలేదు. ఇంక ముందు లభింపఁగలదన నాశయు లేదు. అందుచే వాఁ డిదియంతయుఁ దన పూర్వకృతమైన విశేషపుణ్యముచే లభించినదనియు నాదులకు సందేహము లేదనియు నిశ్చయించుకొని పరమానందభరితుఁ డయ్యెను. అట్టిసమయములో వానికి, శ్యామలాలుబాబునకుఁ గోపము వచ్చునేమోయని యొక్కమాఱు స్ఫురించెను. కాని, వానికోపమువలన వీని కేమినష్టము గలదు? గదునకు సోనాపురములో నొకచిన్ని గుడిసె యైనను లేదు; వాఁడింక నాదేశమునకుఁ బోనేపోఁడు.

సుహాసినిని దీసికొని గదుఁడు సోనాపురమునకుఁ బ్రయాణము సాగించి, యామెను వారిబంధువుల యింట సురక్షితముగాఁ జేర్చి యామెకప్పుడు సాష్టాంగనమస్కారము గావించెను పిమ్మట సుహాసిని తనయాభరణము లన్నియు మూటగట్టి యీయఁగా వాఁడామూటను గైకొని యక్కడనుండి పలాయితుఁడయ్యెను. వాఁడింక మరల దేశమునకుఁ బోనేలేదు.

సతీత్వధర్మరక్షణముకొఱకు సుహాసిని గదునితో నిట్లు ప్రయాణముచేసెను; కాని, యీసమాచార మెంతమాత్రము నామె మామగారుగాని, యామె పెనిమిటిగాని యెఱుఁగరు. అయినను పాపాత్ముఁడైన శ్యామలాలుని దుర్ణయముచే వారు సర్వనాశమై పోవలసి వచ్చెను.

గదుఁ డెక్కడకుఁ బోయెనో సుహాసిని యెఱుఁగదు. ఇట్టి దుస్థితిలో నింకొకమాఱు గదుఁడు కనఁబడినఁ దనకెంతయో యుపకారము జరుగునని యామె యనుకొనెను; వాఁడామెను "అమ్మా" యని పిలిచి బిడ్డవలెఁ గావలసిన ట్లుపచరించెను; కాని, వాఁడిప్పు డెక్కడనున్నాఁడు?

ఆసుందరీమణి చాల సేపు దుఃఖించెను. తరువాత నొకదీర్ఘనిశ్వా

సను విడిచి, లేచి నిలిచి యిట్లనుకొనెను. "ఎవ్వరు లేకున్నను, ఆపద్బాంధవుఁడైన నారాయణమూర్తియే గలఁడు?"

సుహాసిని వెంటనే గృహము విడిచి వెడలెను.

---

## రెండవ ప్రకరణము.

---

### గంగాయమునా సంగమము.

వేకువజామున, విలాసపురమునకు రెండుక్రోశముల దూరమున దక్షిణదిశనున్న యొకపెద్ద వటవృక్షముక్రింద, భువనమోహిని యైనసుందరీమణి యొకర్తు యొంటరిగాఁగూర్చుండియుండెను. ఈమె మన సుహాసినియే. తనవారికి లజ్జాదుఃఖములకుఁ గారణమగుటకంటెఁ దనజీవన మెట్టివిపత్తులలోఁ బడినను మంచిదియే యని యామె నిశ్చయించుకొనియెను. అందుచే నామె యానిశీథమున నాయంధకారమునఁ దనశరీర సౌందర్యమును మాఱువేషముచేఁ గప్పికొని, విలాసపురములోని బంధువుల యిల్లువిడిచి యొంటరిగాఁబ్రయాణమై వచ్చెను. ఆపద లంతకంతకు గాఢతరములైపోవుచున్న ట్లామెకుఁ దోఁచుచుండెను. ప్రస్తుత మామె యాశ్రమమునందు నూతనవిపత్తులేవియు సంభవింపలేదు. సుహాసిని నిస్సహాయురాలు; అల్పవయస్కురాలు; కాని, యామె యాపదలు దశదిశల మితిమీరి వ్యాపించిపోవుచున్నవి. భర్త దగ్గఱలేఁడు. తల్లి దగ్గఱలేదు. మామ దగ్గఱలేఁడు. నిస్సహాయురాలైన యాకామినీమణి సతీత్వధర్మరక్షణముకొఱకు, అసమసాహసికకార్యమునఁ బ్రవృత్తురాలయ్యెను. తిండిలేదు; వస్త్రములేదు; ఒక్కపైసయైనను జేతలేదు; నిల్వఁబడుటకు నివాసములేదు; నిందాప్రవాహము నాల్గుమూలలనుండియు నామెకుఁ దలపునక్కలుగాఁ బ్రవహించుచు దూషణఘోషణము గావించుచుండెను. అవస్థలన్నియుఁ బ్రతికూలములుగా నుండి యామెకుఁ గళంకము తె

చ్చుచుండెను. కాని, యిదియంతయు నేమి? ఇది యంతయు మిథ్యాప్రసంగము. ఆమె నిజముగాఁ బరమపవిత్రురాలు; అపవిత్రతానుతాపముచే నామె దగ్ధురా లగుటలేదు. అవునా? కాదా? యను మిథ్యానిందలామెకు సంభవించుచున్నమాట నిజమే. కాని, సుహాసిని యెన్నివిపత్తుల నడుమ నైనను, నిప్పటికిని దేజస్వినియై, ప్రసన్నతాపరిపూర్ణయై నిలిచి యున్నది. కాని, యాతరువాత?

తరువాత నేమిచేయవలయును? అదియే యిప్పటి విషమసమస్య. అంధకారము పటాపంచలైనది; నవోదితుఁడైన భాస్కరుని మధురోజ్జ్వలకిరణములు సౌందర్యరాశిని సముద్భాసితము గావించివేయుచుండెను. ఆవటవృక్షమూలమునందు వనదేవత సజీవభావముతో విహరించుచున్న ట్లామె మెఱసిపోవుచుండెను. ఆమఱ్ఱిచెట్టునకు సామీప్యముననే జనులు నడచెడు పెద్దబాటయున్నది. ఆపార్శ్వముననే యొకపెద్ద సరోవరము గూడ నున్నది. ఇప్పు డనేకజను లీమార్గమున రాకపోకలు చేయఁగలరు. ఇప్పుడీసరోవరమునకుఁ గూడ ననేకులు వచ్చుచుఁ బోవుచుందురు. చాలమంది మంచివారికిని, చెడ్డవారికిని, ఆమె యిప్పుడు కన్నులయెదుటఁ బడవలసియున్నది. అప్పు డేమికాఁగలదు? భగవానుఁ డేమిచేయఁగలఁడో అది కాఁగలదు.

ఈచప్పుడేమి? ఈపాదధ్వని యెవ్వరిది? అవచ్చువా రెవ్వరు? ఎవ్వరో వచ్చినమాట నిజమే; కాని, అది స్త్రీవ్యక్తి. సుహాసిని యొకనిట్టూర్పు విడిచి గుండె కుదురుపఱుచుకొనెను. ఎవ్వరో స్త్రీ వచ్చినది. కాని, యామె యంతదగ్గఱగా రాలేదు. దూరమున నిల్వఁబడియే సుహాసిని యలోకసామాన్యమైనరూపరాశిని జంచలభావముతో వీక్షింపఁజొచ్చెను. కొంతసేపటికి సాహసించి యామె సుహాసిని దగ్గఱకువచ్చెను. ఆమె చేతిలో నొక పెద్ద కడవఁ గలదు. ఆమె మాసిపోయిన యొక ముదుకచీరను గట్టుకొని యున్నది. ఆమె రెండుచేతులకు నిండుగా గాజు

లు దక్క నామె శరీరమునం దెక్కడ నొక్క యాభరణ మన్నమాట నైనను లేదు. చామనచాయతో నామె పుష్టిగా మంచిబలిష్ఠమైనదిగఁ గన్పడుచుండెను; ఆమె మోము గూడ శ్రీముగా నుండెను; ఆమె మధ్యవయసునం దుండెను. ఇరువదినైదు, ఇరువది యాఱు వత్సరములకంటె నెక్కువవయసు లేదు. ఈకాంత్రియామె సుహాసినిదగ్గఱకు వచ్చి చేతిలోని కలశమును దింపికొని "ఆహా! ఈదినమెంతో సుదినము" అని పలికెను.

సుహా.—అమ్మా! నాదినము లొకదినముకంటె నొకదినము దుర్దినము లగుచున్నవి.

స్త్రీ—అవు నట్లే తోఁచుచున్నది. కాకున్న నీవిట్లొక్కడ నెందులకుందువు? నీ మెడమీఁది కేదో కత్తి వచ్చినది గనుక నే నీకిట్టి దుర్దినము సంభవించినది; సంగతి చూడఁగా నీకెవ్వరు దోఁపుసేడ యున్నట్లు తోఁచుటలేదు. కాని దో నిట్టికష్టమేమి?

సుహా—అయ్యో! మెడమీఁదఁ గత్తి పడిన నేకష్టమును లేకపోయియే యుందును. దొంగలు నాసర్వస్వమును దోఁచుకొని పోవుటను రాఁగా నాకుఁ బ్రతుకుపై నాశవదలక యిట్లుబయటఁబడి వచ్చితిని.

స్త్రీ—దొంగలను బాఱఁగొట్టువా రెవ్వరును లేకపోయినారా అమ్మా!

సుహా.—ఉన్నారు; లే కేమి? కాని దొంగ చాలబలవంతుఁడు.

స్త్రీ.—తెలిసినది. మగవాఁడ నైనచో నేనుగూడ నీభాగ్యవంతురాలి సర్వస్వము దోఁచుకొనుటకే ప్రయత్నించి యుందునుసుమా! ఇట్టిరత్నమును బడయఁగల్గుట కెట్టిదోపిడి చేసిన నేమి? కాని, ముందు గతి?

సుహా.—దేవుఁడే!

స్త్రీ—సరే. నాఁడుండనే యున్నాఁడు. కాని, మనప్రయత్నము గూడ మనము చేయవలదా?

సుహా—అమ్మా! అందుకు నీవే కలవు.

స్త్రీ—సరియే. అట్లనే. కొంచెమునే పాఁగుము. నేను కడవతో నీరు తెచ్చెదను.

ఆమె యక్కడనుండి వెడలిపోయి, వెంటనే కడవనిండ నీరు ముంచి తీసికొని తిరిగివచ్చి యిట్లనెను. "అమ్మా! నీవు బ్రాహ్మణస్త్రీవలె నగపడుచున్నావు. మేము శూద్రులము. అయినను నీకెట్టిలోపమును రానీయను. దయచేసి నాతో రమ్ము!"

సుహా—అట్లే పోవుదము. కాని. నిన్ను నే నేమని పిలువవలయునో చెప్పుము!

స్త్రీ—"దాసీ" అని.

సుహా—అబ్బా, ఆలాగేందుకు? నీవు నాకు సోదరివి.

స్త్రీ—సరే అట్లైన మనమిరువురము గంగాయమునలము. నీవు గంగవు; నేను యమునను. నీవు తెల్లనిదానవు, నేను నల్లనిదానను. బాగున్నదా?

సుహా—(మధురహాసముతో) బాగున్నది. చక్కగానున్నది.

దాసి ముందు నడువనారంభించెను. ఈమె తనపేరు దాసి, అని చెప్పుటలో నసత్యములేదు. ఆమెపేరు హరిదాసియో, రామదాసియో, కృష్ణదాసియో యేదియో యొకదాసి యైనమాట నిజము. కాని, యామె నందఱును దాసి యనిమాత్రము పిలుచుచుందురు. దాసివెనుకనే సుహాసిని యవనతముఖియై నడువఁజొచ్చెను.

## మూఁడవ ప్రకరణము.



### భవిష్యత్ప్రతిబింబము.

దుర్వృత్తుఁడైన శ్యామలాలు, సార్వభౌముని నవీనకృష్ణుని విడిచిపెట్టెను. హరిచరణునిమాటవలన, నీతండ్రికొమారు లిద్దఱును సుహాసిని ప్రయాణవృత్తాంత మెఱుఁగ రనియు, దురాత్ముఁడైన గదునిమూలముననే యీయరిష్టము ఘటిల్లినదనియు నాతఁడనుకొనియెను. ఇప్పుడాతనికి గదునిపైఁ గల్గిన కోపమునకు మేర లేదు. గదునిగాని, గదునిమృతకళేబరమునుగాని తనయెదుటఁ బెట్టఁగలవానికి విశేషబహుమానము నొసఁగెద నని యప్పుడాతఁడు ప్రకటించెను; కాని, గదునిజాడ యించుకైనఁ దెలియలేదు. గదునకుఁ జెల్లెలుగాని, బిడ్డలుగాని లేరు. వానికొక యుంపుడుకత్తె యుండెను గాని యదియు నిప్పుడు పలాయితురాలయ్యెను.

సార్వభౌమనవీనకృష్ణులు చెఱనుండి విముక్తులైనమాట నిజమే గాని వారిదురవస్థ యెంతమాత్రమును వారిని విడువలేదు. వారిదేహమున నాఘాతచిహ్నములు నిండియుండెను. వారు చెఱనుండి యింటికిఁ బోవుసరికి వారి వాసగృహము భస్మీభూతమైపోయెను. వారి యిరుగుపొరుగుకుటుంబములవా రెవ్వరెక్కడకుఁ బోయినదియుఁ దెలియలేదు. వారియావులును లేఁగలును గొన్ని యింట్లతోఁ గాలిపోయినవి; కొన్ని పాఱిపోయినవి; కొన్ని దొంగలపరమైనవి. వారి పిత్రార్జితములైన దేవతార్చనసామగ్రిలు భస్మీభూతములైపోయెను. వారిప్పుడు కట్టబట్టయుఁ దినఁదిండియుఁగూడ లేక బికారులైయుండిరి.

గ్రామస్థులలో నెవ్వరికిఁగాని, వారి కేవిధమైనసాహాయ్యము చేయుటకును ధైర్యము లేకుండెను. అవలంబనము లేక వారా గ్రామమును విడిచి పరదేశమునకుఁ బోయి యొకధనికుల గృహము నాశ్రయించి

చుకొని బ్రతుకవలసివచ్చెను. తనకోడలు గదుని చేతిలోఁ బడి ధర్మభ్రష్టయయ్యెననియుఁ జిరగౌరవసమన్వితమైన తనకులము నేఁడందుమూలమునఁ గళంకితమై పోయెననియు సార్వభౌముఁడు భావించుకొనియెను. ఆతని కిప్పుడా పాపాత్మురాలిని వెదకుటవలనఁ బ్రయోజనము లేదు. ఆమె మృతవార్తనే యాతఁడు సదా కోరుకొనుచుండెను; కాని, సుహాసినినిఁ గూర్చి నవీనకృష్ణుఁడు మాత్ర మిట్లించుకయు భావించుకొనఁజాలక పోయెను. తనసుహాసిని రూపమునందే కాక గుణమునందుఁ గూడ నిరుపమానురాలని యాతఁడెఱుఁగును. సుహాసిని ధర్మనాశనభయంబున నిశ్చయముగా నేసురక్షితస్థలమునందో దాఁగియుండుననియు, లేక ప్రాణత్యాగము చేనైన స్వధర్మముఁ గాపాడికొని యుండుననియు, నెట్లును నామెదేహమునకపవిత్రత సంఘటిల్లి యుండదనియు నాతఁడు విశ్వసించియుండెను. తనతండ్రి తనను బిలిచి సుహాసినినిగూర్చి యిఁక మఱచి పొమ్మని తనభావము వెల్లడించి చెప్పినప్పుడు నవీనకృష్ణుని హృదయము విదీర్ణమైపోయెను; కాని, యాతఁ డత్యంతపితృభక్తుఁడగుటచేఁ దండ్రిమాటకు మాఱాడఁజాలక తలవంచుకొని తండ్రియాజ్ఞకు సమ్మతింపవలసినవాఁడయ్యెను.

సరళహృదయా! సుహాసినీ! ధర్మరక్షణార్థము నీవు హృదయబలమును, బుద్ధిబలమును గొంత వినియోగించితివి. ఎన్నియో విపత్తులు నిన్నుఁ జుట్టుకొన్నవి. కాని, ఓపవిత్రరమణీ! నీకష్టసాధ్యప్రయత్నము వలన నేమిఫలము గలుగఁగలదో యెఱుఁగుదువా యేమి? నీవిప్పుడు నీ సంఘములోఁ గళంకితురాలవుగాఁ బరిగణింపఁబడుచున్నావు. పితృసముఁడైన నీమామగారి నిర్దయకు నీవిప్పుడు పాత్రురాలవై యుంటివి. కర్ణకఠోరములగు ఘోరనిందలకు నీవు పాల్పడితివి. ఇదిగాక దేవతాస్వరూపుఁడైన హృదయేశ్వరుఁడు నిన్ను మరల స్వీకరించునని యెంచుటకును వీలులేదు. దశదిశలనుండియుఁ గల్పనాతీతములైన కష్టములు

నిన్నుఁ గబళించుచున్నవి; కబళింపనున్నవి. కానిమ్ము; నిందకుల పాపపు జిహ్వలు నిన్ను బహువిధముల నిందింపనిమ్ము. ప్రతికూలఘటనాపరంపరలు నీకు విరుద్ధముగా సాక్ష్యము నియ్యనిమ్ము—సర్వదా నీవెవ్వని నిహపరదైవముగా నారాధించుకొనుచున్నావో, అట్టినవీనకృష్ణునిహృదయమునందు నీపవిత్రతనుగూర్చి సందేహమించుకయును లేదు.

ఓసాధ్వీమతల్లీ! నీ కింకేమికావలయును! పద! సుహాసినీ! పద! అపనిందల నణఁగఁద్రొక్కుకొనుచు, విపరీతసంఘటనల విరియఁజిమ్ముకొనుచు, నిశ్చలహృదయముతో నీవు నీధర్మపథమున ముందునడువుము. నీకు భయమెందులకు? నీధర్మమే నీకు సాహాయ్యము గాఁగలదు.

శ్యామలాలూ! పాపనిమగ్నుఁడవైన శ్యామలాలూ! నీయవివేకమువలన, నీయన్యాయప్రభుత్వమువలన నేఁడొక స్వర్గదేవత యనంతదుఃఖసాగరమున ననిర్వాచ్యకళంకనీరమునఁ గొట్టుకొని పోవుచున్నది. అన్నముఁ బున్నెము నెఱుఁగని నీదేశవాసులందఱు నాశ్రయహీనులై, తేజోహీనులై ధనహీనులై, యాహారవిహీనులై, భిక్షుకులైపోయిరి. నరాధమా! నీ వేమనుకొనుచున్నావు? నీపాపముల కెన్నటికైనను బ్రాయశ్చిత్తము లేదా?

ప్రాయశ్చిత్తము లేకేమి? ఉన్నది. అదిదుర్జ్ఞేయాంధకారాచ్ఛన్నమైన భవిష్యద్గహ్వరమునం దున్నది. కాని, నేఁటి నీదుర్దశమాత్రము మిగుల శోచనీయమైనది. రూపవతియైన నీభార్య యవిశ్వాసినియై వంచకుఁడైన నీసేవకున కంకశాయినియైయున్నది. నీవిస్తృతవిభవమంతయుఁ బరహస్తగతమై యున్నది. నీవు విశ్వసించిన నీయుద్యోగులును, నీయర్ధాంగస్వరూపిణియగు నీధర్మపత్నియు నీసర్వనాశనము గావించుటకే కృతసంకల్పులై యున్నారు. అకటా! నీభవిష్యద్గతి యేమగునోగాని, నీవర్తమానస్థితి పాషాణహృదయులగు పగవారికిఁగూడ హృదయవిదార

కముగా నున్నది! పాషండహృదయులగు పాపాత్ముల సంసర్గమున నీవు హితాహితజ్ఞానశూన్యుఁడవై, భోగలాలసుఁడవై, కర్తవ్యతాదృష్టిహీనుఁడ వైపోయితివి. స్వార్థసుఖపరాయణుఁడవై పరార్థభంగాచరణమున హృదయహీనుఁడ వైపోయితివి. ఇందుకొఱకే-ఓనరప్రేతమా! న్యాయస్వరూపుఁడైన శ్రీమన్నారాయణుఁడే నిన్నిట్టిదురవస్థకుఁ బాల్పఱిచెను. నీవు నీవర్తమానదురవస్థ నింకను గుర్తింపఁజాలకున్నావు. జాగ్రత్త! నీ దుర్దశానుభవకాల మింతకంటెఁ గఠోరతరమును, ఇంతకంటె భయంకరమునుఁ గాఁగలదుసుమా! జాగ్రత్త!

దురాత్ముల హృదయములు పాషాణములవలెఁ గఠినములయ్యును, అప్పుడప్పుడు వానినిభృతప్రదేశములనుండి మృదులామృతధారలు ప్రచ్ఛన్నముగాఁ బ్రవహించుటయుఁ గలదు. ఒక్కొకప్పుడు, ఒకానొక శుభసమయమునందవి ప్రబలబలసంపన్నములై యంతరంగమునంతను జల్లఁబఱిచి మాధుర్యమయముగాఁ జేయనుఁగలవు. అయ్యమృతధారాప్రభావమున దుర్భేద్యమగు నాపాషాణహృదయముగూడ క్షణములో నితాంతకోమలమును, నిరతిశయప్రేమమయమును దుష్క్రియాకలుషితము నగు నాహృదయమునందు శాంతి యావిర్భవించుటయు, సుఖసమావేశమగుటయుఁ దటస్థించును. కాని, యధముఁడా! నీవ్యవహారము చూడఁగా నీకట్టి సుఖమయపరివర్తనము లభించునను నాశ యెంత మాత్రమును గల్గుటలేదు. నీయట్టిపాపాత్ముల కెట్టి భయంకరపరిణామము గల్గునో యెవ్వరు చెప్పఁగలరు?



# యోగేశ్వరి

చతుర్థఖండము—జ్యోత్స్న.

## మొదటి ప్రకరణము.

### యోగమును—భోగమును.

ఒకనాఁటిమధ్యాహ్నము కాశీపట్టణమునందు నీలరతనబాబు విశాలభవనములో శ్యామలాలుని "దివాను" మనకుఁ బూర్వపరిచితుఁడగు హారకుమారుఁడును, నీలరతనబాబును, ఉమాశంకరుఁడును, గూర్చుండియుండిరి. ఆసామీప్యమునందున్న మఱియొక గదిలో ఆనందమయియుఁ, గాళతారయు, నన్నపూర్ణయు, హారకుమారునిభార్యయగు భవసుందరియుఁ గూర్చుండియుండిరి.

శ్యామలాలునిచే సాగనంపఁబడి హారకుమారబాబు సపరివారముగాఁ గాశీధామమునకు వచ్చియున్నాఁడు. హారకుమారునకు నీలరతనబాబు బాల్యస్నేహితుఁడు. హారకుమారుఁడు సపరివారముగాఁ గాశికి వచ్చినందులకు నీలరతనుఁడు పరమానందభరితుఁడై పోయెను. మఱియు హారకుమారునకుఁ దనసామీప్యమునందే మంచిభవనమున గుదిర్చి యాతనిని గుటుంబముతో నందుండునట్లు గావించెను. ఆబాల్యబంధువు లిద్దఱును దమవృద్ధదశయం దీపుణ్యక్షేత్రమున ననోన్యసమావేశము నందఁగల్గుటకుఁ బరమసంతోషభరితులైరి. హారకుమారుఁడు దినమునకు మూఁడువంతులకాలము నీలరతనబాబు భవనముననే గడుపుచుండును. ఉభయకుటుంబములవారును నొకరియింటి కొకరు తఱచుగా రాకపోకలు సేయుచు నత్యంతసుఖముతోఁ గాలక్షేపము చేయుచుండిరి. దుర్గా

ర్గుండైన శ్యామలాలుని యాశ్రయము వదలివచ్చినప్పటినుండియు హరకుమారునకు సుఖతరమైన నూతనజీవన మొకటి లభించినట్లుండెను. ఆతని యుద్యోగకాలములో నాతఁడు మితవ్యయమువలనను సద్వివేకము వలనను జాగ్రత్తపెట్టుకొనిన ధనసంచయముతో నిప్పు డాతఁడు స్వచ్ఛందజీవయాత్రను నిర్వహించుచు యథేష్టముగా నుండెను. ధర్మచింతయు సాధుసంగతియునే ఆతనికిప్పుడు ముఖ్యములైన యిష్టకార్యములు. కాశికి వచ్చినతరువాత హరకుమారునకు, ఉమాశంకరుని పరిచయముకలిగెను. నీలరతనబాబుగృహమున నాతఁడుమాశంకరుని నాలుగైదుపర్యాయములు చూచుటయు, ధర్మవిషయికప్రసంగముఁగూడఁ జేయుటయుఁ దటస్థించెను. క్రమముగా నుమాశంకరునకు హరకుమారునితో విశేషమైన చనవుచేకూరెను; ఈబాలసన్యాసి విజ్ఞానము, సచ్చరిత్రము నాంతరిక తేజముఁ జూచుకొలఁదిని హరకుమారుఁడు విముగ్ధుఁడు గాఁజొచ్చెను.

ఒకనాఁడు వారికి, అనేకప్రసంగములైనతరువాత శ్రీకృష్ణచరిత్రమునగూర్చిన ప్రసంగము ప్రారంభమయ్యెను. ఉమాశంకరుఁడప్పుడు శ్రోతలయెదుటఁ దనయభిప్రాయము నిట్లు వ్యక్తీకరించెను "శ్రీకృష్ణుఁడు నిజముగాఁ బరిపూర్ణబ్రహ్మస్వరూపమున నావిర్భవించెనో లేదో అది నేను చెప్పఁజాలను. మఱియు నావిషయములో వాదానువాదములు గావించుటవలన నెట్టిప్రయోజనమును లేదనియే, నాయభిప్రాయము. మన యార్యులు బ్రహ్మమును "సగుణబ్రహ్మ" "నిర్గుణబ్రహ్మ" యని రెండువిధములుగా నిరూపించిరి. సగుణబ్రహ్మసాధనమూలముననే నిర్గుణబ్రహ్మసిద్ధి కాఁగలదు. బ్రహ్మజ్ఞానసిద్ధికి యీతత్త్వమే యత్యంతసారవంతమును, పరమశ్రద్ధతో నాచరింపఁదగినదియునైనది. నిర్గుణబ్రహ్మసిద్ధియైనపిమ్మట సగుణబ్రహ్మమువలన నిఁక నెట్టిప్రయోజనము నుండదు. కేవలము సగుణబ్రహ్మ మొక సోపానమువంటిది. నిర్గుణబ్రహ్మసిద్ధియను సౌధారోహణ మైనతరువాత సగుణసోపానముతో నిఁక నెట్టి

యావశ్యకమును లేదు. సోపానములు లేక సౌధారోహణ మొనరించుట కష్టము. ముఖ్యముగా సోపానముల దృఢత్వము, స్థిరత్వము సరళత్వము విశేషవిచార్యములు. ఇట్టి సోపానములు, స్థూలములైనవి—సర్వశ్రేష్ఠములైనవి రెండు మనకుఁ గలవు. ఆ రెండింటికని నుదాహరణస్వరూపులు శ్రీకృష్ణుఁడును, శివుఁడును. కర్మమార్గమేవిధముగా నవలంబించినచో జ్ఞాన మవశ్యముగా సిద్ధింపఁగలదో దానిని శ్రీకృష్ణుఁడు యథార్థరూపమునఁ బ్రదర్శించి యున్నాఁడు. కర్మమునకును, భక్తిజ్ఞానములకు నేవిధముగా సమ్మేళనము కాఁగలదో దానిని సదాశివుఁడు ప్రదర్శించి యున్నాఁడు. కావున నీ రెండు సోపానములే పరమసమాదరణీయములు. శ్రీకృష్ణుఁడును, శ్రీసదాశివుఁడును వ్యాసకల్పనామాత్రులే యని యెవ్వరైన ననినను, దానివలన మన కేమియు హాని లేదు. సూర్యుని యుత్కృష్టకాంతి పరిదృశ్యమానమగుచున్నది. సూర్యుఁడెట్టిపదార్థము? అను విషయము నిర్ణయింపఁబడినను, నిర్ణయింపఁబడక పోయినను సూర్యతేజమునకు భంగ మేమియు లేదు. అట్లే, శ్రీకృష్ణుఁడును శివుఁడును, ఎవ్వరు? అను విషయము నిర్ణయింపఁబడినను, లేక పోయినను వారు దృష్టాంతపూర్వకముగా మనకుఁ బ్రదర్శించిన మార్గము భిన్నమగుట కేమియుఁ గారణములేదు.”

హరకు—మీరువచించిన శివ కృష్ణ దేవతలిరువురును బరస్పర భావభేదములు కలవారు. శివుఁడు ఘోరయోగి—పరమసన్న్యాసి. శ్రీకృష్ణుఁడు ఘోరవిషయాసక్తుఁడు—పరమభోగి. ఈయుభయుల చరిత్రములను గూర్చి సమాలోచన చేసినచో నేకరూపమైన పరమార్థ మేప్రకారముగా సాధితముగాఁగలదో నాకు బోధయగుట లేదు.

ఉమా—కొంచెము దూరముగా నిదానించి చూడవలయును. ఉభయులజీవనములు నొక్కటియే. ఒకరు భోగముల నడుమనున్న సన్న్యాసి; ఇంకొకరు యోగముల నడుమనున్న భోగి. శ్రీకృష్ణుఁ డఖండను

ఖవిధాయకపదార్థములచేఁ బరివృతుఁడయ్యు నిర్లిప్తుఁడు. ఇఁక శివుఁడో యోగమార్గమునందుఁ బూర్ణసాధకుఁడయ్యు లిప్తుఁడు. ఉభయుల జీవనము సమానశిక్షాప్రదమైనది. ఎవ్వరు కామనాపూర్ణులయ్యు నిష్కాములై యుందురో, ఎవ్వరు నిష్కాములయ్యు సకాములుగా నుందురో వారే జ్ఞానమునకుఁ బూర్ణాధికారులు.

హరికు—మీరు వచించినది సమంజసమే యైనను శివకృష్ణుల చారిత్రమునం దట్టి పరిపూర్ణత యెక్కడఁగలదు ? ఘోరతరభోగియైన శ్రీకృష్ణుఁడు నిర్లిప్తుఁ డెట్లయ్యెను? ఘోరతరత్యాగియైన శివునకు లిప్తత యెక్కడనున్నది?

ఉమా—శ్రీకృష్ణుఁడు వ్రజసుందరీమణులకు నయనమణి;గోపాంగనాగణమునకుఁ బ్రాణధనము; ఆతనియందు వారికిఁగల ప్రేమ నిరుపమానమైనది వారి ప్రేమలీలాసందర్శనముచేఁ బశుపక్ష్యాదులుగూడ విమోహితులై పోయెను. ప్రేమమయులైన గోపికలు, తమ్ము శ్రీకృష్ణుఁ డించుక నిరాకరించిననో నభిమానభరమున వారు,తమనెంతొ దుర్దృష్టవతు లుండరనియు, నదియే తమకుఁబ్రళయసమయమనియు నెంచిరి. ఈసంగతి చూచిన శ్రీకృష్ణుఁడు భోగికాక యుండఁడని యెంతమాత్రముఁ దోఁపదు. కాని, యింకనొకసంగతిఁ జూడుఁడు. కంసదూతయైన యక్రూరుఁడు వచ్చి శ్రీకృష్ణుని ధనుర్యజ్ఞమున కాహ్వానము చేసెను. వెంటనే శ్రీకృష్ణుని హృదయమునం దొకగురుతరమైన కర్తవ్యావసర మేర్పడియెను. అప్పుడు—ఏగోపాంగనల దీర్ఘనిశ్వాసములకీజగమంతయు రసాతలమునకుఁ బడిపోవుచుండెడిదో, యేవ్రజసుందరీమణుల విషాదవదనదర్శనముచే విశ్వప్రపంచ మంధకారమై పోవుచుండెడిదో, అట్టిగోపికల యార్తనాదములును, అధీరతానురోధములును శ్రీకృష్ణునిచే నుపేక్షింపఁబడినవి. వారిగభీరకాతరనోధము లాతనికి గణనీయములు కాకపోయెను. భోగనిర్లిప్తతకి కిది యమలొకికోదాహరణముగదా ? నేనీ యుదాహరణము

నొక్కదానిని మాత్రమే యుల్లేఖించియున్నాను. కాని, మనమీ దృష్టితో శ్రీకృష్ణుని చరిత్రమును బర్యాలోచించినచో నాతనిజీవనమునం దంతట నిట్టి భోగనిర్లిప్తత కుదాహరణములు దేదీప్యమానము లగుచుం డుటం జూడంగలము. ఇంక శివుని చరిత్రముం బరామర్శింతము. శివుండు శ్మశానవాసి; విభూతివిలేపితశరీరుండు; సర్వత్యాగి; కఠోర యోగనిరతుండు. అయినను నాతనియంకతలమున సుందరీశిరోమణి, సర్వాలంకార విభూషిత, యగునవీనకామినీమణి గలదు. త్యాగమునందులిప్తతకిది య లౌకికోదాహరణము. నేనిక్కడం గూడ నొక్కయుదాహరణమే యుల్లేఖించితిని. మన మేకాగ్రతతోం బరిశీలించినచో శివుని జీవితమునందును సర్వత్ర యిట్టి వైరాగ్యములో లిప్తత కత్యద్భుతోదాహరణములు ప్రసిద్ధములు కాంగలవు.

నీల——మీరు చూపిన రెండుదృష్టాంతములు నత్యంతసుందరములు. భోగానుభవమువలన దోషములేదు. కాని, నిర్లిప్తతమాత్రము కావలయును. మఱియు సన్యాసమునందు దోషములేదు. కాని, లిప్తులై యుండుట యావశ్యకము. ఎవ్వరు నిర్లిప్తులైభోగము లనుభవించుచున్నారో లేక లిప్తభావముతో సన్న్యాసమునందున్నారో వారే చరమఫలప్రాప్తకర్తులు.

హర——అట్లయిన నిర్లిప్తసన్యాసముకంటె, లిప్తసన్యాసమే శ్రేష్ఠము. మఱియు సకామభోగిత్వముకంటె నిష్కామభోగిత్వమే ప్రశంసనీయము.

ఉమా——మీరు నాయభిప్రాయమును జక్కగా సాధించితిరి. అది నాపరమసౌభాగ్యము.

హర——కాని, మీ యుపదేశరహస్యమును గ్రహించినంతిలో మేము సుఖులము గాలేదు. ఏమన? ఉపదేష్ట స్వయముగా నపూర్ణుండు. మీజీవనమునందు సన్న్యాసమేకాని భోగములేదు. కేవలత్యాగమేకాని

లీప్తతలేదు. మీ రేమియుపదేశించితిరో తదనురూపముగా ననుష్ఠానము చేయుటకష్టము.

ఉమాశంకరుఁడు దీర్ఘనిశ్శ్వాసమును విడిచెను. కొంచెము సేపధోముఖుఁడై యుండి పిమ్మట నిట్లుత్తరమిచ్చెను. "మీరువచించినదినిజమే. కాని, నాపక్షములో నట్టిసంపూర్ణతవలనఁ బ్రయోజనములేదు. నేనాజన్మ సన్న్యాసిని. ఏమన? బాల్యమునందే పితృమాతృహీనుఁడనై సన్న్యాసుల యాశ్రమమునందే పాలింపఁబడితిని. సన్న్యాసుల శిష్యుఁడను. తదనుకరణపరాయణుఁడను. ఇట్టివానికి భోగముల యనుసంధానముగాని, యట్టి తలంపుగాని యేమియునుండదు. మఱియు నిట్టిజీవనము గలవానికి విషయభోగములయవసర మెంతమాత్రమును లేదు. అందుచే నేను వచించిన యభిప్రాయములతో నాజీవనమునకు సామంజస్యము కలుగఁజాలదు.

హర—మీచరిత్రము నిజముగా విస్మయావహమైనది. మీపితృనివాసమెక్కడనో, మీతల్లిదండ్రు లెవ్వరో మీరించుకయు నెఱుంగరా?

ఉమా—కొంచెమైన నెఱుఁగను. తల్లిదండ్రులెవ్వరో వారి నివాసమెక్కడనో, ఆసంగతి యేమియు నేనెఱుఁగను. మాతృదేవత ఛాయారూపమున నప్పుడప్పుడించుక మనస్సులోఁ బొడకట్టుచుండును గాని, యదియు స్పష్టముగా జ్ఞప్తియందు లేదు.

హర—తెలిసినది. ఘనానందస్వామి మీపూర్వవృత్తాంతమునందలి రహస్యము లించుక యెఱింగియుండఁగలఁడు. మీరు బ్రాహ్మణకులమునందు జన్మించియుందురనుట నిశ్చయము. ఈసంగతిఁ దెలిసికొనిగాని ఘనానందస్వామి మిమ్ముఁ దమసన్న్యాసాశ్రమములో నెప్పుడును జేర్చికొని యుండఁడు.

ఉమా.—కావచ్చును! మామాతృదేవత గురుదేవుని చేతులలో నన్నొప్పగించి పోయినట్లు జ్ఞప్తి కాకున్నచో నిట్టి యసాధారణకారుణ్యమును గురుదేవుఁడు నాపైఁ జూపుచుండుటకుఁ గారణ మగపడదు. నన్ను గురుదేవుని హస్తములయందుంచునప్పుడు నాతల్లి గురుదేవునకుఁ గొంత పరిచయముఁ గల్గించి యుండవచ్చును. కాని, గురుదేవునినుండి నా విషయమైన ప్రసంగ మెప్పుడును నేను మరల వినియుండలేదు.

హార.—నిజముగా మీజీవితముతో సంబంధించిన యలౌకికవిషయములు కొన్ని ప్రచ్ఛన్నములై యున్నవి. ఏమైననేమి, జన్మప్రారంభమున డియు జననిజనకుల స్నేహ మను పరమసుఖమును గోలుపోయి మీజీవిత మీసన్యాసముతో మిళితమైపోయినది. ప్రేమవలన మనుష్యహృదయమున నెట్టెట్టి కోమలత్వము లభించునో యాలాభము మీజీవితములో ఘటిల్లలేదు.

ఉమా.—నేనింతకుఁబూర్వ మావిషయముగ్రహింపఁజాలనైతిని. ఏమన; ఎప్పుడును భోగములనే యెఱుఁగనివారు వానికర్తృయులను గ్రహించుట కష్టము. ప్రస్తుతము నాకమరుభూమివంటి కఠోరజీవనమునందలి విశేషమాధుర్యము లభించినది. కృపాతిరేకమున భగవతి స్వయముగా నాకు జననీరూపమునఁ బ్రత్యక్షమై నన్నుఁ దన యొడిలోఁ జేర్చికొనియున్నది. ఆమె స్నేహమువలన సంసారాంతఃకరణము రసమయమై మాధుర్యమయమైపోయినది. ఇప్పుడు నే నీవిశ్వప్రపంచమును నూతనచక్షువులతోఁ జూచుచున్నాను. నాకప్పుడు సకలపదార్థములు నధికతరప్రియము లైపోయినవి. ఆ నాజననిని మీరును జూడఁగలరు. ఆమె యోగేశ్వరి.

హార.—మీ పురాకృతసుకృతవిశేష మగణ్యమైనది. అందుచేతనే యోగామెదివ్యదర్శనము మీకు లభించినది. రెండుమూఁడుదినము

లోకైకకార్యకలాపములఁ జూచియు, నామెవాక్యాలాపములు వినియు మీ రెంతవిజ్ఞానముఁ బొందఁగల్గితిరో, అజ్ఞానోపాసనము చేయఁ గలసదవకాశము మీకు నేఁటివఱకు మఱెప్పుడును సంఘటించియుండదు.

నీల—యోగేశ్వరీమాత కృపాపూర్వకముగా నొకదినమున మన్భవనమును దనపాదధూళిచేఁ బవిత్రీకరించి మమ్ములను బరితార్థులను గావించెను. నాబిడ్డ అన్నపూర్ణ, ఆమె పరిచర్యలను అనఁగా—నేకకాలమునందే, మఱియుఁ జ్యేష్ఠయు; లజ్జయు నిర్లజ్జయుఁ, బరస్పరములు సల్లాపములు మున్నగు విరుద్ధవ్యాపారములఁ బ్రదర్శించుటఁ జూచి తానామె కాంతరాగిణీ భక్తురాలయ్యెను. ఆదేవియు నన్నపూర్ణను దనపుత్రీవలెఁ బ్రేమించుచుండెను.

ఉమా—స్నేహ మామెకు స్వాభావికధర్మము. నేనిప్పుడు సెలవు గైకొందును. వేళ యతిక్రమించుచున్నది. ఆశ్రమకార్యములు చాల నెఱవేర్పవలయును.

నీల—మీకు మాయందుఁగల కృప యపారమైనది. అన్నపూర్ణ మీకుఁ బ్రణామమాచరింపలేదు. ఆమె మీకుఁ బ్రణామమొనరించుకొనఁజాలనందులకు మిక్కిలి కాతరురాలగుచున్నది. అందుచే మీరొక్కమాఱీపార్శ్వభవనములోనికి దయచేసి యామెప్రణామములను స్వీకరింపవలయును.

నవీనసన్యాసివదనమండల మేమోగాని యొక నూతనకాంతిచేఁ బ్రదీప్తముగాఁ జొచ్చెను. స్థిరగంభీరములైన యాతనియవయవములన్నియు నేమోగాని యొక్కమాఱు విచలితములయ్యెను. అతఁ డప్పుడు మెల్లమెల్లఁగా నానార్గణసమ్ముఖమ్మున కేఁగి నిలిచి భక్తితోఁ గాళీతారకున, ఆనందమయికని ప్రణామములొనరించెను. అన్నపూర్ణ లజ్జావనతముఖయై దూరమునందు నిల్వఁబడి సన్యాసికొకప్రణామ మర్పించుకొనియెను. కాని, యాతనివైపొక్కసారి కొక్కమాఱు మోమెత్తి చూచుటకై

నను నామెకప్పుడు ధైర్యము లేకుండెను; ఒక్కమాటయైన నామె కిపు
ప్పుడు మాటాడలేకపోయెను. అన్నపూర్ణతో నొకటి రెండు మాటలు
మాటాడనిచ్ఛగించియు సన్యాసిగూడ నామెతో మాటాడుట కుద్యమిం
పలేకపోయెను. కాళీతారతోడను, ఆనందమయితోడను సముయోచి
తములైన యొకటి రెండుమాటలాడి యాతం డక్కడనుండి వెడలిపోయె
ను. అన్నపూర్ణ తనలో "ఈసన్యాసి యెంతమాత్రమును మానవమా
త్రుడుగాడు. ఈతడు దేవుడే" అని భావించుకొనజొచ్చెను.

నీలరతనబాబుదగ్గఅను హారకుమారునివద్దను సగౌరవముగా
సెలవుగైకొని సన్యాసియక్కడనుండి బయలుదేఱెను. ఆతడాశ్రమా
భిముఖుడై పోవుచుబోవుచు, నిట్లుభావించుకొనజొచ్చెను. "స్వభా
వము, స్వరూపము, వర్తనము, మొదలగుసకలవిషయములునాలోచించి
చూచినచో నీలరతనబాబుతనయ కేవలదేవీస్వరూపిణిగాక మఱియెవ్వ
రనియు నాకుదోచుటలేదు."

సన్యాసి వెడలిపోయినతరువాత నీలరతనబాబు హారకుమారుని
తోనిట్లనియెను. "తల్లిదండ్రులుగాని చుట్టుపక్కములుగాని యెవ్వరు
నులేక పుట్టినప్పటినుండియు సన్యాసాశ్రమమునందే పాలింపబడుచున్న
యీబాలకు డెంతటి ప్రియదర్శనుడుగా నున్నాడో చూడుడు! ఈత
నికి దర్శనీయమైన రూపమేకాక రూపముతో దుల్యమైన జ్ఞానసంప
దయుగలదు. నిశ్చయముగా నీనపసయోగి యెవ్వరో మహాపురుషసం
తానమై యుండును."

హార—నాయభిప్రాయ మీసజ్జనుడైన యుమాశంకరుని
చరిత్రమెదియో యత్యద్భుతరహస్యజాలముచే గప్పబడి యున్నదని
యే—నేను దానిని బయటికదీయుటకు బ్రయత్నించి తీరెదను. ఈన
వీనసన్యాసి వ్యాపారములును, యీతనిజ్ఞానగర్భితవాక్యప్రసంగములును
నన్ను గ్రమముగా విముగ్ధునిజేసివేయుచున్నవి. ఈతనియెడల నాకొక

విధమైన యాంతరంగికానురక్తి యుద్భవించుచున్నది. ఈతని యపరిజ్ఞాత జీవనరహస్యముల నెన్నిదివసములు భేదింపఁజాలకుందునో యన్నిదినములును నాచిత్తమున కూఱట లేకుండును.

—:♦:—

## రెండవ ప్రకరణము

### అపూర్వదర్శనము.

ఉమాశంకరుఁడు మెల్లమెల్లగా నాశ్రమప్రదేశమునకుఁ జేరుకొనియెను. అతఁ డాశ్రమములోఁ బ్రవేశింపఁగనే యాశ్రమవేదికపై సకలాలంకారవిభూషితశరీరయుఁ, గరధృతకమలయు, హాసన్ముఖియు నైన యొక సజీవదేవీమూర్తి యపూర్వదివ్యదర్శనము లభించెను. ఆమూర్తి యోగేశ్వరియే. యోగేశ్వరి యేకాకినియై నీరవయై కూరుచుండి, తనచేతియందున్న కమలవృంతముతో భూమిపై నేమేమో చిత్రములు లిఖించుచుండెను. ఆమె స్వర్గీయమైన తనసౌందర్యజ్యోతిచేసన్నిహితప్రదేశమంతయు నత్యంతప్రదీప్తము గావించివేయుచుండెను, జాజ్వల్యమానముగాఁ బ్రకాశించిపోవుచున్న యామెసౌందర్యప్రభలలో, నామెశరీరమునందలి మణిభూషణము లన్నియుఁ గాంతిహీనములై మినుకుమినుకుమనుచుండెను. ఆమె యుజ్జ్వలాయతలోచనద్వయము మెఱుపుతో కలకలనవ్వుచుండెను. అపరూపమైన యాయుధగోష్ఠమేమో కాని గాఢానందజనితమైన హాసమును దాఁచుకొనఁజాలకుండెను. మాక్తికపుష్పాలాలంకృతమైన యామెచేలాంచల మామెపృష్ఠదేశమును జుట్టివచ్చి యామె యంకస్థలమునందుపవిష్టమై మిలమిలమెఱసిపోవుచుండెను. అపూర్వయావనశ్రీవిరాజితమగుచున్న యాయోగేశ్వరి శరీరకాంతికి

గోటివిద్యుల్లతల యేకభావమున సాటిగాఁజాలకుండెను. ఈయువతికిక శోభయు నీయౌవనసంపదయుఁ జూచునప్పుడు సజ్జనుల మాట యటుండనిండు—చిరకాలపాపాత్ముల చిత్తసీమలయందును భక్తిభావము కంటె నన్యభావ ముదయించుట కవకాశము లేకుండెను. యోగేశ్వరిని దర్శించినంతమాత్రముననే గాంభీర్యపూర్ణమైన ప్రగాఢభక్తి తనంతనే హృదయమునం దుదయించును.

ఇట్టి దేవీమూర్తిని దర్శింపఁగల్గినయుమాశంకరుఁడు తాను ధన్యుఁడను, జరితార్థుఁడ నైతినని భావించుకొనుచుండెను. ఆతఁడు మెల్ల మెల్లఁగా నామె సామీప్యమున కేఁగి భూప్రదేశమున మస్తకముంచి యామెకుఁ బ్రణామమాచరించి భక్తిపూరితచిత్తముతో నంజలిపుటంబులు ఘటించుకొని యామె యెట్టయెదుట నిల్వఁబడి యుండెను. తత్క్షణమే యోగేశ్వరి యమృతదృష్టు లుమాశంకరునిపైఁ బ్రసరింపఁజొచ్చెను. ఆమె మందహాస మొనరించుచు నాతని నిట్లు ప్రశ్నించెను. “ఏమి, బిడ్డా! నిజముచెప్పుము చూతము.—అమ్మ మంచిదా, బిడ్డ మంచివాఁడా?”

ఉమాశంకరుఁడు వినీతభావముతో “అమ్మ గుణములకుఁ బారముగలదా? బిడ్డ యెంతమంచివాఁడైనను, అమ్మతో సాటి యెన్నటికినిగాఁ జాలఁడు.” అని పలికెను.

యోగే.—అయినను నేను నీకు మంచితల్లినేనా?

ఉమా.—అమ్మా! అట్లని యింకను జెప్పవలయునా? నీవు సాక్షాద్దేవివి; ఇట్టిదేవి నాతల్లి. నాజన్మ మెంతసార్థకమైనది.—మాతృహీనుఁడనయ్యు నేను మరల నిట్టి మాతను బడయఁగల్గితిని.

యోగే.—బిడ్డా! చాలభూషణములను దాఁచియుంచితిని. వానినన్నిటి నిప్పుడు నీకిచ్చుచున్నాను. నీవు పుచ్చుకొందువా?

ఉమా.—అమ్మా! నేను సన్యాసిని; నా కలంకారము లెందుకు?

యోగే—నీవు సన్యాసివే; కాని నిన్ను గృహస్థుని గావింపవలయును. అందుచే నలంకారములవలన నీకుఁ బ్రయోజనమున్నది.

ఉమా—అమ్మా! నీపలుకులు వినిన నాకు భయమగుచున్నది. నన్ను గృహస్థుని గావించెదవా? అమ్మను వదలి నేనెక్కడకును బోఁజాలను.

యోగే—అమ్మను విడిచియుంచుట యెందులకు బాబా? తల్లి యెప్పుడైనను బిడ్డను విడిచియుండఁగలదా? నీవు గృహస్థుండవైనప్పుడు మీ యమ్మయు గృహమునకు వచ్చి నిన్నుఁ జూచుచుండఁగలదు.

ఉమా—(నవ్వుచు) ఇట్టితల్లియాశ్రయమునందు నాకెక్కడనున్నను, అసుఖము సంభవింపదు. అమ్మసహాయముండువేళల నీచిన్నబిడ్డ యెక్కడకుఁ బొమ్మన్నను సమ్మతింపఁగలఁడు.

యోగేశ్వరి యొక్కొక్కటి చొప్పునఁ దనయాభరణములన్నియు నొలుచుటకు మొదలుపెట్టెను. ఆమె యాభరణములన్నిటిని దీసి యుంచి "ఇవిగో బాబా! ఈయాభరణములన్నియు నీవి." అని యుమాశంకరునిజూచి చెప్పెను.

ఉమా—అమ్మా! ఈ యమూల్యవస్తువులన్నియు నాకెందుల కిచ్చుచున్నావు? వీనినన్నిటిని నేనేమిచేయవలయును? ఎక్కడ దాఁచవలయును?

యోగే—నీవు వీనిని దాఁచలేకున్నచో నెవ్వరికైన నిచ్చివేయుము.

ఉమా—ఎవ్వరికీయవలయును?

యోగే—నీ కెవ్వరియందు మిక్కిలి యిష్టమో—

ఉమా—అమ్మా! నేనెవ్వరిని మిక్కిలిగాఁ బ్రేమించుచున్నాను? వారెవ్వరు?

యోగేశ్వరి నవ్వుచు "అన్నపూర్ణ" అనియెను.

ఉమాశంకరుఁడు చకితుఁడయ్యెను. ఆతఁడు తనలో "అన్నపూర్ణను నేను ప్రేమించుచున్నమాట సత్యము. అమ్మ యీసంగతి యెట్లు తెలిసికొనినది? ఈవృత్తాంతము స్వయముగా నన్నపూర్ణగూడ నెఱుఁగదు—ఇఁక నెవ్వరుఁ గూడ నెఱుఁగరు. మాయమ్మ యోగేశ్వరీదేవి! ఆమెకుఁ దెలియనిరహస్యము లేమియుండఁగలవు!" అని యనుకొనఁజొచ్చెను. పిమ్మట నాతఁడు మరలఁ దనలో నిట్లనుకొనెను. "అన్నపూర్ణను నేను ప్రేమించుచున్నమాటసత్యమే! కాని, అమ్మ నేనామెనుసంపూర్ణముగాఁ బ్రేమించుచున్నానని చెప్పినది. అమ్మవాక్యము మిథ్యావాక్యము కాదు. కాని యీవిషయమునమాత్ర మామెయనుమాన మెంతమాత్రము సరియైనదిగాదు"

భ్రాంతుఁడవైన యుమాశంకరా! నీవు శాస్త్రజ్ఞుఁడవు; విచారనిపుణుఁడవు; జ్ఞానవంతుఁడవు. అయినను నీవింకను అల్పవయస్కుఁడవు; అనుభవజ్ఞానము లేనివాఁడవు. అందుచే నీ వీయద్భుతప్రేమతత్త్వమును నిర్ణయింపఁజాలకున్నావు. ప్రేమయననది మిక్కిలి యాశ్చర్యమైన వస్తువు. ఇది యెక్కడనుండి యేవిధమున మెల్లమెల్లఁగా సంపాదింపఁబడుచున్నదో, ఆవిషయము తఱుచుగా నిర్ణయించుటఁగూడఁ గష్టము. అనేకసమయములయందుఁ బ్రేమాస్పదులైనవారిప్రేమ ప్రేమికులచే నాకర్షింపఁ బడకుండుటయుఁ గలదు. మఱియు, ఏదేని సంఘటనమువలనఁగాని, యేదేని వ్యాపారమువలనఁగాని యాకస్మికముగా నుదయించుచుండు ప్రేమకుఁ గొంతపరిమితి గల్గియుండు నని తెలియఁబడుచున్నది. మఱియు అనేకసమయములయందుఁ బ్రేమికులు, ఒకానొకరినిగూర్చి తమప్రేమ మేవిధముగాఁ బరిణమించినదో తెలిసికొనఁజాలక వారిని దమయాప్తబంధువులుగా మాత్రము భావించుచుందురు; కాని యేకారణముచేతనైన నట్టివారితో నించుక వియోగము గల్గినప్పుడుమాత్రము

వారు సామాన్యప్రేమాస్పదులుగారనియుఁ బ్రేమచేఁ దమ ప్రాణమునకు, మనస్సునకు, దేహమునకు వారేసర్వాధికారులనియు నీప్రపంచమంతయుఁ దన్మయమేయనియుఁ దెలిసికొనుచున్నారు; అప్పుడు వారనంత ప్రేమసాగరమున మున్కలు వేయుచుందురు. అందుచే నోసాధూ! ఉమాశంకరా! అన్నపూర్ణయెడల నీకుఁగల ప్రేమయొక్క పరిణామమును నీవు తెలిసికొనఁగల్గితివని మేమంగీకరింపఁజాలకున్నాము. మఱియు నీప్రేమ సంపూర్ణప్రేమగాని దో, ఈసంబాధమైన నీతర్కము తగినదనియు మే మొప్పుకొనఁజాలము.

ఉమాశంకరునకు యోగేశ్వరి మాటలన్నియు నాతనికన్నులయెదుట వ్రాసిపెట్టినట్లగపడుచుండెను. ఆతఁడు తదేకధ్యానముతో నాలోచించుచుండెను; ఆసమయమునా దాదేవి యాతనిసామీప్యమున కరుదెంచి అత్యంతవాత్సల్యపూర్వకముగా నాతనికరముఁ గైకొని "బాబా! గంగయందుఁ గొన్నితరంగములు బయలుదేఱుచున్నవి. నేను వానిని లెక్కించిచెప్పవలయును. నాకుఁ జాలనవసరము" అనెను.

ఉమా—(ఆశ్చర్యముతో) అదియేమిమాట? ఇట్లెవరు చెప్పఁగలరమ్మా?

యోగే—చెప్పనేలేరా? మనుష్యునిహృదయ మొక ప్రకాండసముద్రము; దానిలోని భావతరంగముల నన్నిటిని గ్రహింపఁగలవారు ఈక్షుద్రగంగాతరంగములను లెక్కింపలేరనుట యాశ్చర్యకరమైనమాట! సరే. బాబా! నీవుగంగాతరంగములను లెక్కింపఁగలవు.-మానఁగలవు. దానికేమి, హృదయతరంగములనుగూర్చి లక్ష్యముంచుము. ఇదిగో చూడుము; నీకొకమాట చెప్పెదను—నీకుటీరములో నొకపాత్రయందు "బరఫీ" తెచ్చియుంచితిని కొంచెము భుజింతువా?

ఉమా—అమ్మా! నేనాశ్రమమునందు సాయంకాలమునం

ద్రాక్షామాంసమాత్రమే బిక్షాన్నమును వండుకొని భుజింతును——ఇట్టి సమయమునందు "బరఫీ" ఎట్లు భుజింపఁగలనమ్మా!

యోగే——(మధురధ్వనితో నవ్వుచు) ఇట్టిభోజనమువలన ధర్మహానియగునా?

ఉమా——అమ్మా! ఏమగునో అది నేనెఱుఁగను. కాని ధర్మహాని యగునను శంక లేకున్నచో నిట్టినియమము మేలగును?

యోగే——నాయనా! నియమము లనేకవిధములు; నియమపాలకులును ననేకులు; కాని యివియన్నియు సామాజికవ్యవస్థలు. సామాజికనియమపరిపాలనముగూడ ధర్మమే కాని, యీధర్మముసామాజికనియమమునకు వశవర్తినిగాదు; దానికిఁ జాలదూరమునందున్నది. భోజనాదివిషయముల నియమములు సామాజికధర్మసంగతములే. అయినను ఆధర్మముతోమాత్రము దానికి విశేషసంబంధము లేదు.

ఉమా——అమ్మా! నేను సన్న్యాసిని——సామాజికనియమములకు బహిర్గతుండను! అందుచే నా యొడలఁగూడ భోజనాదివిషయము నియమము లేలజరుగవలయును?

యోగే——కాదు బాబా! నీవు సమాజబహిర్గతుండవు గావు. సన్న్యాసులును మనుష్యాంశ గలవారే. సామాన్యులతోడ నాహారవ్యవహారములును, ఆదానప్రదానములును వారికి లేకున్నను సన్న్యాసులు గూడ ననేకవిధములుగా, సమాజముతో సంబంధము గలవారే; వారును సామాజికనియమముల కధీనులే. సన్న్యాసులకును బ్రత్యేకప్రత్యేక సమాజములు గలవు. సన్న్యాసులుఁ దమతమ సామాజికనియమములఁ బరిపాలించు బాధ్యత గలవారే; అందుచే నీవును సన్న్యాసాశ్రమమునందు సామాజికమానవునివలె విధినియమముల నరయుచుండుము.

ఉమాశం——ఈనియమము లన్నిటికిని సార్థకత్వ మేమియు లేదా అమ్మా?

యోగే—చాలఁ బ్రయోజన మున్నదిబాబా! గృహస్థుల సామాజికనియమములును, సన్న్యాసులయాశ్రమవ్యవస్థలును, అన్నియు నత్యంతప్రయోజనీయములు—సార్థకములును. అందుచేతనే యెవరియాశ్రమమునందు వారు తమయాశ్రమోచితనియమములను బరిపాలించుట ధర్మమని తెలియఁబడుచున్నది. స్వాస్థ్యమునకొఱకొకచోటను, సామాజికోన్నతికొఱకొకచోటను, శాంతికొఱ కింకొకచోటను, జ్ఞానలబ్ధికొఱకు మఱియొకచోటను, యోగశక్తికొఱకు వేఱొకచోటను, భక్తిసాధనకింకనొకచోటను విశేషముగా నియమము లేర్పడియున్నవి. ఈనియమములన్నియు, దైవశక్తిసంపన్నులగుబుద్ధిమంతులు, విశేషవివేచనము మీఁదనే యేర్పాటుగావించిరి. నిజముగా నానియమములను మార్పుచేయుటకుఁగాని నిరాకరించుటకుఁగాని యేయాశ్రమమువారికిని విధినియమము లేదు.

ఉమా—అట్లయినచో అమ్మా! ఈ యాసమయమునందు నన్ను నీవు విధివిరహితమైన యీభోజనము చేయుట కాజ్ఞాపించెద వేలకు?

యోగే—బాబా! నీవు రాజవు గావలయును. ఇప్పటి నీయాశ్రమము నీవయసునకును, నియమవస్థకును, ఎంతమాత్రము సమరూపమైనది గాదు. నీకొఱకు విధాత స్వతంత్రవ్యవస్థ విధిబద్ధముగావించి సర్వసిద్ధముగా నుంచినాఁడు; అందుచేత సన్న్యాసాశ్రమనియమములను బాలింపకుండుట నీకు దోషావహము గాదు.

ఉమా—అమ్మా! ఈరహస్యమయములైననీ వాక్యముల తాత్పర్యమును నే నేవిధమునచేతను గ్రహింపఁజాలకున్నాను.

యోగే—ఎవ్వఁడు పంచవర్షముల వయస్సునందు మృతుఁడయ్యెనో, ఎవ్వఁడు శతవర్షములు జీవించునో. ఎవ్వఁడు దీనహీనబా

లకుఁ డగునో, ఎవ్వఁడు విపుల ధన వైభవశాలి కాఁగలఁడో నీవు తెలిసికొన లేకపోయితివేమి ? ఏదియెట్లు కావలయునో, అదియట్లే కానిమ్ము-ప్రతికూల మాచరింపవలదు. శారీరకకాఠిన్యము, త్యాగస్వీకారము, శాస్త్రాలోచనము మొదలగు ననుష్ఠానములచే నీహృదయము జ్ఞానవంత మైయున్నది. నీ వెప్పుడు రాజవగుదువో, అప్పుడు జ్ఞానముతో విషయసమ్మేళనము గలిగి యొకయపూర్వవ్యాపారము ప్రదర్శితము కాఁగలదు.

సవిస్మయుఁడై యుమాశంకరుఁడు మరల నిట్లనియెను. "జననీ ! నే నీప్రహేళికను బరిత్యజించెదనుగాక. ఎందుచే నీ విభిక్షుకబాలకుని రాజ్యపదాభిషిక్తుని గావించుటకుఁ గల్పనము సేయుచున్నావు? విడంబిత విషయవ్యాపారములవలన సన్యాసి కేమిప్రయోజన మమ్మా ?"

యోగే—ప్రయోజన మేమో నాకుఁ దెలియదు. నీవు లేఁతిమొక్కకుఁ బండ్లు పండింపఁగలవా? నీయదృష్టమునందు రాజభోగ మపరిహార్యముగాఁ గాన్పించుచున్నది. అందుచే నీవు రాజభోగ మనుభవింపకుండు టెట్లు బాబా !

ఇట్లు చెప్పుచు యోగేశ్వరి యాతని హస్తమును దన కరపల్లవముతోఁ బట్టుకొని "రమ్మ"నినడువఁజొచ్చెను.

ఉమాశంకరుఁడును నీరవుఁడై దేవితో నడిచెను. కుటీరాభ్యంతరమునఁ బ్రవేశించి నిజముగా నాతఁడొక బంగారుపళ్లెరమునం దత్యుత్కృష్టమైన "బన్ఫీ" యుండుటనుఁ గాంచెను.

యోగే—బాబా! భుజింపుము!

ఉమా—అమ్మా! నియమమేదియో, అనియమమేదియో నేనేమియు నెఱుఁగను. నీవు సర్వదేవతవు-నాజననివి. నీయాజ్ఞయే నాసకలనియమసారము. నీయాజ్ఞ యెప్పుడైనదో అప్పుడు నాకిఁక భోజ్యగ్రహణమునం దేసందేహమును లేదు. కాని, అమ్మా! అనంతపుణ్యసంచయ

మువలననగాని జననీ ప్రసాదభోజనము బిడ్డలయదృష్టమున ఘటింపదు. మాతృహీనుఁడైన యభాగ్యుఁడు మరల మాతృస్నేహలాభమును బొందఁగల్గెను! ఇక మాతృప్రసాదభోజనసౌభాగ్య మాతఁడు పొందఁ జాలకుండునా?

శ్రీకృష్ణ కటాక్ష భాగ్యము,

శ్లో ॥ స్తో ॥ లు.

యోగేశ్వరి మధురహాస మొనరించుచు "బిడ్డలమనోరథములఁ దీర్చుటకుఁ దల్లి బాధ్యురాలు" అనియెను.

ఇట్లు చెప్పుచు నాదేవి యాబంగారుపళ్లెరమునందలి యొక బర్ఫీ ముక్కను దీసికొనియెను; మఱియుఁ గుందకుట్మలములంబోలు తనదంతిరాజితో దాని నించుగ కొఱికి యవశిష్టభాగమును మరలఁ బళ్లెరమునం దుంచి—"బాబా! యీ మాఱుభుజంపుము" అని పలికెను.

తత్క్షణమే యుమాశంకరుఁడు తన యుత్తరీయమును గళమునకుఁ జుట్టుకొని కృతాంజలిపుటుఁడై "ఇప్పుడీ యభాగ్యుఁడు ధన్యుఁడయ్యెను; జీవితము సార్థకమయ్యెను" అనిపలికెను.

భక్తిభావముతో యోగేశ్వరికిఁ బ్రణామ మొనరించి యుమాశంకరుఁడాయుచ్ఛిష్టభోజ్యఖండమును గీసికొని మొట్టమొదట మస్తకమునందుంచుకొని, పిమ్మటవక్షమునం జేర్చికొని, మరలఁ గన్నుల నద్దికొని యప్పుడు భుజించెను.

కాని, యోగేశ్వరి యేదీ! ఉమాశంకరుఁడు నలుదెసల వెదకిచూచెను; యోగేశ్వరి యచ్చటను లేదు.

ఆభూషణరాశి నేమిచేయవలయునో యుమాశంకరుఁ డించుకయు స్థిరపఱచుకొనఁజాలక 'గురుదేవుని యాగమనమునకుఁ బ్రతీక్షించుచు నాశ్రమవేదికాపార్శ్వమున నలంకార సమూహమునొద్ద నిల్వఁబడియుండెను.

---

# యోగేశ్వరి.

## పంచమఖండము—విషబీజము.

### మొదటిప్రకరణము.

#### గాఢస్వప్నము.

శోనాపురమున శ్యామలాలుబాబునంతఃపురములో నొకచో నొకహంసతూలికాతల్పముపై విధుముఖి యర్ధశాయినియై పవళించియుండెను. అప్పుడు శారదయక్కడ కరుదెంచెను. శారద సంపత్తి యిప్పుడు కొంత వృద్ధియగుచుండెను. శారదకు వెండిబంగారుభూషణములు శరీరము నిండ నిదివఱకే గలవు; కాని, యిప్పుడు చేతులకు బంగారువంకీలు; బంగారుగాజులు క్రొత్తగా ధరించి సంతోషముతో నిచ్చటికివచ్చెను. తనయజమానురాలు పరితుష్టురా లగుచున్నకొలఁది నామె సంపద పెంపొందుచుండెను. ఆమె మెల్లఁగా విధుముఖసామీప్యమున కేఁగి యించుక యుచ్చస్వరముతో "వదినే! ఈవిముక్తకేశపాశ మేమి? ఈవస్త్రవేషభూషలేమి? ఈవిగళితపరిధాన మేమి? ఈయలసత యేమి? ఈయవశత యేమి?" అని యేమేమో చాలహాస్యము లాడెను. విధుముఖియు నిందహాసముచేయుచుఁ గన్నులు తెఱచి శారదపలుకుల కుత్తరములిచ్చుచుఁ దన్నుఁగూర్చియుఁ దనహారిచరణునిగూర్చియుఁ దమప్రణయమును గూర్చియు నెన్నియో యిష్టప్రసంగము లామెతోఁ జేసెను. మఱియు దనకును హారిచరణునకును గలప్రణయమును గూర్చి ప్రజకుఁ దెలియుచున్నదనియు, శ్యామలాలుబాబునకుఁగూడ నించుక తెలిసి హారిచరణుఁడు దానిని తన

బుద్ధికౌశలముచే మరలించెననియు, నీసంగతులు తనకు హరిచరణుఁడు రెండురోజులనుండి చెప్పుచున్నాఁడనియుఁగూడ నామెకుఁ జెప్పెను.

శారద యామాటలువిని యించుకభయ మభినయించుచు "అయ్యో! నాకుమిక్కిలిభయమగుచున్న దే; చాలభయమగుమాట. అట్లైన నేమిచేయవలయును?" అనియెను.

విధుముఖి నిరాకరణసూచకముగ నవ్వుచు " హరిచరణుఁడు భయముచేఁబిచ్చివాఁడైనాఁడు; సరి! నీవుఁగూడఁబిచ్చిదానివలె నగపడుచున్నావు. తెలిసినఁ దెలియనిమ్ము; ఎవరికిఁదెలిసిన నేమి? దాని కంత భయమెందులకు? "అనిపలికెను.

శార.—అట్లుగాదు. హరిచరణుఁ డహర్నిశములు నంతఃపురమునందే నివసించుచున్నాఁడు. మేము నీవారము—నీమంచిచెడ్డలకు మేము బాధ్యలముకనుకఁ జెప్పుచున్నాను. జాగ్రత్తగా నుండకతప్పదు.

విధు.—(సరోషమై) జాగ్రత్తయన నెట్టిది?

శార.—జాగ్రత్తయనఁగా—హరిచరణుఁడు సమయాసమయము లెఱుఁగక నీయంతఃపురమునకు రాకుండుట—అట్లయినఁ గార్యభంగము కలుగునుగదా!

విధు.—నేనాతని నంతఃపురమువిడిచి పోవలదనియే చెప్పుచున్నాను; కచ్చేరీపనులకొఱకు నన్ను విడిచిపోవుచున్నాఁడు. అందులకు నేను సహించుట కష్టముగా నున్నది. ఆతఁ డిప్పుడే వచ్చెదనని చెప్పి యొకగంటయైనది వెళ్లిపోయి. ఇంతవఱకును రానేలేదు.

శార.—వదినే! ఇప్పుడే వెళ్లినవాఁ డిప్పుడే రాలేదని తొందరపడుచున్నావా? ఆతఁ డిప్పుడు దివాన్‌జీగారుగదా! ఆతని కిప్పుడు సకలకార్యభారమును దలపైనున్నది. మనబాబు రాజకార్యవ్యవహారముల జోలి కెప్పుడును బోనేపోఁడుగదా! హరిచరణబాబుచేతిపై నన్నిపను

లును జరుగవలయును. అందుచేఁబాప మాతని కెంతయో సావకాశము గావలయును !

విధు—రాజకార్యము లెవ్వరికిఁ గావలయును? హరిచరణుఁడు నాయొద్దనుండియే కచ్చేరిపనులన్నియుఁ జూచుకొనుచుండవలయును. అట్లయిననే యాతఁడు దివానుపనిచేయఁగలఁడు; లేకున్న నాతని దివానుగిరీ యేమగునో ?

శార—వదినే ! గడబిడపడవలదు. అన్నియు నీయిష్టమువచ్చినట్లే జరుగఁగలవు. హరిచరణబాబుగూడ నిప్పుడు పేరునకుమాత్రమే రాజకార్యకర్తగా నున్నాఁడు. బాబుగారు నీచేతిలో రబ్బరుబంతి; హరిచరణుఁడు నీయడుగుక్రిందిచుంచుపిల్ల; కేవలము నీవే సర్వమయివి. ఈనీ సుఖస్థితి కేమియు నష్టమురాదు.

విధు—శారదా ! హరిచరణునిమూలముననే శుష్కతరువువంటినాజీవితము చిగిరింపఁగల్గినది. ప్రాణము దుఃఖసముద్రమునుండి సుఖతీరమునకుఁ జేరుకొనినది. ఆమోదముచే హృదయము తమించుచున్నది; ఈజగత్సంబంధములైన యెట్టివిపత్తులును నన్నిప్పు డీయానందమునుండి మరలింపఁజాలవు; ఏభయముచేతను నేనిప్పుడు వెనుకంజ వేయుదానను గాను. ఎవ్వరిమాటలుగాని నేనిప్పు డించుకయు వినుదానను గాను. రాజ్యాధికార మంతయు నిప్పుడు నాచేతియందే యున్నది. హతభాగ్యుఁడైనశ్యామలాలుఁడు నాకుఁ బ్రతివాదియైనచోఁ దనకష్టములు తానే యనుభవింపఁగలఁడు.

శార—అది నిజమే. నీవు తలఁచుకొనినచో బాబును సర్వనాశము చేయఁగలవు; సందియము లేదు. నీకిష్టమెట్లో యట్లే చేయుము. నీసుఖముచూచుటే నాకు సుఖము. సరే; నేనిప్పుడు పోయివచ్చెదను. నాదండవంకీలమాటమాత్రము మనస్సులో నుంచుకొనుము.

విధు—అదిమఱచిపోలేదు. హరిచరణునిమాత్రము రాజకార్యము లైనవెంటనే యిక్కడకు రమ్మని చెప్పి మఱిపొమ్ము.

శారద—వెడలిపోయెను. విధుముఖి మరల నలసభావముతో శయ్యపై నొఱగెను.

ఈసమయమునందే హరిచరణుఁ డక్కడకు వేంచేసెను. హరిచరణుని వేషభాష లిప్పుడు చాలనుచ్ఛస్థితిలోనికి వచ్చినవి. ఆతఁ డిప్పుడు పెద్దమనుష్యులదుస్తులవంటిదుస్తులను ధరించియుండెను. ఆతఁ డిప్పుడు చాలఁజాకచక్యముగా నగపడుచుండెను; కాని, ఈ తెల్వితేటలు, ఈవిచిత్రిత-ఇదియంతయు శిక్షాపరిభావముచే నుజ్జ్వలించుచున్నకుత్సితాకృతిగాని మఱియొకటిగాదుసుండీ! హరిచరణుఁ డించుకవిషాదముతో నించుకతహతహపాటుతో వచ్చెను. ఆతనిరాకఁ గని విధుముఖి లేచి నిల్వఁబడి కృత్రిమకోధముతో నిట్లుపలికెను.

"ఎంతత్వరగా వచ్చితివి?"

హరి—చాల నాలస్యమైనదా? లేదు. నీవేమనినను సంతోషమే; దానికేమిగాని, సంగతియంతగా బాగుగనున్నట్లు తోఁచుట లేదు.

విధు—(ఆత్రముతో) ఎవరిసంగతి?

హరి—ఇంకెవరిసంగతి; బాబుసంగతియే! ఆతని కెట్లో సంగతియంతయుఁ దెలిసినట్లు తోఁచుచున్నది.

విధు—ఏమియీవెఱ్ఱి? ఆతఁడు మనచేతులో నున్నాఁడా? లేక మన మాతనిచేతులోనున్నామా? పెదవికదపకుండఁ బడియున్న నే మంచిది; లేకున్న నాతనికే యమంగళము.

హరి—అదిసరియే. అధికారమంతయు నొకవిధముగా నిపుడు మనదియే; కాని, యింకను నాతఁ డధికారియే; ద్వారపాలకులు, వస్తాదులు, భటులు, అందఱు నాతనియాజ్ఞలోనే యున్నారు. ఆతఁడొక్క

క్కమాఱు తొందరగా నాజ్ఞయొసఁగినచోఁ దలనిలుపుకొనుట కష్టమగుచుండును.

విధు—నీవాతనియధికారము నాఁపలేవా ? ధనరాసులు-ధనపత్రములు-ఉద్యోగములు సమస్తమును నీచేతిలోనే యున్నవి. నీకిష్టమైనచో నందఱను నీకు వశవర్తులుగాఁ జేసికొనఁగలవు. అందఱును నీపాదరక్షలచే నాజాంబవంతునితలపైఁ దన్నునట్లు చేయఁగలవు.

హరి—(కొంచెమాలోచించి) అట్లుచేయఁజాలను. అది సరికాదు; దానివలనఁ బ్రమాదమున్నది. అంతకంటె నొకసులభమైనమంచిపద్ధతి నేను యోజించి యుంచితిని. నీయనుజ్ఞయైనచో దానిని నేను చేయఁగలను.

విధు—మనము సుఖపడుమార్గమును జక్కఁబఱుచుట కేమిచేయుమనినను నాకు సమ్మతమే. ఆపద్ధతియేమో చెప్పుము.

హరి—భూవసతులన్నియు నీపేరనేయున్నవి. కోశాగారమునందున్న తక్కినపత్రములు మొదలగునవి వేలము వేయించి నీపేరఁగాని, నాపేరఁగాని పాడించెదను. విలువగల కొన్నికొన్ని సామగ్రులు మనవారెవ్వరిపేరనైన వ్రాయించి కట్టుదిట్టము చేయించెదను; రొక్కనగదును, వెలగలవస్తువులును దాటించివేయఁగలను. అమూల్యరాజభూషణములు మొదలగునవన్నియు నీచేతనే యున్నవి. ఆపిమ్మట మనమెక్కడకుఁ బోయియున్నను మనకు హానిలేదు. నీయభిప్రాయమేమి ?

విధు—(ఇంచుక సేపుచింతించి)

పద్ధతి బాగుగనున్నమాటనిజమే; కాని, దానివలన నేమి ప్రయోజనము ? మనసౌఖ్యమున కిక్కడమాత్ర మేమివ్యాఘాతమున్నది ? అందుచే మనమిప్పుడు మనదివ్యభవనము విడిచి-యింటివ్యాపారమంతయు వదలి యెక్కడికో దూరము పోవుట యెందులకు ?

హరి—(దీర్ఘనిశ్వాసమును విడిచి)నేనప్పుడే అనుకొంటిని. పొట్టి వాఁడనయ్యుఁ జందురునిఁ బట్టఁగోరుచున్నానని. నీవు రాజరాజేశ్వరివి ; నావంటి క్షుద్రకీటకము నెంతగాఁ బ్రేమించినను, ఇట్టిదెప్పుడును సులభముగాదు. కాని, విధుముఖీ! ఇట్లు భయముతోఁ బ్రాణము లఱచేతఁ బెట్టుకొని ప్రేమించుచుండుట యింక నాకు సాధ్యము గాదుసుమా. అందుచేతనే నేనట్లు భావించుకొంటిని. దూరముగాఁ బోయినచో నిర్వైరము భార్యాభర్తలవలె స్వేచ్ఛగా సుఖింపవచ్చునని. కాని, యిట్టియభాగ్యుని కోరిక లెట్లుపూరింపఁబడును ?

మరల నొక దీర్ఘనిశ్వాసమును విడిచి హరిచరణుఁడు నిరవుఁడై యుండెను. విధుముఖి తలపై వజ్రఘాతమయ్యెను. అప్పు డామె కాతరభావముతో హరిచరణునికరము పట్టుకొని—"హరిచరణా ! ప్రాణేశ్వరా ! నీయందు నాకెంతటి ప్రేమగలదో దానిని నేను వర్ణించి చెప్పఁజాలను. సరిగదా—ఊహించుకొననైనఁ జాలకున్నాను. నీ వొక్క నిమిషము నన్ను విడిచియున్నచో నానిమిషములో నాకీప్రపంచమంతయు శూన్యమైనట్లు తోఁచుచున్నది. అయినను నిన్ను నేను ప్రేమించుచున్నానని నీవు విశ్వసించుటలేదు. నీ వొక్క నిమిషమైన నన్ను విడువకుండుటకంటె విశేషసుఖము నాకేమియుండఁగలదు ? నీ వెక్కడ కేఁగినను నీడవలె నేను నిన్నంటి యుండెదను. ఇంక నన్నేమియు నడుగనక్కఱలేదు. నీ కేదియుంచిదో యాలోచించుకొనుము." అని చెప్పెను.

ఒక్కనవ్వునవ్వి యాకూరకుర్కురాధముఁడు పాపాత్మురాలైన యాసుందరిని దగ్గఱగఁ దీసికొనియెను.

ఒకమార్గమునఁ బోవునప్పు డొకదుర్జలపల్వలములో నడుగిడక తీరినదిగాదు. ఆపడియ దాఁటక ముందుమార్గము సుగమముగాదు. ఈపాపాత్ముల యిర్వురిచరిత మింతవఱకుఁ జెప్పక తప్పినదిగాదు. ఇంతకంటె నీపాపుల స్థితిగతులు విపులముగాఁ జెప్పుట కోర్పుచాలదు.

———

## రెండవప్రకరణము.



### మధుకరము.

నిజముగా మూర్ఖుఁడును వ్యావహారికజ్ఞానశూన్యుఁడు నైన హరిచరణుఁడు రాజకార్యవ్యవహారము లన్నియు నత్యంతదుస్థితికిఁ దెచ్చెను. ఇట్టివిపులసంపత్తిని జక్కఁగా నడుపుట హరిచరణునివంటి యయోగ్యునకు సాధ్యమా? విశేషజ్ఞులైన యొకరిద్ద ఉద్యోగస్థులు స్వయముగాఁ బ్రవృత్తులై యాతనికి వ్యవహారజ్ఞానమును దెలుపుట కుద్యమించిరి. క్రింద నాతని కెట్టియభియోగముల నెట్లుతీర్మానించుట యుచితమో, ఎట్టిసందర్భములయం దెట్టియాజ్ఞల నొసఁగుట యుచితమో, ఎవ్వరియెడల నెట్టివ్యవస్థలు గావించుట యుచితమో ఇత్యాదివిషయముల మంచియాలోచనలఁ జెప్పుటకు ముందడుగు వేసిరి. కాని, మూర్ఖుఁడైన హరిచరణున కాబోధలన్నియుఁ గర్ణపాతములు గాలేదు. ఇతరులసదాలోచనలపై వ్యవహారము నడపుటయు, విశేషించి తనచేతిక్రిందనున్న యుద్యోగస్థుల మంత్రణములను వినుటయుఁ జాలబుద్ధిహీనతయని యెంచి యాతఁ డెవ్వరిమాటలునుగూడ వినుట కేయవకాశ మీయఁడాయెను. సాధారణముగా నాతని కవకాశమే యత్యల్పముగా నుండెను. విధుముఖి సన్నిధానమునందే యహోరాత్రములు గడపవలసిన వాఁడగుటచే వ్యవహారపద్ధతులు చూచియైన గ్రహించి క్రమముగా నేర్చుకొను నదృష్టమాతనికి లేకపోయెను. ఎప్పుడెట్లు తోఁచిన నట్ల యాజ్ఞలఁ జలాయించుచు, నేకాగితము చేతికివచ్చిన నాకాగితముమీఁదనే ముద్రిల ముద్రించుచు నుండెను. మద్యపానముచేసి యొడలెఱుఁగని యవస్థలో నొకటి చేయుటకు మఱియొకటి చేయుటయే కాక, అట్టివానిని మరల సవరించుకొనుటయైన నాతనికి లేకుండెను. ఇప్పుడు చేసిన కార్యమునుగూర్చి యింకొకగడియ కాతనికి జ్ఞప్తి లేకుండెను.

అత్యల్పకాలమునందే రాజ్యాంగములో మిక్కిలి చిక్కులు తటస్థములయ్యెను. ప్రాఁతధనమంతయు నైపోవుటచేతను, ప్రస్తుతాదాయము జమకాకపోవుటచేతను, ఉద్యోగులకు జీతములు ముట్టకుండెను. ఏనుఁగులకు గుఱ్ఱములకు దాణాలు దొరకుట లేదయ్యెను. గుమాస్తాలు మొదలైనపనివాండ్రపనులు, పద్ధతిప్రకారముగాఁ బరామర్శింపఁబడుట లేదు. దశదిశలనుండియుఁ గష్టపరంపరలు చుట్టుకొనుచుండెను. ఋణబాధ లనేకములుగా బయలుదేఱెను. ఋణదాతలు వ్యాజ్యములు దెచ్చుచుండిరి. ఉద్యోగస్థులు, నౌకరులుఁ బనిపాటులయెడల నశ్రద్ధ, జూపుచుండిరి. అనేకవిధములైన యల్లరులు సంభవించుచుండెను.

కాని, హరిచరణుఁ డొక్క కార్యమును మాత్ర మత్యంతశ్రద్ధాభక్తులతో సరిగా నడుపుచుండెను. శ్యామలాలుబాబునకు మధురసమును సరసానుభవమునకు వలసిన యితరేతరోపకరణములను, స్తోత్రపాఠకులు విదూషకులు సంగడీండ్రు మొదలైనవారి నిమిత్తమగు వ్యయమును మాత్ర మత్యాహితముగా, ననుకూలపద్ధతిని జతపఱుచుచుండెను. ఆతని యవసరమునకు ముందుగానే యావశ్యక పదార్థములను హరిచరణుఁడు సంగ్రహము చేయుచు శ్యామలాలున కర్పించుచుండెను.

ఏది యెట్లైన నగుఁగాక! శ్యామలాలుఁడు హరిచరణుని కార్యతత్పరతకుమాత్రము నితాంతసంతుష్టుఁడై పోవుచుండెను. వృద్ధుఁడైన హరకుమారబాబు వెడలిపోయినతరువాత బుద్ధిమంతుఁడును వ్యావహారికజ్ఞానసంపన్నుఁడును, యోగ్యతరుఁడు నైన యీహరిచరణుఁడు కార్యభారమును వహించినప్పటినుండియు శ్యామలాలు సకలవిధముల సుఖసంపన్నుఁ డగుచుండెను. అనేకస్థానములనుండి యనేకకన్యకామణులను దెచ్చి హరిచరణుఁడు నిత్యము శ్యామలాలుని యెదుట సిద్ధపఱుచుచుండెను.

విధుముఖిహరిచరణులనుగూర్చి శ్యామలాలుం డేదియో కొంత వినియున్నమాట నిజమే. కాని, యాతఁడామాటను విశ్వసింపలేదు. హరిచరణుఁ డదియంతయుఁ దెలిసికొనియే యుండెను. బాబుకార్యములన్నియు నాతనివలననే సఫలీకృతములగుచుండెను. బాబుగూడ నాతనియెడల నత్యంతమైన దయఁజూపుచుండెను. ఈయసూయచేఁ గూడ ననేకు లాతనికి శత్రువులైరి. ఆకారణముచేఁ గూడ ననేకులు బాబుమనస్సును గలఁతఁజెందించి యాతని సర్వనాశము చేయుదమనుతలంపుతో ననేకమిథ్యాపవాదములుగూడఁ బుట్టించి వ్యాపింపఁజేయుచుండిరి. మఱియు రాజకార్యవ్యవహారముల విషయమై యాతని కనేకులతోఁ వివాదము సంభవించుచు శత్రుత్వ మేర్పడుచుండెను; వారందఱు ననేకవిధముల నాతనిఁ బదచ్యుతునిఁ గావించుటకుఁ బ్రయత్నించుచుండిరి. కావున, నాతని విషయమై యత్యంతక్రోధజనకములైన నిందాప్రసంగము లనేకములు కేవలము బాబుకర్ణములయందే ప్రవేశించుచుండెను. కాని, బాబుమహాబుద్ధిశాలి. స్వార్థపరులైన ధూర్తులెవ్వరైనఁ దమకోరిక తీరునట్లు హరిచరణుని సర్వనాశముచేయఁగల విషయము లేమైనఁ జెప్పినను, నాతఁడు వానిని విశ్వసింపఁడు. హరిచరణుని యదృష్టము! అట్టిమాటలను వినుట యనుచితమని యాతఁడు నిశ్చయించుకొనియెను. మఱియు హరిచరణునకు విరోధముగా నెవ్వరైన నేమైనఁ జెప్పవచ్చినచోఁ దప్పక వారిని దండించుటకు మొదలుపెట్టెను. హరిచరణుఁడు కేవలము నిష్కంటకుఁడై యుండెను.

హరిచరణుఁడు తనమనస్సునకు నచ్చినవారిని-దనకుఁ బక్షపాతులైనవారిని, ఏరి తెచ్చి వారిని శ్యామలాలునకు సంగడీండ్రుగా నుంచుకొనియెను. వారు నిరంతరము హరిచరణుని యసంఖ్యసుగుణగణమును శ్యామలాలునొద్దఁ గీర్తనము గావించుచుండిరి. ఇప్పుడు శ్యామలాలునకు హరిచరణుని దోషలేశమైనను వినఁబడుటలేదు; వినఁబడుట కవకాశము

ను లేదు. ప్రవీణులైన యీపారిషదులు సకలవిధముల శ్యామలాలుని హరిచరణగుణవిముగ్ధునిగాఁ జేసివేసిరి.

హరిచరణుఁ డిప్పటికైన నొక్కకార్యము మాత్రము నెఱవేర్పఁ జాలకుండెను. సుహాసిని యెక్కడనున్నను, ఆమెనుబట్టి సేవలయునని యాతఁ డనుకొనెను. కాని, యిప్పటికిఁగూడ నాకార్యము సంఘటిల్లినది కాదు. శ్యామలాలున కిప్పుడాసంగతి సర్వదా జ్ఞప్తికివచ్చుటలేదు. ఎప్పుడైన జ్ఞప్తికివచ్చినచో హరిచరణుఁడు శీఘ్రమే మఱియొకవిధముగా నాతనికన్నులు తుడుచుచు నాతనిచిత్తమునుండి యావిషయము దూరము చేయుచుండును. ఈవిధముగా నాతని నూఱడించుచు నాసంగతి మఱపించెను.

ప్రభునకుఁ బరమవిశ్వాసభాజనుఁడును, ప్రభుపత్నికి హృదయవల్లభుఁడు నైన హరిచరణుఁడు మధ్యాహ్నకాలమునందు విధుముఖి యంతఃపురమునఁ బ్రవేశించెను. విధుముఖి యప్పుడు మంచముపైఁ బండుకొని గాఢనిద్ర పోవుచుండెను. హరిచరణుఁ డామెకు నిద్రాభంగముఁ గావింపక నెమ్మదిగా నిశ్శబ్దముగా నక్కడి వసారాలోనికిఁ బోయెను. ఆతఁడక్కడ నిల్వఁబడి తనమనసులో "ఆహా! ఎవ్వరు సుహాసిని నొక్కమాఱు చూడఁగల్గుదురో వారు వెంటనే వివశులు గాక మానరు. వారెల్లప్పుడు నామెనే స్మరించుకొనుచుందురు. ఆమెయెవ్వని యధీనమునందుండునో వానిదే సార్థకజీవనము. ఆమె నాకు లభింపఁగలదు. తగిన వారిని బంపితినిగదా! కౌశలముచే వారు కార్యము సాధింపఁగలరు. ఏ యభ్యంతరమును గలుగదు. దోషములన్నియు శ్యామలాలుని తలపైఁ బెట్టఁగలను. కాని, యీవస్తువు నాహస్తగత మైనప్పుడుమాత్రము నానికెప్పుడును జూపను. ఈమాఱు తప్పక నామనోరథ మీడేఱఁగలదు." అని యాతఁడు తలపోసికొనుచుండెను. మఱికొంచెము సేపటి కాతఁడు మ

రలనిట్లనుకొనఁజొచ్చెను. "విధుముఖియుసుందరియనుటనిజమే; కాని, యిఁక నీమెయందు దృష్టము నిలుపుటలేదు. ఈమె స్వాధీనురాలై సకలప్రకారముల నాకు సుస్థితి గల్గించినది; సందేహములేదు. అయినను కేవలము హస్తంగతురాలినిగావించుకొనవలయును. ఏది యెట్లయినను సరే. కాని, ఒకరిక్రింద దాస్యముచేయుటమాత్రము నాబోఁటివానికి సాధ్యముకాదు. ధనము, అధికారము, బలము! సకలము నాకిప్పుడు యథేచ్ఛముగా నున్నవి. ఇట్టిసమయములో నిష్టభోగము లనుభవింపకున్న నివియన్నియు వ్యర్థములు"

హరిచరణపాసు డిట్లుచింతించుకొనుచుండఁగా నవ్వుకొనుచు శారద యక్కడ కరుదెంచి "ఏమిది? దివాన్‌జీమహాశయు లిక్కడ నొంటరిగా నిలిచియున్నారేమి?" అని పలికెను.

దివాన్‌జీ—శారదా! నిన్నుఁ జూడఁగాఁ జూడఁగా నేనిఁక నిలుచుట కష్టముగానున్నది. నీవే చంపుట కురులు తగిలించుచున్నావా యేమి?

శార—(నవ్వుచు నవ్వుచు) నేను నికృష్టురాలనైన దాసినుండను. ప్రభువువారి కన్ను లిట్లు తిరిగిన వేమి? పదినెతోఁ జెప్పనా?

హరి—దాని కేమిలే. ఇట్టినీముందు నేను విరాగిని కాఁగలనా?

శారద—"ఈ బేలకొఱకింత యట్టహాస మెందులకు?" అనుచు నొకకటాక్షశరమున హరిచరణుని గ్రుచ్చి యచ్చోటనుండి వెడలిపోయెను. హరిచరణుఁడును దాని ననుసరించెను.



## మూఁడవప్రకరణము.

⟵══⟶

### పన్నాగము.

శ్యామలాలుబాబు సంధ్యాకాలమునందుఁ దనసౌధములో దక్షిణపువసారాలో నొక కుర్చీపైఁ గూరుచుండి యుండెను. ఆతనిసామీప్యమం

గున్న మఱికొన్ని కుర్చీలపై నిద్దఱుముగ్గురు పారిషదులు గూరుచుండి యాతని వికటకళేబరమునకుఁ గందర్పసౌందర్యము నారోపించుచుండిరి; ఆతని కర్కశకంఠమునందుఁ గోకిలఝాంకారము నావిర్భవింపఁ జేయుచుండిరి; ఆతని ప్రపంచజ్ఞానశూన్యమైన మస్తిష్కమందు శ్రీకృష్ణుని బుద్ధిని సమావేశపఱచుచుండిరి. ఆతని నిర్దయకార్యకలాపమునందు యుధిష్ఠిరవ్యవహారసందర్శనమును గావించుచుండిరి. మఱియు నాతని సర్వవిధముల నాదర్శపురుషమూర్తిగాఁ బరికీర్తన మొనరించుచుండిరి. శ్యామలాలుఁ డానందాట్టహాసమున హాసముచేయుచు సంప్రీతచిత్తముతో దురాత్ములగునాస్తోత్రపాఠకుల వాక్యామృతమును గర్ణపానము సేయుచు,వారిని విచక్షణవిశారదులలో నగ్రగణ్యులని భావించుకొనుచుఁ దాను మహాదృష్టవంతుఁడనని యనుకొనుచుండెను. ఆసమయమున నాతని సేవకుఁడు గాముఁడాదివ్యక్షేత్రమున కరుదెంచి యట్టి మహానుభావులు సేవింపఁదగిన ప్రథమతరగతి మధురసతీర్థము నాతని కందించెను.సురాదేవి స్వకీయకార్యసాధనమునం దాలస్యము నెఱుఁగదు.శరీరము,మస్తిష్కము వాక్కు సకలము నామెప్రభావముచే శ్యామలాలునకు సంపూర్ణముగా జడము లైపోయెను.

ఇట్టిసమయములో మణికాంచనముల సంయోగము సంఘటితమయ్యెను. ఏమన; శ్యామలాలుబాబుగారి దివాన్‌జీ హరిచరణుఁడక్కడఁ బ్రత్యక్షమయ్యెను. శ్యామలాలుబాబాతనిని జూచినంతనే యానందముతో "కార్యవ్యవహారము లేమైన మాటాడుటకు వచ్చితివా యేమి?అట్లైనవాని నటుంచుము. ఇప్పు డట్టివన్నియు నాలోచించుటకు సావకాశము లేదు. నీకించుక మధుసేవన మేమైనఁ గావలసినచో నిటురమ్ము"అని పలికెను.

అచ్చటి సభ్యులలో నొక్కఁడు "ప్రభువువారి కెప్పటి కప్పుడు కార్యాలోచనములు చేయుచుండవలసిన యగత్యము లేదు. బుద్ధిమంతు

లైనమీనాఁటి యధికారులచేతిలో సమస్తకార్యభారము నెప్పుడుంచితిరో యప్పుడింక "హుజూరు"వారికి మాటిమాటికిఁ గార్యభారముచే శ్రమ పడవలసిన ప్రయోజనమే యుండదు." అని పలికెను.

హరి——ప్రభువువారికి నాపైఁ గల కృప యపారమైనది. నేనును నాయథాశక్తిని బ్రభుకార్యములను నిర్వహించుచునే యున్నాను. "సర్కారు" కార్యములకుఁ బ్రాణము లర్పింపవలసివచ్చినను నేనందులకుఁగూడ సిద్ధముగానే యుందును. అయిననేమి; లక్షయగుఁగాక; నేను నౌకరును. కొన్నికొన్ని విషయములలోఁ బ్రభువువారిపరామర్శ మత్యంత ప్రయోజనమై యుండును. అందుకొఱకే మాటిమాటికి బాబునకు శ్రమ గల్గించుచుందును.

అప్పుడు మఱియొక డిట్లనియెను. "అవునవును. నిజము. "హుజూరు" వారెంతటిసూక్ష్మబుద్ధిగలవారు! అట్టివారు లోకములో నిద్దఱొకరు లేనే లేరు; కేవల మెంతటిచిన్నవ్యాపారమైనను, ఎందఱు బుద్ధిమంతులు సలహా కలిగియున్నను "దివాన్‌జీ"గారు హుజూరుపరామర్శను బొందవలసినదే."

వారిందఱిసంభాషణములను విని శ్యామలాలానందితాత్ముఁడై పోయెను. ఆతఁ డప్పుడు హరిచరణునిఁ జూచి "నీ కిప్పు డేమి తెలుపవలయునో చెప్పుము? చాలసేపటివఱకుఁ గూర్చొని యాలోచన చేయుటకు నాకవకాశములేదు. ఈసంగతి మొదటనే చెప్పి యుంటిని." అని యనెను.

హరి——మిక్కిలి కఠినవిషయ మొకటి ప్రభువువారు పరామర్శింపవలసియున్నది. చెడ్డసమాచారము; హైకోర్టుఅప్పీలులో నన్నవ్యాజ్య మొకటి యోడిపోయితిమి. దానికొఱకై, వడ్డీతోను, గతఫలములతోను మొత్తము దరిదాపుగా నేబది వేలు బాకీపడితిమి.

శ్యామ——ఏమియు హానిలేదు. తిరిగి అప్పీలు చేయుము.

హరి——అందుల కుపాయము లేదు. నేను వకీలుతో నాలోచించి

తెలిసికొంటిని. ఈవ్యాజ్యమునకు సీమలో నప్పీలు చేయవీలులేదఁట.

శ్యామ—అట్లయిన వాదిని బల్వనాపించి ఖూనీచేయింపుము.

హరి—దానివలనను లాభములేదు. ఇద్దఱుముగ్గురిని జంపినను మఱియొక యుత్తరాధికారి యెక్కడనో యున్నాఁడు. ఆతఁడు "డిక్రీ" అనులుజరిపి సొమ్ము రాఁబట్టుకొనఁ గలఁడు!

శ్యామ—అప్పుడు చూడవచ్చును.

హరి—కాని, నాయభిప్రాయము బాకీదారునకు సొమ్మేమియు నీయకుండుటయే. డిక్రీదారునకు సొమ్ము నేపద్ధతిమీఁద నొకపైసయైనను ముట్టదో, ఆపద్ధతి చూడవలయును- అదే నాయాలోచన.

శ్యామ—(సంతోషముతో)నిజమే! ఇప్పుడందుల కేమియుపాయముగలదు? అట్లయిన నతియు బాగుగనే! ఈపద్ధతిక నన్నేమిచేయుమని నీవు చెప్పినను నాకు సమ్మతియే.

హరి—ఏమియుఁ జేయనక్కఱలేదు. ప్రభువువారికంటె యోజింపఁగలవా రెవరు? అయినను హుజూరు విన నవధరించినచో—సెలవైనచో నాకుఁ దోఁచిన దొక యుపాయము విన్నవించెదను.

శ్యామ—చెప్పుము, చూతము! నీయాలోచనయేమి?

హరి—మఱేమియు లేదు; ఆస్తియంతయు నీసమయములో సనామకముగా నుంచవలయును. అట్లయినచో డిక్రీదారుఁడు నెత్తిని జేతులు పెట్టుకొని పోఁగలఁడు.

ఒకసభ్యుఁడు—వహ్వా! వహ్వా! బహు అనుకూలమైనపద్ధతి-కడు దిట్టమైన యాలోచన.

మఱియొకసభ్యుఁడు—ఓహో! ప్రభువెట్టివాఁడో ప్రధానియు నట్టివాఁడే కాకున్నచో నిఁక రాజ్య మెట్లునడువఁగలదు? బలే! రాజునకు దగినమంత్రి!

శ్యామ—మంచియాలోచనయే చేసితివి; కాని, ఆస్తి యెవ్వరి పేరనుగాక, అనామకముగాఁ జేయుటెట్లు?

హరి—ఇంత యాలోచనయెందులకు? ప్రభువువారి ధర్మపత్నియే కలరు. వారి పేరనన్నచో నేదిక్కునుండి యెట్టియల్లరులు జరుగుటకు నవకాశ ముండదు. తమధనమునకామె యధికారులు; ఆమెధనమునకుఁ దామధికారులు. లోకు లేమనుకొనుటకును గూడ నవకాశముండదు. భర్తృసొత్తంతయు భార్యచేతిలోనుండుట యుత్తమము. అందువలన నింటిలోనిధన మింటిలోనే యుండఁగలదు. అట్లుకానిచో డిక్రీదారుఁడు, బాకీదారుఁడుఁ గూడఁ జిక్కులు పడవలసి వచ్చును.

ఒకసభ్యుఁడు—కడు మంచియాలోచన! స్త్రీ పేరనే ధనమున్నచో దానిపైఁ బురుషునకును సంపూర్ణాధికార ముండును. స్త్రీ, తనస్వామియైన పురుషునిపై నెప్పుడు నధికారముచేయదు. పురుషుని యిష్టమెట్లో అట్లేజరుగుచుండును; ఎట్టి ఋణదాతలవలనఁగాని యేచిక్కులుసంభవించుటకు వీలుండదు.

ఇంకొకస—మేలు! మేలు! మేలైనపద్ధతి దివాన్జీమహాశయా!

శ్యామ—నీవు చేసిన యాలోచనము చక్కఁగానే యున్నది. కాని, నాభార్య యిందుల కొప్పుకొనవలదా?

హరి—ఒప్పుకొనకేమి? ఇందువలన నామెకేమియు నష్టములేదుగదా. పైఁగా నప్పుడప్పుడు ప్రభువువారి దర్శనసంభాషణములుగూడ నామెకు లభింపఁగలవు. అది యామెకొక గొప్పలాభము!

సభ్యుఁడు—సతీసావిత్రిని బోలిన మహారాజ్ఞీమణిగా రిందుమూలమునఁ బ్రభువువారితో, ధనవిషయములో నేకీభవించుటయు వారిచరణ దర్శనముఁ బొందుటయుఁ గలుగును. ఇది యామెకెంతటి సౌభాగ్యము!

శ్యామ—కాని, హరిచరణా! యిటుచూడుము! తఱచుగా రాణికి దర్శనమిచ్చుచుండుటవలన నామె నాకానందమైన యిష్టమార్గమున కెంతమాత్రము నడ్డు రాఁగూడదుసుమా!

హరి—రామరామా! అట్లేలయగును? మీసుఖము మా మెసుఖముగాదా? మీసంతోషపథమున కడ్డుదగిలిన నామెకుసంతోషముండునా? కావున నట్లుజరుగదు.

సభ్యుఁడు—ప్రభువువారు రసనముదులు; రసికచూడామణులు. ఇట్టి గుణరాశియైన స్వామికి పత్నియగుట కెన్నిజన్మములం దెంతటి పుణ్యముచేసియుండవలయునో! గృహిణీమణియు రాజ్ఞీమణియు నైనమాయమ్మగారు ప్రభువువారి పుష్పభ్రమణము నెప్పుడునుమాన్ప లేరు; మాన్పరు.

శ్యామ—అట్లైన నేనామెతో మాటాడెదను.

సభ్యుఁడు—ప్రభుచిత్తమున కడ్డ మేముండును?

శ్యామ—సరే, హరిచరణా! ఈవిషయమై యిఁక నన్న నీవేమియు నడుగనక్కఱలేదు. ఎవ్వరియాలోచనయు నీకవసరము లేదు. నీకు మంచిదని తోఁచినట్లు చేయుము. వెళ్ళి నీపనిఁ జూచుకొనుము. నే నించుక విశ్రమింపవలెను.

చిత్తమని హరిచరణుఁడు సెలవుపుచ్చుకొనియెను. మఱుచటి దినమునఁ బొద్దుటనే వారనకొనినరీతిని వ్రాఁతపూఁతలు జరిగినవి. సభ్యుల సమక్షమున శ్యామలాలు సంతకము గావించెను. సభ్యులు సాక్షిసంతకములును గావించిరి. కొలఁదిదినములలోనే యాపత్రము "రిజష్టరీ" యైపోయెను. శ్యామలాలుని యధికైశ్వర్యమంతయు నేఁటినుండి యాతని ధర్మపత్నిది.

---

# యోగేశ్వరి

షష్ఠఖండము—శ్రమోత్కర్షం.

## మొదటిప్రకరణము.

### మార్గమధ్యము.

విలాసపురమునకు దరిదాపు మూడు క్రోశములదూరమున దక్షిణముగా చండీతలము అనునొకగ్రామము గలదు. అది కేవలము కుగ్రామము. మొత్తముమీఁద ముప్పదినలువది కొంపలవాండ్రందు వాసముచేయుచుండిరి. అందు రెండిండ్లుమాత్రము బ్రాహ్మణులవి. తక్కినయిండ్లు వివిధవర్ణములవారివైయున్నవి. అచ్చటివారందఱు వ్యవసాయదారులు. ఒకటిరెండుధాన్యపుగాదులును; పశువులపాకలును, ప్రతిగృహమునందున గలవు. ఆగ్రామమునం దొక్కటియుం బెంకుటిల్లు లేదు;అన్నియుంబూరియిండ్లే; కాని, యవిభూమికి వంగి యుండెను. ఎవరిమట్టుకువారు తమయింటిముందఱివాకిండ్లను దుడిచి కలయంపులుచల్లి పరిశుభ్రపఱుచుకొనుచుందురు. అక్కడియిండ్లొకటితోనొకటి సంబంధములేక యన్నియుం దలయొకమూల నున్నవి.

ఈగ్రామమునందొకమూల రామహరికైవర్తుని వాసగృహ ముండెను. రామహరికి మూఁడుపూరిలోగిండ్లును,ఒకపూలతోఁటయు, రెండుగాదులును, రెండువ్యవసాయపు చెక్కలును, అయిదుకాళ్లదున్నలును, మఱికొన్ని పాడిపశువులును గలవు. ఆతనిపొలముగ్రామమునకతిసామీప్యమునందే యున్నది. ఆతఁడు ప్రతిదినము నుదయముననే లేచి వ్యవ

సాయపుఁబశువులఁ దోలుకొని తనపొలమునకుఁ బోవుచుండును. మరల రెండుయామములు దాఁటినప్పటి కింటికివచ్చి స్నానముచేసి భుజించుచుండును. ఆవశ్యకమైనచో నాతఁడు మధ్యాహ్నముకూడఁ బొలమునకుఁ బోవుచుండును; లేనిచో నింటనే యుండి పూలతోఁటలోఁ బూలమొక్కలకు నీళ్లకాల్వలు బాగుచేసికొనుట మొదలగు నింటిలోనిపను లేవియో చేసికొనుచుండును.

రామహరియింటిసామీప్యమునందలి యింటిలోనుండి మధ్యాహ్నము రెండుజాములవేళ నొకసుందరీమణి యీవలికివచ్చి ప్రాంగణమునం దొకప్రక్కగా నిలిచి మోముఁ జేతులుఁ గాళ్ళు గడుగుకొనుచుండెను. ఆమెవెనుకనే యాయింటిలోనుండి మఱియొక స్త్రీ క్షీరకలశము నొకదానిఁ జేతఁబుచ్చుకొని వచ్చినిల్వఁబడియెను; ఆసుందరీమణి ముఖప్రక్షాళనాదికములగుటఁ గాంచి యామె యిట్లుపలికెను. “అమ్మా! గంగా! ఇదిగో నీకొఱకు కావుపాలు తెచ్చితిని. పుచ్చుకొనవుము. ఆలస్యమెందులకు?”

గంగాసుందరి మోముతుడుచుకొనుచు “ఈగంగకుఁ బాలైనను సరే, నీరైనను సరే; అన్నియు సమానమే. అందుచేత సోదరీ! యమునా! పాలేల నష్టపెట్టెదవు?” అనిపలికెను.

అతివిస్తర మెందులకు? ఈరమణు లిర్వురును మనకుఁ బూర్వపరిచితులైన ‘సుహాసినియు, ‘దాసి, యునే. ప్రథమపరిచయదినమునుండియు వీరిరువురు గంగాయమునలవలెనే సఖ్యముగల్గియుండిరి. నాఁటనుండి నేఁటివఱకు నొకరినొకరు నామములతోనే పిలుచుకొనుచుండిరి. కాఁపుపడఁతియైన ‘హరిదాసి, బ్రాహ్మణనందినియైన సుహాసినిని తన యింటికిఁ దీసికొనివచ్చి యామెకు విశేషభక్తిశ్రద్ధలతో సవాంగస్నానాద్యుపచారములన్నియుఁ జేయుచుండెను. సుహాసినికొఱ కామె

ప్రత్యేకమైనయిల్లొకటి యేర్పాటుచేయించెను. సుహాసిని దానిలో స్వహస్తపాక మొనరించుకొనుచు భుజించుచుండెను; దాసి సమస్తసదుపాయము లొనరించుచు సహోదరివలె నామెసుఖించుప్రయత్నములు యథాశక్తిని జేయుచుండెను. దాసి రాత్రులయందు సుహాసిని యింటనే యామెకు సహాయముగాఁ బండుకొనుచు, నామెకు వినోదముగల్గించుటకుఁ జేతనైనయత్నములు చేయుచుండెను. దానికి భర్తయైనరామహరి కాఁపుకులమువాఁడైనను లజ్జాశీలయైనసుహాసినియింటి కెప్పుడును బోలేదు. ప్రాతఃకాలమునందును, సాయంకాలమునందును సుహాసిని వీధిగుమ్మముదగ్గఱ నిల్వఁబడి యాతఁడామెకుఁ బ్రణామమాచరించి వెడలిపోవుచుండెను; మఱియు నాతఁడు తనకు నూఱుపనులు పోయినను సరియే; తనకాలమును, ధనమును, వ్యయపఱిచి సుహాసినిప్రయోజనములు ముందుగాఁ జూచుచుండును. విధివశమున సుహాసిని కష్టములైన యింటిపను లేమేని చేసికొనుచున్న ట్లాతనికిఁ దెలిసినచో, వెంటనే యామెకు సాహాయ్యము చేయుమని తనభార్యను బంపుచుండును. ఆబ్రాహ్మణకన్యపాదరజము ప్రాప్తించినకారణముచేఁదాము ధన్యులముఁ జరితార్థులము నైతిమని యాతఁడు తలఁచుచుండెను.

చిత్తప్రసన్నత కేమాత్రమవకాశములభించినను దానున్నపరిస్థితావస్థలో సుహాసిని యవశ్యముగాఁ బ్రసన్నురాలు కావలసినదే. కాని, అయ్యో! ఆమెకుఁ దిరిగి గృహమునకుఁ బోఁగలనను నాశ లేదుగదా! మరలఁ బతిపాదసేవ లభించు నను నమ్మకము లేదుగదా! మరలఁ దనవారిలో నెప్పటియట్లు తలయెత్తికొని తిరుగుట కుపాయము లేదుగదా! లోకాపవాదమను పులినోటినుండి యీవలఁబడుమార్గ మిఁక లేదుగదా! ఇఁక నామెజీవన మెందుకు? నిరపరాధినియయ్యును సుహాసిని యపరాధినియయ్యెను, నిష్పాపయయ్యును పాపాత్మురా లయ్యెను; పుణ్యమయి యయ్యును నపవిత్రియయ్యెను; సతీస్వరూపయయ్యును గులటయయ్యెను. ఎట్టిభయాన

కవిషయము! ఎంతటి విషమావస్థ! అందుచేతనే సుహాసినియధరప్రాంతము నుండి, ఆ భువనమోహనమందహాస మంతరించిపోయినది; ఆ కోమలతామయవదనమండలమును జింతానైల్య మాక్రమించుకొనినది; ఆ లావణ్యోజ్జ్వల దేహలత విశుష్కమైపోయినది.

సుహాసిని ప్రకృతావస్థను దెలిసికొనియుండుటచే రామహరి స్వయముగా సార్వభౌమభట్టాచార్యునివద్ద కేఁగెను; పిమ్మట నాతఁడు సకలవృత్తాంతము నాతని కెఱింగించి కోడలిని సురక్షితముగా నింటికిఁ దీసికొని రావలయు నని తెలిపెను. సమాజభీతుఁడైన సార్వభౌముఁడు కోడలు నిరపరాధయని యంగీకరించుటకు మాత్రము సాహసింపలేకపోయెను; మఱియు నామె విషయమై యెట్టి విహితోపాయము నాలోచించుటకుఁగూడ నాతఁడు ప్రవృత్తుఁడు కాలేకపోయెను. ఆతఁడు సుహాసిని నిరపరాధినియైన సతీమణియనియు, దుష్టరాక్షసుఁడైన శ్యామలాలునివలని భయముచే నాత్మరక్షణమునందుఁ గోరికగలదై గదునితో స్థలాంతరమునకుఁ బలాయితయై యుండెననియు, గ్రహించిన గ్రహించియుండఁగలఁడు; కాని, శ్యామలాలుని యాక్రమణము, గదునితోడి పలాయనము నీరెండును లోకు లందఱువలెనే యాతనికిఁగూడ నసహ్యాకరములుగా నుండెను. ఈమె పాఱిపోయిన సంగతి వ్యాప్తమగుటచే లోకులెవ్వరు నీమెయందలి సత్యమును విశ్వసింపరు; కేవలము నత్యంతమైన యపవాదము సంభవింపదలైన యనేక యోజనల కాతఁడు వశవర్తియై కోడలిని మరలఁ బరిగ్రహించు విషయమున నెంతమాత్రము నంగీకారమును సూచింపలేక పోయెను. మఱియు నామె విషయమై యొక్క యూఱడింపుమాటయైనను మాటాడలేకపోయెను.

రామహరి తిరిగి వచ్చెను. సకలసమాచారమును సుహాసిని కెఱింగించెను. కాని, తనకింకను ఆశ వదలలేదని గూడఁ నాతఁడామెతోఁ జెప్పెను. రామహరి నేఁడేదియో క్రొత్తయాలోచనము చేసికొని మిక్కిలి వేకువజాముననే లేచి యిల్లు బయలు వెడలెను.

సుహాసినిక భోజనపువేళ కాంగానే దాసి క్షీరకలశమును దెచ్చి టకుం దనయింటికేంగెను. కాని, నేండు సుహాసిని చేయి మొంగిలిచేసి కొనినదే కాని యామెనోరెంగిలియైనజాడకనంబడలేదు. దాసిచేతిలోని పాలచెంబ ఖాళీయున్నది; ఆమె భోజన మప్పుడే అయిపోయినదని చెప్పినది.

ఈపట్టునం బాఠకమహాశయులైన కొందఱు సోదరీమణులును—కవితాప్రియులైన కొందఱు సోదరపాఠకమహాశయులును మిక్కిలివిరక్తులై యీగ్రంథము నధమగ్రంథముగా నూహించి దూరముగాం ద్రోసివేయంగలరు. ఏమన—వారిట్లందురు సుహాసినివంటి కుసుమకోమలియైన నాయికకు స్వహస్తములతో నన్నవ్యంజనాదికములను బాక మొనరించు కొనుట, అదియంతయు నోటంబెట్టుకొని నమలినమలి యుదరస్థముం గావించుకొనుట యెంతయో భీభత్సవ్యాపారము; మిక్కిలి నింగనీయమైన కార్యము; ఈగ్రంథకర్తది హీనాశయము. సుహాసిని కాహారమా? అయ్యో! ఎంతటి నిర్దయ, ఎంతటినిందనీయ కల్పనము! ఇంతటిరూపము, ఇట్టిమనోరహాసము, ఇట్టికోమలత్వము గల సుహాసిని యిట్లు స్వయముగా వంటచేసికొనుటయా! కేవలము వండుకొనుకాక వండి మరలభుజించుటయా! ఛీ! ఛీ! భోజనవ్యాపార మేయొక యసహ్యవిషయము. సుహాసినివంటి కోమలప్రాణియైన సుందరిపై నట్టిభీభత్సకాండ మారోపించుట మిక్కిలిహృదయహీనమైనకార్యము. సుహాసిని భోజనముచేయుట యనుకష్టము లేకయే సుఖముగా జీవింపవలయును. అదియే కవి కల్పనకు సమ్మతమైనది. లోకములో నెన్నిప్రతిబంధములు లేవు? ఎన్ని నవలలు లేవు? ఎక్కడనైన నేనాయికయైన భోజనము చేసినదని చెప్పంగలరా? కావ్యములయందలి కుసుమకోమలలైన నాయికలు భోజనములు చేయనే చేయరు. వారు మొట్టమొదట నేదియో యింతవండుకొనుట తినుట యనుబెడదయే లేకుండ, స్వచ్ఛందముగా నుద్యానవనవిహారము, జలక్రీడ ప్రియాలాపములు, ప్రేమచింతనము, ఆఖ్యాయికా పఠనము, కావ్యవిచా

రము, స్వప్నదర్శనము, మొదలైనవి చేయఁగలరు;ఆవశ్యకమైనచో వా
రశ్వారోహణముగాని,అసిధారణముగానిగావించి దేశోద్ధారణముఁగూడఁ
జేయఁగలరు. వారికి భోజనప్రయోజన మెంతమాత్రమును లేదు. ఆనా
కును గావలసినచోఁ దివ్యతియ్యని మలయమారుతపుఁదేటలు, నిండు
చందురుని పండువెన్నెల నిగ్గులుఁ, గొంచెము కొంచెముగాస్వీకరింతురు.
అట్లుకాకున్న మల్లికాకుసుమగంధమునో, వసంతకోకిలల పంచమతాన
మునో భుజింతురు; అదియుఁగానిచోఁ బ్రభాతబాలభాస్కరుని మధుర
కిరణకాంతులం దడియుచు దూరాగత మగుచున్న వేణునాదమునైన నా
హరింపఁ గలరు. అంతియేకాని, అన్నము, కూరలు, పాలునిట్టినాయికల
కాహారములా! శ్రీరామరామ!

వాస్తవికమగు కవిజనోచితవ్యాపారమును పరిత్యజించి మే సుహా
రాధుల మైత్రి. సత్యమే; కాని, జరిగిపోయిన దేమో జరిగిపోయినది;
అది మరలఁ గూడిరాదు.

సుహాసిని తనగదిలోనికిఁ వెడలిపోయెను. దాసికూడ నామెను
వెంబడించుచుఁ దనచేతిలోని క్షీరకలశమును జూపుచు "అక్కా! చూ
సుము. ఈపాల నించుక పుచ్చుకొనుము" అని బ్రతిమాలఁ జొచ్చెను.

గంగ—తినినదిచాలదా అమ్మా! మరలఁ బాలెందుకు? ఇచటికి
యమునాజల మిమ్ము చాలును.

యమున—నల్లనియమునాజలములోఁ దెల్లనిపాలు గలుపవద్దు
జలమువదలి, పాలలోఁ బాలుగలుపుట మంచిది.

గంగ.—కలికాలపుగంగ, యేమియుఁ గలియకుండఁగనే ప్రవహిం
చును. కలిసినవస్తువును దూరమైపోయినది. క్రొత్తవస్తువుమాట యింక
జెప్పుట కేమున్నది?

యమున-కలిసినవస్తు వేదియో కలిసిపోయినది. అది యిం
వేత్తై ప్రవహించుటెట్లు?

గంగా—అయిన, నాప్రాణముతోఁగలిసిన వస్తువును నేనేల పొందఁజాలకున్నాను?

యము—ఎక్కడఁ బొందఁజాలకున్నావు? హృదయములోనా? బయటనా?

గంగ—బయటనే

యము—హృదయమునందుఁ బొందితివా?

గంగ—సర్వదా.

యము—అయిన నీవు రాజరాజేశ్వరివి! పైపై కిలయికలతోఁ బనియేమున్నది? ఇవ్వు డీయించుకపాలు ద్రావుము తల్లీ!

మరల మాటాడక సుహాసిని, దాసిచేతినుండి క్షీరకలశమును బుచ్చుకొని మెల్లమెల్లఁగా స్వీకరింపఁజొచ్చెను.

తరువాత దాసి, సుహాసిని నక్కడనుండి లేవనీయక యామెభోజనము చేసిన తావంతయు శుభ్రపఱిచి గోమయముతో శుద్ధిగావించెను.

---

## ౧౭వ ప్రకరణము.

---

### అశ.

“రామేరామ—రామ, రామేరామ—రాము, రామేరామ—రెండ్డూ, రెండ్డూరామ, రెండ్డూ, రెండ్డూరామ—మూండు, మూండూరామ—మూండూ, మూండూరామ—నాల్గు” ఈవిధముగా రామహరి ధాన్యము గొలుచుకొనుచుండెను. రామహరివిశాలప్రాంగణమునం దొకదిక్కునఁబెద్దధాన్యపుగాది గలదు. ధాన్యమును గాదిలోఁ బోయుటకు ముందుగా నాతఁడు ధాన్యమును గొలిచి చూచికొనుచుండెను.

రామహరి విశేషాజానుబాహువుగాఁడు; స్థూలకాయుఁడునుగాఁడు; నల్లని బలిష్ఠదేహముగలవాఁడు; ఆతనికి ముప్పదివత్సరముల వయస్సుండవచ్చును. ఆతనితలపైఁ బిల్లజుట్టుమాత్రముండెను. ఆతఁడు తలకొక చిన్నకొల్లాయిపంచెఁ జుట్టుకొనియెను. అతఁడు ధరించిన యంగవస్త్రము మోకాళ్ళవఱకు మాత్రమే వెడల్పుగలది.

ఆతఁడు స్వయంకృషిచేతనే శ్రమపడి యీధాన్యమును బండించి తెచ్చుకొని స్వయముగా గాదెలోఁ బోసికొనియెను. ధాన్యమంతయు గాదెలోఁ బడినతరువాత నాతఁడు తలనున్నగావంచాతీసికొని యొడలిధూళిని దానితో దులుపుకొనియెను. పిమ్మట నాతఁడు తనగదిలోనికిఁ బోయి కొన్నిపొగచుట్టలను జేతఁబట్టి తెచ్చికొని లోపలివాకట నరుగుపై రెడ్డికము వేసికొని కూరుచుండెను. ఆపిమ్మట నాతఁడు చకుముకిరాతితో నిప్పుఁజేసి యొకచుట్టనంటించి నోటఁబెట్టుకొని తరువాతఁ దద్గతచిత్తముతో దానిని గాల్చుచుండెను.

రామహరి వ్యవసాయదారుఁడు; ధాన్యమున గొనుట, అమ్ముట మొదలగు ధాన్యవ్యవహారముగూడ నాతఁడు చేయుచుండును. ఇట్టిమనుష్యునిగూర్చియు నిట్టివ్యవసాయ ప్రసంగమును గూర్చియు వర్ణించి గ్రంథస్థానమును వ్యయపఱుచుట యుచితమా? కాదా? యనునది వివేచింపఁదగిన విషయమే. మొట్టమొదట రామహరి వస్త్రహీనుఁడైన నిరుపేద. ఆతనికొక చినిఁగిపోయిన మలినవస్త్రఖండము పరిధానముగా నుండెడిది; పైకొకవస్త్రముగాని పాదములకుఁ బాదరక్షలుగానియాతని కెప్పుడు నుండెడివిగావు. ఇట్టివానిని నిరుపేదయనుట కభ్యంతరమేమి? అతఁడు క్రమముగా వ్యవసాయదారుఁడయ్యెను. ఆతఁడు కేవలము స్వహస్తములతో నాగలియెత్తి, యెడ్లనుదోలుకొని, కఠోరమైన శారీరకపరిశ్రమ మొందుచుండెను. శీతవాతాతపము లాతనికి లక్ష్యములు గావయ్యెను. అందుచే నాతఁడు తక్కువవాఁడును నసభ్యుఁడు నయ్యెను. అ

యినను నాతఁడు పరోపకారి. ఇంకొక విశేషము. ఆతఁడాత్మసుఖమును బా
టింపఁడు. ఆతని కాంగ్లేయభాష మాటాడుటగాని, చదువుటగాని, వ్రా
యుటగాని రాదు. నవలలఁ బఠించి తద్రసగ్రహణ మొనరించుటయు నె
ఱుఁగఁడు; ఉపన్యాసములిచ్చుటగాని యుపన్యాసములు వినుటగాని; యా
తనికిఁ దెలియదు. అందుచే నాతఁడు మూర్ఖుఁడు. వాస్తవముగా నిట్టియ
ధముని విషయము గ్రంథమున వర్ణనీయముగాకుండుటే యుచితము.
సరియే; ఆసంగతి యేమైనను దానితో ధాన్యపుసంగతి యొకటిగలదు.
ధాన్యము రూపాంతరమును బొంది గొప్పవారందఱకు, నుదరస్థమగుచు
న్నమాట సత్యము. కాని, యాధాన్యముయొక్క జన్మాదివృత్తాంతము
గొప్పవార నేకుల కొకప్పుడైనను జ్ఞాతవ్యముగాకుండెను. ధాన్యలతికలు
భూమిలోనుండి పుట్టుననియు, నవి పెరిగి పెద్దవియై యేవియో పండ్లు
పండుననియు, నాపండ్లే రూపాంతరమును బొంది తండులములుగా నెన్నఁ
బడుచున్నవనియు, నాతండులములు భారతవర్షమునకుఁ బ్రధానభక్ష్య
ములనియు మాత్రము వారు వినుచున్నారు. కాని, యంతకంటెను నావి
షయమై యాలోచింప వలసిన యవసరము వారి కేమియుఁ గనఁబడదు.
జగదీశ్వరుఁడు దానినిగూర్చి యాలోచించుటకై కృషికారు లనునొకతర
గతి హీనజాతివారిని సృష్టించియున్నాఁడు. ఆకార్యమునందు వారుమా
త్రమే నియోగింపఁబడి యున్నారు. కేవలము రామహరినిగూర్చిగాని,
యాతని వ్యవసాయమును గూర్చిగాని, యీవిధముగా గ్రంథమధ్యమున
నాలోచించుట యొంతమాత్రము నుచితమైనపనిగాదు. కాని, ఇట్టిపట్టునఁ
గొందఱికిట్టి దుఃఖము కలుగఁగలదు. అయ్యో! ధాన్యమును గృషీవలు
లను మిక్కిలి నికృష్టపదార్థములుగా నెంచి యుపేక్షించుట తగనిపని.
ఏమన? సంవత్సరమంతయుఁ గృషికారులు చేయుపని నిష్ఫలమైనచో
ధాన్యము కలుగదు. అట్లయినచో నన్నాభావముచే దేశమందంతటను
హాహాకారములు బయలుదేఱి యనేకులు యమాలయమునకు బయన

మగుదురు. దేశీయజనులయనేక ప్రయత్నములు క్రమముగా నిష్ఫలము లై పోవును. అందుచే దేశమున కెంతటినాశము సంభవించునో చెప్పఁ జాలము. పురపారిశుధ్యసంఘములు మొదలగునవన్నియు విఫలప్రయత్న ములై యొక్కనాఁటితో నెగిరిపోయి దేశమున కెంతయో దురవస్థ సం భవింపఁగలదు; ఇందులకు సందేహము లేదు. హితానుష్ఠానములనియు, శుభానుష్ఠానములనియుఁ బరిగణింపఁబడుచున్న యనేకానుష్ఠానములు చాలవఱకు విఫలములగును; అట్టివన్నియు వినష్టములై పోయినను స్వా భావికమైన హానియేమియు లేదు. కాని, కృషీవలులకృషి, ఉద్యమము, ఉత్సాహము, సహిష్ణుత మొదలగునవి ఫలవంతములుగానిచోఁ బ్రత్యక్ష ముగాఁ గన్పడెడి దుర్దశ పారములేనిదగును. దారుణమైన క్షామదేవత వాసగహ్వరముచే నందఱు గ్రసింపఁబడఁగలరు. హాహాకారధ్వనులచే దిఙ్మండలము నిండిపోవును. యమదూతలు మానవులను గుంపుగుంపులు గా నెత్తికొని పలాయన మొనరింతురు. అందుచే ధాన్యమునుగాని కృషీ వలునిగాని యుపేక్షింపఁ దగదు.

రామహరి సుఖాసీనుఁడై యనన్యచిత్తముతోఁ బొగచుట్ట సేవిం చుచుండెను. మీసములు సవరించుకొనుచు మోము నిమురుకొనుచు నాతఁడు విస్తారధూమమును మేఘమండలసమునకై త్యాగము సేయు చుండెను. పటమధ్యమునఁ జిత్రింపఁబడిన మేఘములవలె ధూమరాసులు నాల్గుదిక్కులకుఁ బయలుదేఱి శూన్యపథమునఁ బ్రయాణము సేయుచు నాకాశములోఁ గలిసిపోవుచుండెను. క్రమముగా ధూమయాత్ర మం దము గాఁజొచ్చెను. అప్పుడు రామహరి తననోటిలోనిపొగచుట్టకుఁ బరమాయువు నిశ్శేషమైనదని తెలిసికొనియెను. వెంటనే యాతఁడు మఱియొకచుట్టకు నిప్పంటించెను.

ఇట్టిసమయమునం దాతనిభార్య హరిదాసి యక్కడకు వచ్చి రామహరినిఁ జూచి "నేఁటినుండి నీవు జుట్టు, కట్టు, మార్చియాఁసువేషము

ను వేసికొని యింటిపనులన్నియుఁ జేయుచుండుము. ఇఁక నేను వీథిఁదిరుగుచు బయటఁగలపనులన్నియుఁ సమర్థించుకొనుచుందును." అని పలికెను.

రామ—అట్లయిన నీవిక్కడనుండి నావలెనే యొకచిట్టిగానుంచా కట్టుకొని, ఇంకొకచిట్టిగామంచా తలకుఁ జుట్టుకొని పురుషవేషము వేసికొందువా యేమి?

దాసి—ఛీ! అట్లెందులకు?

రామ—అట్లయిన నాకాఁడువేసమెందులకు? నేనొకవేళ నాఁడు వేసము వేసికొనినను నీగంగాదేవి నన్ను యమునయని యెంతమాత్రము ననుకొనదు—నాసేవల కంగీకరింపదు. బ్రాహ్మణకన్య పరిచర్యలు మొదలుకొని యింటిపనులవఱకును గేవలము నన్నియు నీవే చేసికొనుచుండవలయును.

దాసి—ఈబ్రాహ్మణకన్యకష్టమును జూడఁజాలకయే నిన్నాఁడు వేషమును వేసికొనుమంటిని. ఇన్నిదినములనుండి ప్రయత్నించియు నాచండాలుఁడైన గదుని దీసికొనిరాలేకపోయితివి; ఇఁక నీవెట్టిమగవాఁడవు?

రామ—ఈసాయంకాలములోపల గదునిఁదీసికొనిరాలేకపోయినచో నీవు మూఁడురోజులవఱకు నాతో మాటాడవలదు లెమ్ము.

దాసి—(నవ్వుచు) అట్లయిన నీకు గొప్పనష్టమువచ్చినదే!

రామ—అట్లుకానిచో నేనె నీతో మాటాడకుండెదను లెమ్ము

దాసి—ఉండఁగలవా?

రామ—ఏమగునో కాఁగలదు. ఇప్పుడామాట యెందులకు; బ్రాహ్మణకన్యయెడల నాకెంతటిభక్తిగలదో వినుము—ఆమె కేకార్య

మువలన మేలుగల్గునో యాకార్యము నేను తప్పక చేయఁగలను. ఆమె కొఱకుఁ గష్టపడుటకుఁగాని ఖర్చుచేయుటకుఁగాని నేనెంతమాత్రము వెనుదీయను. ఇల్లువాకిలి, పొలముపుట్రు, దూడాదుడిక, తోఁటాదొడ్డి ధనముధాన్యము, అన్నియు సమర్పించి నీచేయిపట్టుకొని వీథిలో నిలఁబడుమన్నను నాకు సమ్మతమే. ఆమెమేలే కోరుచున్నాను.

దాసి—ఆహా, ఆహా! ఈనీధర్మవాక్యములు వినుటచే నాకడుపులో నెంతో చల్లగా నున్నది. అందుచే నీకుఁ దవ్వోడుకులుఁ బట్టెడుబెల్లము పెట్టెదను; తిని పాలుద్రావుము.

దాసి లోనికిఁబోయి వెంటనే యొకపళ్ళెమడుకులుఁ బట్టెడుబెల్లముఁ జెంబెడుపాలుఁ బట్టుకొనివచ్చి రామహరివద్దనుంచెను. ఆమె యింకొకపెద్దచెంబుతో జలముగూడఁ దెచ్చెను. రామహరి కాలుసేతులు, మోముఁ గడిగికొని పరమానందముతో నడుకులును బెల్లమును భక్షింపమొదలుపెట్టెను. మనమును నికనిట్టి యితరజనులను వర్ణించు పనిలో విశ్రాంతి దీసికొందము.

---

## మూఁడవప్రకరణము.

### మరల.

రామహరి యెట్లుచెప్పెనో యట్లుచేసెను. గదాచండాలుఁడరుదెంచెను. రామహరియు, దాసియు, సుహాసినియు, నిట్లునిశ్చయించుకొనిరి. "సుహాసినింగూర్చి యామెమామగారికిని భర్తకును మనస్సులలోఁగల్గిన విరుద్ధసందేహము మూలములేనిదైనను అది పైకిమాత్రము నసంగతముగాఁగాన్పించుటలేదు. ఈభ్రమను దొలగించుట కుపాయము గదుఁడక్కడకుఁబోయి మాటలాడుటయే. గదాచండాలుఁడు కథయంతయు వ్యక్తపఱిచినచో యథార్థమంతయుఁ దెలిసికొని యందువలన

నిశ్చయముగా సార్వభౌముఁడు నాతనిపుత్త్రుఁడును మనస్సులలోని సం
దేహమునుదొలఁగించుకొనఁగలరు" అని మీమాంస గావించుకొనిరి.
ముగ్గురునుగూడ సాధుస్వభావములును సరళప్రకృతులును గలవారు;
గదునివంటి నీచజనునిసాక్ష్యమువలన నిట్టికళంకము పోవుట యసంభవ
మని వారెంతమాత్రమును ననుకొననేలేదు. విశేషించి గదుఁడెప్పుడే
వ్యాపారమునందుండి యపరాధిగాఁ బరిగణింపఁబడుచుండెనో, అప్పుడా
తనిసమర్థనవాక్యములకు విలువయెంతమాత్రము నుండఁజాలదనియు
వారొక్కమారైనను భావించుకొనలేదు. రామహరి చాలఁగష్టపడి
గదునివెదకికొని తనయింటికిఁ దీసికొనివచ్చెను. గదాచండాలుఁ డత్యం
తభయానకవ్యక్తి. ధనముసంపాదించుటే వానిజీవనమునకు మూలమం
త్రము. వానికి ధనలాభములేనిచో నెట్టిపనియుఁ జేయనేచేయఁడు.
వానికిఁ గావలసినధనమిచ్చుటకు సమ్మతించినచోఁ గల్పనాతీతములగు
దుష్క్రియలు గావించుటకుఁగూడ వాఁడు సంసిద్ధముగా నుండును.
కార్యావశ్యకతతోఁగాని దానిపర్యవసానముతోఁగాని దానికెంతమా
త్రము జోక్యములేదు. కోరినధనము పుచ్చుకొని దాని ననుభవించు
టయును, చెప్పినది చెప్పినట్లుగాఁ జేయుటయునే వానిపని. ఆపిమ్మటఁ
గార్యఫలాఫలములతో వానికి సంబంధములేదు.

సుహాసినిని శ్యామలాలుచేతులనుండితప్పించి రక్షించిగ్రామాంతరము
న సురక్షితమైనచోటఁ జేర్చుటలో గదుఁడశ్రద్ధచేయకుండుట వానికిన్యా
యమే. ఏలన? వానికీపని యిష్టమైనపనిగనుక. కాని, గదాచండాలుడు
మంచిచెడ్డల నాలోచించి యీపనిచేయలేదు. శ్యామలాలు వానిని
సుహాసిని నపహరించి తెమ్మని నియోగించెను. ఆకార్యము నెఱవేర్చిన
చో నిశ్చయముగా శ్యామలాలువద్దనుండి వానికిబహుమానరూపమునఁ
గొంతధనము లభించును. ఈబహుమానము తప్పిపోదని వాఁడు బాగు
గా నెఱుంగును. దురాత్ముఁడైన గదాచండాలుఁ డీసామాన్యధనమున

మంగలలోభముచే ననాయాసముగా సభయాసక్త కార్యమునకుఁ గడంగి నిజముగా సుహాసిని నెత్తుకొనివచ్చెను. తరువాత సుహాసిని వేయి రూప్యములకుఁ దక్కువగాని యాభరణముల నిచ్చుట కెప్పుడు సమ్మతించెనో, అప్పుడాచండాలుఁడు మరల సులభముగా శ్యామలాలునియాజ్ఞ నుపేక్షించి సుహాసిని యిష్టానుసారముగాఁ బనిచేసెను. మొదటిది పాపకార్యమనియు, రెండవది పుణ్యకార్యమనియు నాలోచించి గదుఁ డట్లుచేయలేదు—వాఁడేపనియు నెప్పుడు నట్లుయోచించి చేయనేలేదు.

శ్యామలాలునికోరికప్రకారము పనిచేయక సుహాసినినిఁ దెసికొని మఱియొక చోటికేఁగుటవలన గదునకు వేఱొక విపత్తువచ్చినను రావచ్చును. శ్యామలాలు మర్యాదకుటుంబములోనివాఁడైనను దుష్ప్రవృత్తిచే నాతఁడు చాలఁ జెడ్డవాఁడుగా నున్నాఁడని గదుఁడెఱుంగును! గదుని ప్రయత్నమువలననే తనమనోరథము సిద్ధింపలేదు గావున నిప్పుడు గదునిసర్వనాశము చేయుటకు శ్యామలాలు పిసమంతయు వెనుదీయఁడనియుగదుఁడుబాగుగనెఱుంగును. తరువాత వాఁడిఁక మరల శ్యామలాలునిగ్రామమునకు రానేలేదు. గ్రామాంతరమున మాఱువేసముతో వాసముచేయుచుండెను,

ఈమహాపురుషుఁడైన గదాచండాలుని సరళహృదయుఁడైన నరామహరి యిరువు రబలల యాలోచనమువలన సులభసాధ్యుఁడని భావించెను. మఱియు సత్యాదరముతో వానిని దనయింటనే యుంచుకొనియెను. రామహరివలన సమస్తవృత్తాంతమును విని గదుఁడు రామహరితోనిట్లనియెను. "సార్వభౌమచక్రవర్తిగారిసన్నిధికి వారికోడలిగారిని వెంటఁబెట్టుకొని వెళ్ళఁగలను.—అవసరములైన సంగతులన్నియుఁ జక్కగాఁ దెలియఁజేయఁగలను; అందు కేమియు నభ్యంతరములేదు; కాని, యిప్పుడు నాకు కర్తవ్యములైన పనులెన్నియో యున్నవి. తగినంతలాభమున్నచో

నీపనులను నష్టపఱచుకొనవలెనుగాని, లేనిచో నిప్పుడు నాకెంతమాత్రమును సావకాశములేదు." అనియెను.

వానితోఁ గొంతసేపు సంభాషించినవెనక రామహరి, "ఒకనూఱురూపాయలైన నీయకున్నచో గడుఁడీపనిలో సాయముచేయఁడు" అనిగ్రహించెను. సుహాసినిచేతిలో నొకచిల్లిగవ్వయైనను లేదని గడుఁడు నెఱుఁగును; రామహరియు నెఱుఁగును. కేవలము నూఱురూపాయ లిచ్చుట యిప్పు డెట్లు? ఎట్లో సొమ్మీయకున్న గడుఁ డొక్కమాటయైనను జెవినిబెట్టనే పెట్టఁడు. అందుచే రామహరి నూఱురూపాయ లిచ్చుటకుఁ గూడ నంగీకరించెను.

దాసివద్దకువచ్చి రామహరి సంగతియంతయుఁ దెలియఁబఱిచెను. ఆమె యంతయువిని—"సరి, తెలిసినది! ఇప్పు డింతసొమ్మెట్లు జతపఱుపఁగలము?" అనెను.

రామ—ఆయమ్మదగ్గఱ నొక్కపైసయు లేదు. ఈమాట యాయమ్మతోఁ జెప్పిన లాభమును లేదు. రేపటిరోజంతయుఁ దంటాలుపడి రెండుగాదులధాన్యమును నమ్మివేసెదను. నేనీసంగతి నలుగురితోఁ జెప్పుటకుఁ బోయెదను. ఇప్పుడే బేరమిచ్చివేయవలెను.

దాసి—ఎంతధాన్య మమ్మిన నూఱురూపాయ లగును?

రామ—అవసరమైనకార్యము మానుటకు వీలులేదుగదా? మనవద్ద నిప్పు డెంతధాన్యముగలదో యంతయు నమ్మివేయుదము.

దాసి—ఉన్నధాన్యమంతయు లోకులకిచ్చివేసి యాతరువాత మనమేమిచేయవలయును? సంవత్సరముపొడుగున జీవించుట యెలాగు? విత్తనము లెక్కడనుండి తేఁగలము? రోజు తర్లించు టెట్లు?

రామ—రోజుతర్లించువాఁడు దేవుఁడు. ఆసంగతి తరువాతఁ జూచుకొందము. ఇప్పు డగత్యములేదు. ప్రస్తుతము బ్రాహ్మణకన్య

విషయమైనయాలోచనయే చెప్పెను. ఇప్పుడున్న ధాన్యమంతయు నూఱురూపాయలుధరవచ్చినచో బ్రతికిపోవుదుము.

రామహరి వెడలిపోయెను. ఆతఁడు వెంటనే కొందఱుపెద్దమనుష్యులను దీసికొనివచ్చి తనవద్దనున్నధాన్యమంతయుఁ గొలిచివేసెను. ఆధాన్యమంతయును నూటాఱురూపాయలయెనిమిదణాలు వెలగలిగియుండెను. ధాన్యమంతయు గాదులనుండి తిరుగఁబోసి కొల్చి బస్తాలకెక్కించి యాదినశేషమంతయు నాపనియందే శ్రమదీసికొనియెను. లెక్కసరిచూచుకొని ధాన్యమంతయు నూఱురూప్యములకమ్ముడైనసంగతి తెలఁచుకొనఁగానే రామహరి కొకగొప్పఋణమునుండి విముక్తి నొందినట్లు పరమానందము కలిగెను.

సుహాసిని వీరిట్లు ధాన్యమంతయు వాకిటఁ దిరుగఁబోసికొనుటఁ జూచి దాసినిట్లడిగెను. "మీయజమానుఁడు మొన్న మొన్న రోజంతయుఁ గష్టపడి గాదెలోఁబోసికొనిన ధాన్యమంతయు నీవేళ వాకిటఁ దిరగఁబోసి నాఁడేందులకు?"

దాసి—ఎవ్వరికైన నమ్మివేయవలయునని-—

సుహాసిని తననిమిత్తమై యాకాఁపుదంపతులు తమసంవత్సరాహారమున నమ్మివేయుచున్నారని యెఱుఁగనే యెఱుఁగదు. గదుఁడు తన సొమ్మేదో ముందుగానే చేతిలోవేసికొనియెను. ఆమఱునాఁటియుదయమున రామహరి యొకబండినిదీసికొనివచ్చి దానికి రెండుమంచియెడ్లను బూన్చి దానిపైఁ గప్పువేసెను; మఱియు నాఁడాబండిలో మెత్త పఱిక్క నమర్చెను. అప్పుడాతఁ డింటిలోనున్న తనభార్యను బిలిచి "మనమువచ్చువఱకు మనయింటఁ గాపుండుటకు మనుష్యుల నేర్పాటు చేసితిని. సరే; నీవింక గంగాదేవిని దీసికొనివచ్చి యామెతో బండినెక్కుము. దరిదాపుగాఁ బదియెనుక్రోశములదూరము బాడినతవవల

యును. ఇఁక నెంతమాత్రము నాలస్యము చేయఁగూడదు. వేగముగా బండి నెక్కుఁడు" అని తొందరగాఁ జెప్పెను. అప్పుడు గంగాయమున లిర్వురు బండి నెక్కిరి. రామహరి బండిముందుఁ గూరుచుండి యెద్దులను దోలుచుండెను. గదాచండాలుఁడు బండిప్రక్కలనుండి నడచుచుండెను.

మధ్యాహ్నము రెండుజాములు గావచ్చినది. మార్గస్థులాయరణ్యమధ్యమునుండి నడచుచుండిరి. ఆసామీప్యమునం దేదిక్కునను, ఒక క్రోసుదూరములోపున నేయూరును లేదు. అప్పు డాకస్మికముగా "ఘా"మ్మనిఘిరఁగి పేల్చినచప్పు డొకటి వినఁబడియెను; ఆవెంటనే రామహరి "బాబో"యని యఱచుచు నేలంబడిపోయెను; బండియెద్దులు రెంటును బెదరి యెగిరిపోవఁజొచ్చెను. బండిలోని గంగాయమున లిరువురు ఘోరున రోదన మొనరించుచుండిరి. గదాచండాలుఁడు వేగముగఁ బలాయితుఁ డయ్యెను.

తక్షణమే పెద్దగడ్డమును బెద్దమీసములును గల యొకపురుషుఁ డాబండిప్రక్కను గట్టఁబడిన తెరను దొలఁగించి లోనికిఁజూచుచుఁ గర్కశకంఠముతో నిట్లనెను. "మీకుఁ బ్రాణములపై నాసయున్నఁ గిక్కురుమనకుండ నుండుఁడు. లేనిచో మీదుర్గతికి మేరయుండదు."

సుహా—ఎన్నటికిని లేదు. దుర్దశలు నాకు దగ్గఱచుట్టములే యైపోయినవి. ఇఁకముం దేమైన నగుఁగాక; నీమాటమాత్ర మొక్కనాఁటికి వినుదానను గాను.

ఆపదలలోఁ బడుటచే సుహాసిని సాహసము శీఘ్రముగా వర్ధిల్లఁ జొచ్చెను. లజ్జయుఁ గోమలవాక్యములును మెల్లగా నామెను విడిచిపోవుచుండెను; గంగాయమున లిరువురు గొంతెత్తి విలపించుచు నాపెద్దమీసములవానితో వితండవాదము గావింపఁబూనిరి; మఱియు వారిరువురును బండిదిగి రామహరి దగ్గఱ నేలపైఁబడి కాతరకంఠములతో రోదనము

చేయ మొదలిడిరి. తుపాకును బట్టుకొనియున్న యాపురుషుఁ డుచ్చస్వరముతో "రండు" అని పెద్దకేక వేసెను.

తత్క్షణమే ప్రక్కలనున్న చెట్లగుంపులోనుండి నల్వురుమనుష్యులు భయానకరూపములతో నక్కడకు వచ్చిపడిరి. తుపాకుఁబట్టుకొనియున్న యాపురుషునియాజ్ఞచే వారువస్త్రములనొకదాని నాయిరువురుపడతుల మోములపైఁ గప్పి వారికాలుచేతులను సంకెలలతోఁ గట్టివేసిరి.

ఆజ్ఞయైనంతమాత్రమునఁ గావలసినపని జరిగిపోయెను; తుపాకు పట్టుకొనియున్న పురుషుఁడు బండిముందునిలువఁబడి కేకలు వేయఁజొచ్చెను. మఱియిద్దఱుమనుష్యులు పరుగెత్తికొనివచ్చి రామహరి దేహమును పైకెత్తి ప్రక్కడొంకలలోఁ బాఱవేసిరి; ఈభయంకరవ్యాపారమంతయు నత్యల్పకాలములోనే జరిగిపోయెను;వనభూమి నిశ్శబ్దమై పోయెను. బండి చాలదూరము పరుగెత్తుకొనిపోయెను.

# యోగేశ్వరి

## సప్తమఖండము—అమృతము.

### మొదటిప్రకరణము.

అవతరి.

యోగానందుఁడును, ఉమాశంకరుఁడును మధ్యాహ్నకాలమునాఁడు కాశీలోనితమకుటీరముముంగిటఁ గూర్చుండి మాటలాడుకొనుచుండిరి.

ఉమా—మీరానతీయవలయును. ప్రస్తుతము హిందూధర్మమనుపేరిటఁజెప్పఁబడుచున్న దొక నూతనధర్మముగా నగపడుచున్నది; శాస్త్రములయందు దానికాధారమేమియు లేదు. మఱియు వేదవేదాంగములయందును నది చెప్పఁబడియుండలేదు. ఈయభినవధర్మ మెట్లుత్పన్నమైనది?

యోగా—ఎట్లుత్పన్నమైనదో నిర్ణయముచేయుట కష్టసాధ్యము. నేను నీకొక్కసంగతిమాత్రము చెప్పఁగలను; నీవునుస్వయముగా దాని నెఱుఁగుదువు; ఏదన? ప్రస్తుతము హిందువులు తమధర్మశాస్త్రములని చెప్పుకొనుచున్నగ్రంథములలో నెక్కడను హిందూశబ్ద ముచ్చరింపఁబడియే యుండలేదు; మఱియు హిందూజాతినిగూర్చిగాని, హిందూధర్మమునుగూర్చిగాని యెక్కడను జెప్పఁబడియుండలేదు. మనయీజాతి యక్కడక్కడ గ్రంథాదులయందు "ఆర్యజాతి"యను పేరున వాడఁబడుచున్నది; ధర్మమనునొకశబ్దమునందే మనయైహికాముష్మికకల్యాణవిధులన్నియు నిరూపింపఁబడుచున్నవి. ఈ రెండుశబ్దములను జతపఱచి మనము

మనధర్మములను "ఆర్యధర్మము"లని నిజముగాఁ జెప్పఁగలము. కాని, దీనిని హిందూధర్మమని చెప్పుట కేవిధమైనయాధారమును గానరాదు. వాస్తవముగా హిందూశబ్దము శాస్త్రములతో సంబంధములేని యొక నూతనశబ్దము. ఈశాస్త్రసంబంధములేని నూతనశబ్ద మెల్లప్పుడు మన ధర్మములకుఁబరిచితమైనదో, అప్పటినుండి స్మృతికాలపుధర్మమును శాస్త్రవిరుద్ధమైనయొక యత్యాశ్చర్య వేషమును ధరించుకొన్నది. ఆర్యులసారధనము వేదవేదాంగములు. వానినిగూర్చినయాలోచనము హిందువులకు లేదని చెప్పవచ్చును. ఆర్యులకు లక్ష్యస్థానము బ్రహ్మజ్ఞానము; హిందువుల లక్ష్యస్థానము అప్సరస్సంబంధమైనస్వర్గభోగము; ఆర్యులకవలంబనము సనాతనపరమపురుషునివదనమునుండి వెలుపడినయపౌరుషేయశాస్త్రము; హిందువులయవలంబనము ఋషులుమొదలగువ్యక్తులచే వ్రాయఁబడిన గ్రంథజాలము. ఆర్యులలక్ష్యము, ఆబ్రహ్మస్తంభపర్యంతమునుగలసమస్తమునకునుసంబంధసంస్థాపనము. హిందువులలక్ష్యమిక్కడను నక్కడను గూడ స్వసుఖసంస్థాపనము; ఆర్యులకోరిక సగుణమార్గమునుండి నిర్గుణబ్రహ్మమును బొందుట; హిందువులకోరిక కేవలసగుణాశ్రమము; ఆర్యుల విశ్వాసము మృత్యువులేదని; హిందువులకుమరణాసన్నభయము; ఆర్యులు సద్గతిమునుగోరుటయే జన్మసారమని యెఱుఁగుదురు; హిందువులు స్వసుఖమే జీవనసారమని తలంతురు. ఆర్యు లాంతరంగికపరిశీలనమువలన నున్నతిబొందెడిచిత్తవృత్తిని ధర్మమని భావింతురు; హిందువులు కొన్ని ఘనకార్యము లాచరించుటను ధర్మమని తలంతురు. ఇట్లు చూచినచో హిందూధర్మములకును, నార్యధర్మములకును విశేషసంబంధము లేదని నీకే తెలియఁగలదు. ఇది యొకనూతనశాఖ.

ఉమా—తెలిసినది. వర్తమానకాలమునందుఁ బ్రచారము లోనున్న హిందూధర్మము ప్రత్యేక మొకనూతనశాఖయని తెలిసినది. కాని, దీనికి శాస్త్రాధార మేమియును లేదా?

యోగా—లేకేమి! కాలక్రమమున లోకుల ప్రవృత్తులును, అభిలాషలును బరివర్తనములగుచున్నవి; వానితోఁగూడ ననుకూలశాస్త్రములును బ్రణీతము లగుచున్నవి. ఈనూతనశాస్త్రములసిద్ధాంతములవలనఁ గొంతయు, వానివ్యాఖ్యలవలనఁ గొంతయు, జనులయభిలాషల ననుసరించికొంతయుఁ గాలబలముచేఁ బరివర్తనముఁజెంది యిది యొక నూతనశాఖగాఁ బరిణమించినది.

ఉమా—ఏయాధునికశాస్త్రకారుల యభిమతానుసారముగా నిప్పుడు హిందూధర్మ మీయాకారమును ధరించినదో, వారి యుక్తిప్రకారము సంపూర్ణముగా మూలగ్రంథములతో సంబంధములేనిదిగానే యున్నదా?

యో—కాదు వత్సా! కేవలము బహిర్భూతముగాదు. మొట్టమొదట నేమహాత్ములు లేఖినిని జేతఁబట్టుకొనిరో, వారు మూలములోని సంగతిని గొంతదీసికొని కొంతకల్పనము దానికి జతపఱచిరి; కాని కాలక్రమమున టీకాకారులును, వ్యాఖ్యాతలునుదయగల్గి క్రమముగా మూలసంగతిని దొలఁగించుచువచ్చిరి.; తరువాతివారు మూలమునుగూర్చిన యాలోచనమును విడిచిపెట్టుచుఁ గప్పిపుచ్చుచు రాఁగా నాతరువాతఁ గ్రొత్తక్రొత్తశాస్త్రకారు లావిర్భూతులుగాఁజొచ్చిరి. ఇఁక మూలశాస్త్రమొక్కమాఱుగానే పరిత్యజింపఁబడి కేవలస్వాతంత్ర్యకల్పనలకే యాశ్రయ మీయఁబడినది. ఈవిధముగాఁ బ్రస్తుతకాలపుధర్మమునకును, సనాతనార్యధర్మమునకును, ఆకాశపాతాళాంతరముగల్గిపోయినది.

ఉమా—ఈనూతనశాస్త్రకారులందఱు నేదేని దురభిసంధికి వశవర్తులైయిట్టియభిప్రాయములను బ్రచారితములుగావించియున్నారా?

యో—వత్సా! అట్లుకాదు. మొట్టమొదట మిక్కిలి సదభిప్రాయముతోనే శాస్త్రకారులు తమతమయభిప్రాయములను బ్రచారితములుగావించిరి. మనుష్యప్రవృత్తులననుసరించి వారియభిమతములకనుశ

సామర్థ్యములకును ధర్మాచరణము సులభసాధ్యముగాను నుండునట్లు చేయం గోరియే, మూలశాస్త్రములయభిప్రాయములను విశదములుగను సర్వజనసులభములుగను వారు మొట్టమొదటవ్రాయంబూనిరి. కాలక్రమమున ననేకశాస్త్రకారులు బయలుదేరుటచే మూలశాస్త్రములు విలుప్తములును విస్మృతములును నై పోయినవి. ధర్మాకాశమున నవర్షాకాలమేఘములవలెఁగల్పితధర్మములు వ్యాపించి సనాతనధర్మసూర్యునిసమాచ్ఛన్నముచేసివేసినవి.

ఉమా.—ఈదారుణమగుదశ యింకఁదొలఁగిపోదా? ఇంక నార్యధర్మవిమలజ్యోతి, పెంపుదూరధర్మరూపమైన యీకుధర్మమును భేదించి మరల ప్రదీప్తముగాదా?

యోగా.—చాలఁగష్టము; అత్యంతగాఢాంధకారముచే భారతవర్షధర్మాకాశము కప్పువడిపోయినది. ఇప్పుడందఱును ధర్మవ్యాఖ్యాతలే. అందఱును ద్వితీయవేదవ్యాసులమనకొనువారే. అందఱును భ్రాంతిరహితులమనుకొనువారే. ఈయవస్థలో నొకరిమాటనొకరు వినకటవల్లను ఒకరినొకరు బాధించుటవల్లను బాలభాగమొక నూతనదుర్దశ వ్యాపించినది. మీరు ప్రకృతకుత్సితధర్మము నాశ్రయించితమసనాతనధర్మమును బరిత్యజించిరి. ఈసంగతినిమాత్ర మెవ్వరైనం జెప్పంబోయినయెడల బరమహాత్ములైన యామహాత్ములను వారు "ధర్మద్వేషులు—ఆచారభ్రష్టులు—అసాధువులు" మొదలగు బిరుదులచే నవమానించుచుందురు.

ఉమా.—అయినచో నిఁక నుపాయమేమి?

యోగా.—ఉపాయముఁజూపుటకు దైవమే కర్త. వానికృపలేనిచో నుపాయములేదు. ఈదుర్దశలనఁ జూచియే శ్రీకృష్ణుఁడొకమాఱు ధర్మవ్యాసమును గావించుటకుఁగడంగెను. వసుంధర నావరించియున్నయధర్మాంధకారమును దొలఁగింప విమలధర్మజ్యోతిని వెలిగించు నభిప్రాయముతోడనే యర్జునసారథ్యభారమును వహించి యాతెఁడు శ్రీమద్భగవ

ద్గీతారూపమైన పరమదివాకరుని బ్రతిష్ఠించెను. ఆగీత సత్యమైన సనాతనధర్మమార్గమును నూటిగాఁజూపుచున్నది.

ఉమా.—ఆగీత ప్రస్తుతమునందున్నది. దానినిమార్చి లోకమిప్పటికిని విశేషసమాలోచనము చేయుచునేయున్నది. అయినను మానవులభ్రమాంధకారము తొలఁగిపోలేదేమి ?

యోగా.—గీతాశాస్త్రసమాలోచనములు జరుగుచున్నమాట సత్యమే; కాని, యది చాలదు. బహుజనసమాకీర్ణమైన భారతవర్షమునందు గీతాశాస్త్రమును జదివినవా రెందఱున్నారు ? గీతార్థము ననుసరించి నడచునా రెందఱుఁగలరు ? కేవలము శ్లోకములను వల్లెవేయువారనేకులున్నారు. కాని, సారగ్రహణముచేయువారుమాత్రము చాలఁదక్కువ. సారమును గ్రహించువారున్నను గ్రహించినదాని ననుసరించి ప్రవర్తించువారు లేనేలేరు. నిజముగా గీతాశాస్త్రసంబంధమైన యేసమాలోచనమునుగూర్చి నీవుచెప్పితివో ఆసమాలోచనము లేనేలేదు. ఇదిగాక గీతావిషయమున మఱియొక భయానకదుర్దశ కనఁబడుచున్నది. గీత సాంప్రదాయికవ్యాఖ్యాజాలములోఁ జిక్కువడినది. సాంప్రదాయికులైన మహాత్ములు తమతమ మతానుసారముగా గీతకు ద్వైతవాదము, అద్వైతవాదము, విశిష్టాద్వైతవాదము మొదలగు నర్థములను గావించియున్నారు. అందుచే శాస్త్రముయొక్క సత్యమైనయభిప్రాయమును నిర్ణయించుటకు వ్యాఘాతముగలిగెను. ప్రస్తుతమందు సత్యమైనది యర్థాంతరమునందుగాని, యవస్థాంతరమునందుగాని యసంభవమగుచున్నది. గీతను సత్యమైనదనియు భగవంతునిచేఁ జెప్పఁబడినదనియు నంగీకరించినచో దాని కనేకార్థములు గల్గియుండఁ జాలవు. కనుక ననేకసాంప్రదాయకులు తమతమమతాధిక్యములఁ బ్రతిపాదించుటకు దానికనేకార్థములను గల్పించి తమపాండిత్యమును బ్రకాశింపఁజేసినారని చెప్పవలయును. అందుచే శాస్త్రమునందలి యథార్థరహస్యము మఱు

గువడి స్వల్పబుద్ధులైన మానవులు యథార్థమేదియో-గ్రహింపఁదగిన దేదియో తెలిసికొనఁజాలక విభ్రాంతులైపోయిరి. అయినను, ఈమర్దిన ములలోఁ గూడ గీతాసమాలోచనమే మనప్రధానాశయమైయున్నది. అది సత్యమును స్వప్రకాశము నగుటయే యందులకుఁ గారణము-సదా సత్యాన్వేషణపరాయణులై, యేకాగ్రచిత్తముతో సత్యమునే యాకాంక్షించుచున్నచో నావశ్యకముగా సత్యము లభింపఁగలదు. గీతాగర్భములో సత్యము నిహితమైయున్నదనుటకు సందేహములేదు. ఆసత్యమును నిర్ణయించునభిలాషముతో గీతకు శరణాగతులమైనచో-ననన్యచిత్తముతో గీతను భజించినచోఁ, గాలక్రమమున విధాయకముగా స్వప్రకాశసత్యమును దర్శింపఁగలము.

ఉమా.—అట్లయినచోఁ దా మీదారుణదుస్సమయమున మానవగణమునకు గీతాశాస్త్రోపదేశము ననుగ్రహింపరాదా?

యోగా.—అందులకేమియు సందియములేదు. అనన్యచిత్తముతో గీతాసమాలోచనమునకుఁ బ్రవృత్తులైనచో నవశ్యముగా మానవులు సత్పథమును దర్శించి సద్గతిని బొందఁగలరని నాకు దృఢవిశ్వాసము గలదు.

ఈసమయమున హారకుమారబాబు వారిసన్నిధి కరుదెంచి భక్తితో యోగానందునకుఁ బ్రణామము మొనరించెను. యోగానందుఁ డాయన నాశీర్వదించుచుఁ బీఠమునఁ గూర్చుండుమని యెను.

హారకుమారుఁ డుమాశంకరునిఁ జూచి "మూఁడుదినములనుండియు నాకుఁ గనఁబడుటలేదేమి? శరీరములో బాగుగనున్నదా?" అని యడిగెను.

ఉమా.—స్వామికృపచే నెప్పుడున దేహమునం దనారోగ్యమెఱుఁగను. గురుదేవుఁ డుపదేశించిన నియమముల నన్నిటిని బరిపాలించు

చుండఁగల్గినంతవఱకు, ననారోగ్య మునసది నాకెఱుక పడఁజాలదు. కార్యాంతరములతొందరచేఁ గొన్నినాళ్లనుండి మీదర్శనమునకు రాఁజాలకుంటిని. (తలవంచుకొని) మీరెండుకుటుంబములును కుశలముగా నున్నవా ?

హర — ఆఁ, కుశలమే. కాని, అన్నపూర్ణమాత్రము నేఁటియుదయమునుండియు నించుక నలఁతిగా నున్నది.

ఇదియా సన్న్యాసులహృదయము ! అన్నపూర్ణ యనారోగ్యవృత్తాంతము వినినతోడనే యుమాశంకరుని హృదయము మిక్కిలి వ్యాకులతఁ బొందిపోయెను. కాని యాతఁడు మాటలచేతను, గ్రియలచేతను దానిని బయలుపడనీయలేదు. అన్నపూర్ణయనారోగ్యమును గూర్చియు, దానిప్రస్తుతస్థితినిగూర్చియు సవిస్తరముగాఁదెలిసికొనుట కాతని కాతురతగల్గెను గాని యాతఁ డావిషయమునఁగూడ హరకుమారు నేమియు నడుగలేదు.

యోగా — నీలరతనబాబుకొమార్తె కెట్టియనారోగ్యము? ఆయన యిప్పు డేమిచేయుచున్నాఁడు ?

హర — కొంచెముజ్వరమువచ్చినది. దానికేమియుఁ దొందర లేదు. నీలరతనబాబు మహాభారతమును జదువుకొనుచున్నాఁడు; నే నిప్పుడే చూచివచ్చితిని.

యోగానందుఁ డుమాశంకరుని నిరీక్షించి "నీవుకొన్నాళ్లనుండి నీలరతనబాబు మందిరమునకుఁ బోవుటలేదేమి ? నీవిపుడచ్చటికేఁగి యన్నపూర్ణయారోగ్యవృత్తాంతమును దెలిసికొనిరమ్ము" అనియెను.

ఉమాశంకరుఁడు గురుదేవుని పాదధూళి నించుక శిరమునధరించి యచటినుండి వెడలిపోయెను.

ఆతఁడు వెడలఁగానే ఘనానందుఁడు "ఈసన్న్యాసిబాలకుఁడు నీలరతనబాబుతనయను మిక్కిలిప్రేమించుచున్నాఁడు. ఈతని యభిప్రాయ

మేవాకకుంబనుగెత్తునో తెలియదు. కేవలముం బ్రేమ మిక్కిలిమధురమైనవస్తువు; కాని, దానితో నింద్రియలోలత్వము కాలక్రమమునసమ్మోళనముకాఁగలదు. అప్పు డనేకప్రతిబంధకములు సంభవించి దారుణమైన మనస్తాపమునకుఁ గారణములు గాఁగలవు. అంతియెకాదు. అంతకంటెను నీతని యిహజీవనమును, విద్యాబుద్ధులు నిరర్థకములుచేయఁజాలిన దురవస్థ తటస్థింపఁగలదు.

హర.—నీలరతన బాబుకొమార్తియు నీసాధుకుమారుని విశేషముగాఁ బ్రేమించియున్నది. వీరి యాంతరంగికమైన ప్రేమాకర్షణము చూడఁగా సమ్మేళనము వాంఛనీయమనియే తోఁచుచున్నది. కాని, దీనికభ్యంతరము లనేకములున్నవి. మొదటిసంగతి యీబాలుఁడు సన్యాసి; రెండవది యీతఁడజ్ఞాతకులశీలుఁడు. మహాత్ములగు తాము నీవీని తల్లిదండ్రులసమాచారము నెఱుగ రనుకొనెదను.

ఘనా—ఈతఁడు సన్యాసికి శిష్యుఁడే. కాని, సన్యాసమును స్వీకరించినవాఁడుగాఁడు. పసితనమునందుండియు నీబాలుఁడు నాయాశ్రమమునఁ బెఱుఁగుచున్నాఁడు. ఆచారములయం దాసక్తి చూపినంతమాత్రమున నీతనిని సన్యాసియనఁదగదు. ఈతనియదృష్టమున మహైశ్వర్య మనుభవించుయోగమున్నది. అది యేవిధముగా సంఘటించునో చెప్పఁజాలను! కాని, యందుచేతనే, నేనీతని కితరవిద్యలతోపాటు సాంసారికవ్యాపారమునుగూడ బోధించుచు వచ్చితిని. ఈతఁడు బ్రాహ్మణుఁడని నేను వినియున్నాను.

హర—ఈతనిపూర్వవృత్తాంతము విశేషముగాఁ దెలియదుగాని తెలిసికొనవలసినప్రయోజనమున్నచో నందుల కుపాయమాలోచింతమని తామిదివఱకు సెలవిచ్చియున్నారు.

ఘనా—ఆవిషయములో నేనెఱిఁగియున్నది చాలఁదక్కువ.

సోనామణి, యను నొకవృద్ధబ్రాహ్మణవితంతువు కాశియందు వాసము చేయుచుండెడిది. ఆమె నన్ను భక్తిభావముతోఁ జూచుచు నీబాలు నెత్తుకొని నాయాశ్రమమునకు వచ్చుచుండెడిది. నేనుగూడ నప్పుడప్పు డామె యింటికేఁగి యీబాలుని జూచి వచ్చుచుండెడివాఁడను. నేనీబాలకుని శుభలక్షణములను జూచి యదృష్టగణనము చేయఁగా ముందుముందీతఁడు బహువిధసంపత్తి కధికారియుఁ బరమధార్మికుఁడును గాఁగలఁడని తేలినది. స్వల్పకాలములో సోనామణి రోగపీడితయై యవసానకాలమున నాకువర్తమానమంపెను. అప్పుడామె "ఈశిశువు పవిత్రబ్రాహ్మణవంశమున జన్మించినాఁడనియు నీతఁడుతల్లిలేనిబిడ్డయనియు, నీతనిపుట్టుపూర్వోత్తరములు గావలసివచ్చినచో వంగదేశమునందలి రామనగరమున వాసముచేయుచున్న గంగామణియను నొకవితంతువు నడిగి తెలిసికొనవచ్చుననియు, ఆమెవద్ద నందులకుఁగావలసిన నిదర్శనపత్రములనేకములున్నవనియు, వానిని జూచినచో నీపిల్లవాని తల్లిదండ్రులయావద్వృత్తాంతముఁ దెలియఁగలదనియుఁ, దనయనంతర మీబాలునిఁ బరిపాలించు నాత్మీయు లెవ్వరు లేరనియుఁ జెప్పి యీబాలకునిభారము నాపైవైచి యామె కాలధర్మము నొందెను. నాఁటినుండియు గృహస్థోచితమైన శిశుపోషణభారము నాకు వహింపవలసివచ్చినది. సుగుణవంతుఁడైన యీబిడ్డ నాఁటినుండి నేఁటివఱకు నాయొద్దఁ బెఱుఁగుచున్నాఁడు. నేనును దగినరీతి నీతనిచే శాస్త్రాధ్యయనము చేయించుచు నీతఁడు చరిత్రవంతుఁడగుట కనేకప్రయత్నముల సాహాయ్యపడుచుంటిని. అంతియకాని యీతనిపూర్వచరిత్రమును దెలిసికొనుటకు నేనెట్టిప్రయత్నమును జేయలేదు, ఇంతవఱకు నట్టియవసరముగాని, యట్టిసంఘటనముగాని నాకుఁ దటస్థింపలేదు. ఈబాలకుని భవిష్యత్తునుగూర్చి నాకు రెండువిశ్వాసములు గలవు; ఒకటి- ఈమె పెంపుడుతల్లినిగూర్చి; ఆవృద్ధురాలినిగూర్చి నాకెట్టిసందేహమును లేదు; ఆమె ధర్మపరాయణ. రెండవది—

యీతని యదృష్టము మంచిదని. కాని, దానిసూచన లేశమైనను నాకెంతవర కును గనంబడ లేదు.

హార.—బాలకుండసాధారణభాగ్యశాలి యనుటకుం దమవంటి మహాపురుషులయాశ్రయలాభమే నిదర్శనము. రామనగరమున గంగామణి యనునామెయొద్దం గొన్నినిదర్శనపత్రము లున్నవనియు, వానివలన నీబాలునితల్లిదండ్రులవృత్తాంతము తెలియంగలదనియుం దామసెల విచ్చియున్నారు. ఆమెను దామెఱుంగుదురా ?

ఘనా—నేనేమియు నెఱుంగను. అందుల కెప్పుడును బ్రయత్నింపను లేదు. ఇప్పు డామె జీవించియున్నదో లేదో కూడ నాకుం దెలియదు.

హారకుమారుండు చాలసేపాలోచించి యిట్లనియెను. "భాగ్యశాలియైన యీకుమారునిజీవనచరిత్ర మెట్టిదుర్జేయరహస్యజాలములోం గప్పువడియున్నదో తెలియదు. ఏమైననుసరియే, దానిని దెలిసికొని తీరవలయును. ఇక ముందు నేనాకార్యమునే నాప్రధానకర్తవ్యముగా నవలంబింపంగలను. ఎట్లయినను గృతకృత్యుండనగుట కాశీర్వదింపుండు.

ఘనా.—ఎట్లయినను నీప్రయత్నము సఫలమగుటకు సందేహము లేదు. బాలకుని భాగ్యసూత్రమొకటి నిశ్చయముగాం గనంబడుచున్నదు టచే సకలకార్యములు ననుకూలములు గాంగలవు.

హార.—ఈ రామనగర మెక్కడనున్నదో, అదియేమైనం బ్రభువు వారెఱుంగుదురా ?

ఘనా.— తెలియదు.

హార.—రామనగరము లెన్నియో యున్నవి. కానిమ్ము; ఆపట్టణములన్నియుం బరీక్షించెదను. దేవరయాశీర్వాదము తప్పక సిద్ధింపంగలదు.

ఈవిధముగాఁ గొంతసేపు వారిరువురు సంభాషించుకొనిరి. పిమ్మట హరకుమారబాబు ఘనానందస్వామియొద్ద సెలవుపుచ్చుకొని వెడలిపోయెను.



## రెండవ ప్రకరణము.

### బ్రహ్మానందము.

కుటీరమధ్యమున యోగానందస్వామి యొంటిగ ధ్యాననిమగ్నుఁడై యుండెను. ఉమాశంకరుఁడు భిక్షార్థమో యేమో బయటికి వెడలియుండెను. ధ్యానావస్థయందు దాసన్యాసి సముజ్జ్వలదేహ మధికతరకాంతిమంతమై ప్రకాశించుచుండెను; ఆతనిముఖమండల మపార్థివానందజ్యోతిచేఁ బ్రదీప్తమై కనఁబడుచుండెను. బాహ్యజ్ఞానశూన్యమైనభావముతో, స్తంభితనయనములతోఁ బద్మాసనాసీనుఁడైన యాసాధువు ధ్యాననిరతుఁడై యుండెను.

మెల్లఁగా, నిశ్శబ్దముగా నప్పు డక్కడకు యోగేశ్వరి యరుదెంచెను. నిరుపమానములైనశోభాజ్యోతులు మూర్తిమంతములై యచ్చో నావిర్భవించిన ట్లగపడుచుండెను. యోగేశ్వరి యత్యంతభక్తితో లలాటము భూమికిసోఁకునట్లు ఘనానందునకుఁ బ్రణామముగావించి, యాతనిసామీప్యమందలిభూరజమును గైకొని కన్నులనద్దికొని, శిరమునధరించుకొని, వక్షమునఁ బూసికొని, నాలుకపై వేసికొనియెను. ఆతరువాత నామె మౌనముతోను నిష్పందభావముతోను నక్కడనే నిల్వఁబడి యుండెను.

చాలసేపు ధ్యాననిమగ్నుఁడై యుండియుండి ఘనానందస్వామి కొంతసేపటికిఁ గన్నులు తెఱచెను; ఎట్టయెదుట దివ్యకాంతితోఁ దేజరి

ల్లుచున్న యోగేశ్వరి యాతనికిఁ బ్రత్యక్షమయ్యెను. చూచి ఘనానంద స్వామి—"ఏమిది? యోగేశ్వరీ! నీవేతెంచి యెంతసేపైనది?" అని యడిగెను.

యోగే—(నవ్వుచునవ్వుచు) ఇక్కడకు విశ్వేశ్వరునిమందిర మెంతదూరమున్నదో అంతసేపైనది.

ఘనా—దూరత్వముతో సమయము నెట్లుకొలువవచ్చును?

యోగే—కాలపరిమితి మీసన్నిధి నించుకయు లేదు. మీరనంతులు; కాలము ననంతమైనదే. దాని నెవ్వరుకొలువఁగలరు? నేనన్నివిధముల నల్పురాలను. అత్యల్పురాలను—అందుచే సమయమునుఁగొలువఁగోరుచుందును! దూరత్వమును గాలముతో నెందులకుఁగొలువరాదు? ఎక్కడకుఁబోవుట కెంతసమయముపట్టునో అదియే దానికొలఁత.

ఘనా—అది సరియైనకొలఁత యెట్లగును? ఏమన? నీవిక్కడనుండి విశ్వేశ్వరునిమందిరమునకుఁ గొంతసేపటికి వెళ్ళఁగలవు—ఇంకొకరు నీకంటెఁ గొంతయాలస్యముగా వెళ్ళఁగలరు—మఱియొక రెంతయో వ్యవధానమున్నఁగాని పోనేలేరు. కాఁబట్టి యీకొలఁతి దూరత్వము ననుసరించి యందఱివిషయమునను సమానముగా నుండుట యెన్నటికిఁ సంభవింపదు. ఇదిగాక, యింకొకవిశేషము—ఒకానొకరు, ఏదియైనని ప్రయోజనముగల్గినప్పు డొకచోటి కతివేగముగా నెళ్ళఁగలరు; ప్రయోజనము లేనప్పుడు వారే యాచోటి కత్యాలస్యముగాఁ బోఁగలరు; ఒక వ్యక్తి యొకచోటికే వేగముగఁబోయినప్పు డల్పకాలమును, ఆలస్యముగా నరిగినప్పుడధికకాలమును బట్టుచున్నది. దీనిచే వ్యక్తిసంబంధమునందును దూరత్వానుసారముగాఁ గాలపరిమాణ మన్నిసమయములలో సరిగా నుండఁ జాలదు.

యోగే—స్వామీ! హృదయేశ్వరా! నేనిదియంతయు నెఱుఁగనే యెఱుఁగను. నిన్నుమాత్రమే నేనెఱింగియున్నాను—నిన్నుమాత్రమే

నేను సర్వత్ర చూచుచున్నాను—నాప్రాణము, హృదయము, సకలము నీవేమై యున్నావు;—అయినను నీవు నాకెంతో దూరమునందున్నావు. కొంతకాలమునుండి కొన్నియుగములనుండి నిన్నుఁ బొందుటకే నేనఱు కలువేయుచున్నాను; అయినను నీవిప్పటికిని నాకుఁ జాలదూరముగనే యున్నావు. పట్టుకొనియుఁ బట్టుదొరుకుట లేదు; పొందియుఁ బొందుదొరుకుట లేదు. దూరదూరముగా నిట్లుచూచుచున్నాను. దయామయా! ప్రాణవల్లభా! ఇంకను నెన్నిదినము లీదుఃఖిని మీచరణసేవకురాలి నిట్లు కష్టపెట్టెదవు? ప్రాణేశ్వరా! ఎంతకాల మీదాసి నిట్లు యాచనము చేసెదవు? నీసమ్ముఖమునందుండియే నేను దూరత్వమునకును, గాలమునకును సంబంధమును జూచుచున్నాను. దయామయా! ఈదూరత్వమును దొలఁగించివేయుము! ప్రాణబంధూ! ప్రాణముతోఁ గలసి కాలచింత నాకు దూరముగా నుండునట్లు చేయుము

యోగానందుఁడు తనలో నిట్లనుకొనఁజొచ్చెను—"యోగేశ్వరి జ్ఞాననిష్ఠయు, బ్రహ్మజ్ఞానమును సార్థకములు. ఆమె మొదటినుండియు ధ్యానాదిసాధనములచే విషయవైరాగ్యము నవలంబించి, ప్రాణాయామము మొదలగు నుపాయములమహిమచే నిర్గుణబ్రహ్మసాధనాపథమునకు విశేషముగా దరిఁజేరలేకపోయెను. మఱియు బ్రహ్మోపలబ్ధిచేఁ గలిగినవెలుఁగువలన హృదయాంధకారమును నిర్మూలితముగావించివేయుటకు సమర్థురాలు గాఁజాలకపోయెను. అయిన నీనారీమణి, యీనవీనురాలు, ఈయలోకసామాన్యస్త్రీ, సగుణసాధనాపథమునుండి, భోగప్రవృత్తిసూచకమును, బ్రవర్ధకసంబంధమునగు నవలంబనముగావించి, నిరతిశయమైనయేకాగ్రతయు, దృఢతాహేతువునైన స్వతంత్రతచే బ్రహ్మజ్ఞానమువంటిదుర్లభసౌభాగ్యమునకు నధికారిణి యయ్యెను. ఈమెసాధన సార్థకమైనది! ఈమెజీవనము ధన్యమైనది!" తరువాత నాతఁ డామెను జూచి "ఇప్పుడేమి, దేవీ! నీకు నన్నుఁబొందుట యింకను బాకియున్నదా?

నన్ను నీవిప్పటికిని బట్టిబంధింపలేదా ? ఇప్పటికిని నీప్రాణములో నన్నుం జేర్చికొనలేదా?" అనియెను.

యోగే.—లేదు, లేదు ప్రాణేశ్వరా! ఇప్పటికిని మిక్కిలికొదవ గలదు; ఇప్పటికిని చాలదూరమున్నది. ఇప్పటికిని నే నేదిక్కునకుఁగోరి చూచుచున్నానో, ఆదిక్కునం గేవలము నిన్నే చూచుటలేదు; ఇప్పటికిని భాషయందు నీనామాక్షరములుతక్కం దక్కినయన్నిశబ్దములును నేను మఱచిపోవుటలేదు; ఇప్పటికినిగూడ నొక్కొక్కమాఱు మాంసచక్షువులతో నిన్నుం జూచుచున్నాను; అందుచేతనే యిప్పటికిని విశేషదూరమునందున్నాను.

యోగా.—కాని, నీకింక దూరములేదనియు నీవు స్వామితో నభిన్నురాలవనియు, తన్మయురాలవు నై యుంటివనియు నే నెంచుచున్నాను.

యోగే.—నీవు మిక్కిలి శఠుఁడవు. చాలధూర్తుఁడవు; పెద్దవంచకుఁడవు; కావుననే యిట్లనుచున్నావు. నీమాట సత్యమే యైనచో నొక్కొక్కమాఱు నాప్రాణము శూన్యమైపోవుట యెందులకు? ఒక్కొక్కమాఱు నిన్నుఁబోఁగొట్టుకొనుట యెందులకు? కాని, యది యేమైనను సరియే; నేనింక నిన్నుఁబట్టుకొని నిశ్చయముగా నాప్రాణములోఁ బెట్టి బంధింపక మానను. నేను నిన్ను హృదయమందిరమునుండి యింక నొక్కయడుగైనఁ గదలనీయను. నీ వెంతదూరమునం దున్నను, నేను యుగయుగములు—జన్మజన్మములుఁ దిరిగితిరిగి నిన్నుఁ బట్టి బంధింపక మానను. నీవు నన్ను మోసముచేయుచు నెన్నిదినములు గడపఁగలవు? నాసాధన కవధిలేదా ? నీచాతుర్యము మేర యెంతదూరమో ?

యోగా.—నిన్ను మోసపుచ్చుట యసంభవము; నీసన్నిధినుండి దూరమగుట యసాధ్యము. నీదృఢత, నీపవిత్రత, నీభక్తి, నీప్రేమ యన్నియు నద్భుతములు నీచేతినుండి విడిపించుకొనుట యెవ్వరికి సాధ్యము?

యోగే.—ఇష్టాలాపములచేఁ దృప్తినొందించుచు, దుష్టత్వమూని నీవెందఱినో చిరకాలమునుండి సర్వనాశ మొనరించుచు వచ్చితివి. నేను నీమాటలకు మోసపోను! నీవు మంత్రగాఁడవు. నీకిప్పు డున్న భావము, మరల నిప్పుడే రూపాంతరమందుచున్నది. ఇదే నీసమక్షము; ఇదియే నీపరోక్షము; ఇదే నీసంతోషము; ఇదియే నీవిచారము. నిన్ను విశ్వసింప రాదు. నీమంచిచెడ్డలను సరిగా గ్రహించుట యసంభవము. నేను నీమాటల కెన్నఁడును మోసపోను! అనేకులు నీయూఱడింపులకు మోస పోయి తుదకు దుఃఖించుచు నశించిరి. నేనట్టులేడ్చుచుఁ జచ్చు దానను గాను. నిన్ను హృదయమున బంధించి యనంతునియందు దేహమును జేర్పఁగలను; మఱియు ననంతునితో నైక్యమొంది యనం తామోదములో మునిఁగిపోయెదను. ఇదియే నాప్రతిజ్ఞ. నేను నీమాట లేందుకు వినవలయును? దానికేమి—నేనిప్పుడు వచ్చి—నీకొఱకుఁ జాంపే యపుష్పమాలికను గుచ్చవలయును.

యోగా.—బిడ్డను జూచివచ్చితివా? బిడ్డ నీకొఱకు "అమ్మా! అమ్మా!" యని కలవరించుచున్నాఁడు.

యోగే-బిడ్డయా!-ఇహ్హా! మంచిమాటయే; నీవు నామెడ కొక మాఱు బిడ్డనంటఁగట్టినావు. నిజమే—ఇప్పుడు కోడలు; సంసారధర్మము సకలము నంటించి సంపూర్ణగృహస్థురాలిని గావించి మోసపుచ్చవలయు నని యెంచుచున్నావు. సరే; అంటించుము; నీకెంత మనసుగా నున్నదో! నే నేభావముచేతను నిరానందము నొందుదానను గాను. కాని, నేనీ సకలభావములలో మునిఁగి, యీసర్వసమ్మోదములచే మత్తురాలనై, నీమాయకు లొంగుదుననిగాని, యీక్షణికములకొఱకు నీసంగమును విడిచెదననిగాని నీవెంతమాత్రము భావింపవలదు. నావద్ద నీమోసములిఁక సాగవు. ఇహీ—బిడ్డతో మాటాడుచు, బిడ్డనుజూచుచు నాలస్యముచే సినచో నాసంపంగిపూవులు వాడిపోవు! పిల్లవాఁడిప్పుడు చాల వస్తుఁ

డై యున్నాఁడు. అత్యంతసుఖకరమైన యొకబాలికవదనసౌందర్యసుధ నిప్పుడు కోరి యనుభవించుచున్నాఁడు.

యోగా.—ఎవ్వారాబాలిక? ఎక్కడనున్నది?

యోగే—ఇంతవంచనగూడ నీవెఱుంగుదువా? ఆబాలిక యెవ్వరో నీవెఱుఁగనే యెఱుఁగవా? నీలరతనబాబుకొమార్తె, అన్నపూర్ణ నీ కాఁబోవుకోడలు.

యోగా—నీపలుకెప్పుడు నబద్ధముగాఁజాలదు. నీవన్నపూర్ణకోడలని యెప్పు డనియున్నావో, అప్పుడే నిశ్చయముగా నది యట్లుగాఁ గలదు; కాని, యట్లగుట కవకాశ మేమియు నగపడకున్నదే!

యోగే—నీమాట మిథ్యయగుట యెన్నఁడును సంభవింపదు. నీవెప్పుడు, ఉమాశంకరుఁడు రాజరాజేశ్వరుఁడు కాఁగలఁడని వచించియుంటివో, అప్పుడు నిజముగా నట్లేయైతీరవలెను. కాని, పరిస్థితి యట్లు జరుగునని తోఁచుటలేదు.

యోగా—నాయభిప్రాయ మేమనఁగా-ఇంతటిశాస్త్రజ్ఞుఁడు,నింతటిధర్మనిష్ఠాపరుఁడునై సన్న్యాసిపథమునందున్న యీ బాలకుఁడు మరల నివి యన్నియు విడిచి, నానాపరివారసమన్వితుఁడై విషయసుఖముల యందు మత్తుఁడుకావలెనా?

యోగే—నన్ను మోసపుచ్చెద వేమిస్వామీ! నీవెవ్వనిచేత నేమి చేయించెదవో వాఁడట్లే చేయవలయును; సకలసుఖైశ్వర్యపరివేష్టితుఁడైనసన్న్యాసిని సంసారమునందు దృష్టాంతముగాఁ జూపవలయుననియే నా కోరిక. పరమభాగ్యవంతుఁడైనయీబాలకుఁ డందుల కుదాహరణస్వరూపుఁడు. అట్లుకానిచో బాల్యమునుండియు నీయట్టిపరమగురుని యాశ్రయలాభ మెవ్వరియదృష్టమున ఘటిల్లును? ఈశిష్యుఁడు గురువుపేరు నిల్పఁబెట్టఁగలఁడు; నీసంకల్పము సిద్ధింపఁగలదు. వచ్చెదనను—ఆహా! ఏమిమధురము! ఏమిరమణీయము—సాయా దేహస్పర్శ! నాదేహము సంపూర్ణపులకితమైనది; కన్నులు జలపూరితములైనవి! ఇట్టి సమ్మేళన

మెట్టు లవిశ్రాంతమైయుండును? ప్రభూ! ఇంకొకమారు చుంబనము! ఇంకొకమారాలింగనము! ఏమిసుఖము! ఏమియానందము!

యోగేశ్వరి ముకుళితనయనములతో, శిథిలశరీరముతో అవసిత భావముతో నక్కడఁ బడిపోయెను; దేహమంతయుఁ గంటకితము, వికంపితము నైపోవుచుండెను. ఆమెయధరప్రాంతమునం దొకస్నిగ్ధమందహాసము కనఁబడియెను. ఉచ్ఛ్వాసనిశ్వాసము లతివేగముగా నుండుటచే హృదయము కంపించుచుండెను. తలయొఱగి భుజముపైఁబడిపోవుచుండెను. యోగానందుఁడు నిశ్శబ్దముగా నాప్రేమమయి యలౌకిక ప్రేమాద్భుత లీలలను జూచుచుండెను. అతఁడప్పుడు తనమనస్సులో నిట్లనుకొనియెను. "ఎంతకాలముమానవుని యీభావము సంపర్కానురూపముగా భగవంతునితో సంగమింపదో, అంతకాలము సకలమును వృథయే. ఆహా! శ్రీహరీ! నాకిట్టిసౌభాగ్యము కలుగునా? ఇట్టిభగవద్భక్తుని దర్శించినను భగవద్ధర్మముతోఁ దుల్యమైనఫలము నీయఁగలదు. ఏమి, నాశుభకరాదృష్టము! జీవన్ముక్తస్వరూపమైన యీదేవిదర్శనలాభము నాకు లభించినది." యోగానందుఁడు భక్తిభావముతో నక్కడిభూరజమును దీసికొని శిరమున ధరించి యోగేశ్వరికిఁ బ్రణామముఁ గావించెను. అతనికన్ను లశ్రుభారాక్రాంతము లయ్యెను.

అతఁడట్లు ప్రణామము గావించి తలయెత్తి చూచునప్పటికిఁ గుటీరద్వారమునందు హరకుమారబాబు నిలుచుండుటఁ గనఁబడియెను.

హర—ఏమి, నాసౌభాగ్యము! నేనొక్కమారుగనే నాతల్లిదండ్రుల నుభయులను జూడఁగల్గితిని!

అతఁడు భక్తితోఁ బుణ్యప్రదీప్తులైన యీయలౌకికదంపతులకుఁ బ్రణామముఁ గావించెను.

యోగేశ్వరి వ్యస్తచిత్తముతోఁ గన్నులు విచ్చి లేచెను.

హార—తండ్రీ! మీసంకల్పము సిద్ధింపఁగలదు. కాని, చాలనాల స్యమైనది. చాలనభ్యంతరములు గలవు.

యోగా—అభ్యంతరము లుండనిమ్ము; విలంబము గానిమ్ము. వానివలన మన కేమియు హానిలేదు. కాని, నీదయవలనఁ గార్యము సఫలమే కాఁగలదు.

యోగేశ్వరి "ఎవరికర్మము వారి కన్నియుఁ జేసి వేయఁగలదు." అని యోగానందునివంక వ్రేలిడిచూపుచు "ఈతఁడు మహాశక్తిసంపన్నుఁడైనమహాపురుషుఁడు. ఈతఁడన్నియును-అన్నియును—కాని, ఎవ్వరును గాఁడు, ఈతనిబిడ్డ యుమాశంకరుఁడు మహాపురుషునిబిడ్డ. అతఁడు మహాపురుషుఁడే యగును. మీపరిశ్రమ నిష్ఫలము కాదు. ఈతఁడు తనబిడ్డను మహాపురుషునిఁ జేయవలెనని సంకల్పించెను. ఎవరి కేదిసాధ్యమో వారి కది కాకపోవునా?" అనియెను.

ఎవ్వరు నేమియు మాటాడకపూర్వమే యోగేశ్వరి యక్కడ నుండి వెడలిపోయెను. యోగానందుఁడును హరకుమారుఁడును మాట లేక యామెపోవుచున్న మార్గమువంకఁ జూచుచు నిల్వఁబడిపోయిరి. ఒక్కతుత్రిటిలో యోగేశ్వరి వారిదృష్టిపథమును దాఁటిపోయెను.

హార—వీరి వెంటఁ బోవలయునా?

యోగా—ప్రయోజనము లేదు.

---

## మూఁడవప్రకరణము.

---

### వార్ష్ణిష్ఠ.

అస్వస్థతగా నున్నయున్నపూర్ణ యిప్పు డారోగ్యముగనె యున్నది. శరీరమునం దించుక బలహీనముగను, గొంచెము రక్తము తక్కువగనుమాత్ర మున్నది. వయోవృద్ధితో నామె యాకారశోభయు వర్ధిల్లు

చున్నది. ఇంకను అన్నపూర్ణ బాలిక — యౌవనప్రాయము రాలేదు. ఇప్పుడే యింతశోభతోను, ఇంతపరిపూర్ణతతోను విరాజిల్లుచున్నది. ఇకనల్పకాలములోనే యీ బాల్యమువదలి యీమె యౌవనమోహమయ రాజ్యమునఁ బ్రవేశింపనున్నది. ఎట్టి యపరూపస్వాభావిక సౌందర్యమీమె నాశ్రయింపఁగలదో యెఱుఁగము.

మధ్యాహ్నకాలమునం దన్నపూర్ణ యొంటరిగాఁ గూరుచుండి శ్రీమద్భాగవతమును జదివికొనుచుండెను. ప్రథమస్కంధములోని చివరభాగమునఁ బరీక్షిన్మహారాజు వేటకేఁగుట, శమీకమహాఋషి మెడలో మృతసర్పము నిడవేయుట, తరువాత ఋషికుమారుఁడైన శృంగికి గోపమువచ్చి పరీక్షిత్తునకు దారుణశాపము నొసఁగుట మొదలగుకథను జదువుచు నాశాపమువలనఁ బరీక్షిత్తున కెట్టి పరిణామము గల్గునోయని యామె భావించుకొనుచుండెను. ఆసందర్భములో ననేకసంగతు లామె యాలోచించుచుండెను. బాలకుఁడైన శృంగియొక్క తేజస్వితయుఁ దండ్రియవమానమును జూచుటచే నాతనికిఁ గల్గినను ప్రజ్వలితక్రోధమును, ఆతనిశక్తియం దాతనికిఁగలసంపూర్ణవిశ్వాసమును నీమొదలగుననేకకథలచే నామె లోలోన నాందోళనపడుచుండెను. ఆపిమ్మట నామె తనలోఁ దా నిట్లనుకొనఁజొచ్చెను. "ఈఋషిబాలకుఁడు ధన్యుఁడు! ఈతని తేజమును, నీతనివాఙ్నిష్ఠయు ధన్యములు." శమీకఋషిపుత్రుఁడు శాపమిచ్చుట యెఱింగి దుఃఖితుఁడై పుత్రుఁడుచేసిన యకార్యమున కెంతయు విరక్తుఁడయ్యెను. కాని, నిజమునకుఁ బరీక్షిన్మహారాజు మిక్కిలియన్యాయమునే చేసెను. అతఁడు, విజ్ఞుఁడును, ప్రవీణుఁడును, ధార్మికశ్రేష్ఠుఁడునైనవయోవృద్ధఋషి యెడల నిట్టిపనిచేయుట మంచిదిగాదు; ఇట్టియన్యాయవ్యవహారమునకు శాస్తిగానిచో న్యాయస్వరూపుఁడైనభగవంతుని బరిపాలనకుఁ గళంకమువచ్చునేమో? శృంగియభిశాపముచే రాజుదుష్కర్మమునకుఁ దగినశిక్ష యైనది. శృంగిని నిమిత్తకారణునిఁజేసి భగవంతుఁడు

రాజున కుచితశిక్ష విధించెను. శృంగి యిట్లు కోపమువహింపకుండిన బాగు
గనేయుండును. కాని, యాతనికోపమన్యాయమైనదనిగాని యసంగతమై
నదనిగాని యనుటకు వీలులేదు. ఈమునిబాలకుని తేజము సార్థకమైనది.
పరిబలపరాక్రమవంతుడైన పరీక్షిన్మహారాజచక్రవర్తి యెక్కడ,—ఆశ్రమపా
లితుడైన దరిద్రమునినందనుడు శృంగి యెక్కడ? అయినను మహారాజు
యొక్క యతిశయబలవిక్రమములవలన నేమియుం గాలేకపోయెను.
బాలకుని నోటిమాటవలన నంతయు జరిగిపోయెను. తనవాక్య మెప్పుడును
విఫలముగాదని బాలకునకు దృఢవిశ్వాసము గలదు. తనక్రోధాగ్నికి లో
నైనచో రాజు స్వకీయములైన యేనుగులు గుఱ్ఱములు, సైన్యము సేనా
పతి అస్త్రములు, శస్త్రములు, మున్నగువానినించుకయైన రక్షించుకొనం
జాలడనియు బాలకుండెఱుంగును. మాటలన్నిటిని దినమంతయు వ్యయ
పఱచుచుండువారిమాటలలో నెన్నిమాటలు ఫలించును? క్రోధముచే
నొక్కొక్కరినే నిరంతరముం దిట్టుచున్నచో వానిలో నెన్నితిట్లు సఫలము
లగును? కాని, శృంగివిశ్వాస మెంతదృఢమైనదో, యాతనివాక్కు గూడ
నంతసఫలమైనది! ఏమిచేసినచో నిట్టివాక్సిద్ధిగల్గునో? మాటలాడుటకు
శక్తి సంపాదించినంతమాత్రమున నది యిట్లు ఫలవంతముకాంజాలదు-అది
మాటాడుసమర్థతమాత్రమే యగును. వాక్య మెప్పుడును సత్యము
నకు భిన్నముగా మిథ్య కాగూడదు. ఇదియే నాకోరిక. కాని, శృంగివలె
గోపభరముచే నెవ్వరికైన ననిష్టము సంభవించునట్లు వాక్యవ్యయము
చేయగూడదు."

ఆమె యిట్లాలోచనచేసికొనుచుండగా నాసమయమున నీలరతన బా
బక్కడకరుదెంచెను అరుదెంచి, "అన్నపూర్ణా! పుస్తకమును జదివి యాలో
చించుచున్నావా? దినమంతయును జదువుట మంచిదిగాదు. ఇంకను
నీకు దేహారోగ్యము సరిగాలేదు. మరలం దలనొప్పి రాంగలదుసుమా?"
అనియెను.

అన్న-— చదువుచున్నమాట నిజమే,కాని, యింకఁ జదువను. బాబా! నేనొకమాటనుగూర్చి యాలోచించుకొనుచున్నాను. మీరు నాకు జా నిని జెప్పుఁడు! ఒక్కమాటయైన మిథ్యగాకుండుటకును, ఆడినమాటలన్ని యు సఫలమగుటకును నేమిచేయవలయును?

నీల-—(నవ్వుచు) ఇది చాలమంచిసంగతియే. ఈకాలమునం దది యొకగొప్పగాఁ జూడఁబడుట లేదు. ఇప్పటిమనుష్యులమాట లన్నియు ని ష్ఫలములే; ఒకమాట యెప్పుడైనను సత్యమైనచో నదిదైవవశమున నని తెలియవలయును.

అన్న—ఎందుచేత బాబా! ఈకాలముయొక్క దోషమేమి? మును పును సూర్యచంద్రులున్నారు; ఇప్పుడును సూర్యచంద్రులుగలరు. ము న్నును దేవబ్రాహ్మణులున్నారు. నేఁడును వారుండిరి. ఇప్పుడిట్లు మను ష్యుల మాటలు శక్తిహీనములగుట యేమి?

నీల—మనుజు లిప్పుడు చాలపాపాత్ములును జాల నధార్మికులునై యున్నారు. ఎవ్వరు జీవితములో నెప్పుడును బాపము సేయరో, పరోప కారమే కాని, యపకారము సేయరో, భ్రమచేతనైనను బరులకుఁ గీడుచిం తింపరో, స్వార్థమనునది భావింపనేభావింపరో, మోసమునకుఁగాని పరిహా సమునకుఁగాని మిథ్యావాక్యము లాడనేయాడరో! సత్యమునకంటె వేఱు లేదని యనుకొందురో, నోటనుండి వెలువడినమాట సత్యమగుననియే భావింతురో, సర్వవిషయములందు నెవ్వరు నిష్ఠావంతులో వారికే వాఙ్ని ష్ఠ లభించును. ఈకాలమునం దట్టిమనుష్యులును లేరు; అట్టివాక్సాఫల్య మును లేదు.

అన్న—బాబా! మీరుచెప్పినవన్నియు నిప్పుడును జేయవచ్చును. దానిలో నొక్కటియు నసాధ్యకార్యము లేదు. కనుక నిప్పుడట్టి వాఙ్నిష్ఠ గలవారు కనఁబడకపోవుట యేమి?

నీల——దైవవశమున నొకరిద్దఱు సంసారత్యాగులైన సాధుమ హాత్ము లిప్పుడును గనఁబడుచున్నారు. వారివాఙ్నిష్ఠయు నద్భుతమైనదే! నీవు చాలబాధపడుచున్నరోజున నెవ్వరు నిన్ను బ్రదికించిరో జ్ఞప్తియం దున్నదా? ఉమాశంకరస్వామి యారోజున నీకు రోగశాంతిగావించి నా బ్రతుకంతయు నిల్పెఁబెట్టెను. నీవు జ్ఞప్తి లేకుండ వికారముగా బాధపడు చుండుటఁజూచి మేమందఱము భయముచేఁ జాలదుఃఖితుల మైనారము. అట్టిసమయమున నుమాశంకరుఁ డరుదెంచి నావలన వృత్తాంతమంతయు విని నిన్ను స్వయముగాఁ జూచెను. తరువాత నాతఁడు మమ్ములనుజూచి "మీరు స్థిమితముగా నుండవలయును. భయవిచారములను విడువవల యును." అని హెచ్చరించెను. ఆతఁడొక యాసనమున నాసీనుఁడై కొం తసేపు ధ్యానమగ్నుఁడై యుండి యాతరువాత లేచెను. తరువాత దోసిలి తో గంగాజలమును బట్టికొని మంత్రపూతము గావించి దానిని నీదేహ మందంతటను గలయఁజల్లెను. వెంటనే యాతఁడు వెడలిపోయెను. వెళ్ళి పోవునప్పు డాతఁడు "రేపటియుదయమునకు అన్నపూర్ణ స్వస్థురాలు కాఁ గలదు. ఇఁక నాపథామ లేమియు నక్కఱలేదు." అనిచెప్పి వెడలిపోయె ను. సరిగా నట్లే జరిగినది. మఱునాఁటియుదయమున నీవు సంపూర్ణారో గ్యముఁబొంది శయ్యనుండిలేచితివి. మేమప్పు డానందముచేత స్వర్గమున జేతఁబట్టుకొన్నాము. ఇట్టివాఙ్నిష్ఠ యిప్పుడు చాలఁదక్కువ.

అన్న——ఈ——ఈసన్న్యాసి.

అన్నపూర్ణ యెఱుఁగును. ఉమాశంకరునిపే రుచ్చరించుటకుఁదన నాలుకసమ్మతింపదని, ఆమె యతనిపేరుచెప్పుటకుఁ బ్రయత్నించిచూచె నుగాని యామెకు శక్తిచాలకపోయెను. ఆమె లోలోనఁ జాలలజ్జించెను. ఆకస్మికముగా నిట్టిమార్పేలఘటిల్లినది ? ఆమె మరలఁజెప్పెను; "ఆస న్న్యాసి వాస్తవముగా మహాపురుషుఁడు" అని,యామె యింకను నేదియో - చెప్పెను గాని యామాట పైకిరాలేదు; ముఖము వంచుకొనియెను.

ఇంత లజ్జపొందుట కపరాధ మేమియు లేదు; అన్యాయ మేమియుఁ జేయలేదు; అయినను నేదుకింతలజ్జ! ఒక్క పే రుచ్చరించుట కే శ్రద్ధాస్పదుఁడైనయొక్క వ్యక్తి పరిసరము వ్యక్తపఱచుటకే, ఇంతసంకోచ మేలఁగులకు? సంకోచముమూలములేనిదైనను, కారణములేనిదైనను, దీనికార్యముమాత్రము నిశ్చితమును, మనోబుద్ధుల మార్పుచేయునదియునై యున్నది. ఒక్కరి నింకొకరు ప్రేమింతురు. దానికొఱకు లజ్జింపవలసినకారణము లేనిమాట నిజము-రాముని సోముఁడు ప్రేమించెను. సోమునకుఁ గాదంబరిమీఁద నిష్టము; కాదంబరి యాదినారాయణుని బ్రేమించెను. ఈవిధముగా నిత్యమును జరిగిపోవుచున్నది. దానిని వ్యక్తపఱచుట కెవ్వరును వెనుతీయరు; లజ్జితులును గారు. కాని, యాప్రేమల నడుమ నిట్టిది యేదేనొక యాకర్షణమున్నచో నది యెవ్వరికిని దెలియకుండుటకును దెలుపకుండుటకును నవసరముకలుగును; అక్కడనే లజ్జయు సంకోచమును గనఁబడుచుండును. ఆంతరిక స్నేహము దృఢపడిన చోటను దృఢపడవలయునని వాంఛించుచోటనుగూడ లజ్జాసంకోచములు గనఁబడుచుండును. ప్రగాఢ స్నేహము లేకపోయినను, అదికావలయునని కోరిక పుట్టినవారిదగ్గఱఁగూడ లజ్జాసంకోచము లగపడుచుండును. ఎన్నఁడు ననుభవించి యెఱుఁగనిదియు సహజమైనదియు నైనయనురాగముయొక్క మాధుర్య మెక్కడలభించుచున్నదో అక్కడ లజ్జాసంకోచము లగపడుచుండును. అన్నపూర్ణా! లజ్జాసంకోచములు నీపై నధికారముచేయుచున్నవి. దాఁచుకొనఁజూచుచున్నను లేకున్నను, ఇఁక వానినెఱుఁగనివా రెవ్వరును లేరు. దేనిని నీవాకస్మికముగాఁ దెలిసికొంటివో, అదియే నీకిప్పుడు సిగ్గుగొల్పుచున్నది, లజ్జను, సంకోచమును నీవు నీహృదయభావములలోఁ గప్పిపుచ్చవలెనని యనుకొనుచున్నావు. కాని, యవియే నీహృదయభావములను బ్రకాశపఱచుచున్నవి.

ఉమాశంకరుఁడుకూడఁ దానిలజ్జాసంకోచముల కధీనుఁడైపోయి నట్లగపడుచున్నాఁడు. సన్న్యాసీ! ఈ యననుభూతమైనయనురాగము

నీహృదయమునం దెట్లుపుట్టినది? నీకు లభించియున్న జీవనమున కిది యనుకూలమైనదగునా? అన్నపూర్ణా! ఎప్పుడు నెఱుంగని యీయనురాగము నీహృదయమునం దెట్లు జనించినది? నీవు భాగ్యశాలిబిడ్డవు. సన్యాసితో సంబంధము నీకెన్నండైన సంఘటిల్లునా? మీయుభయులయనురాగమును గ్రహించుటకు మాకు శక్తి లేదు; కాని, దీనిపర్యవసానమేమగునో చెప్పంజాలము. మేము జరిగినది లిఖించువారము మాత్రమే. ఉన్నదానినింజూచి రానున్నదాని ననుమానించుటకు మాకధికారము లేదు. విశేషముగా మేమేమిచెప్పంగలము? కాని, ప్రస్తుతస్థితిగతులు నీభావిమనోరథములకు విరోధములుగామాత్రమగపడుచున్నవి.

అన్నపూర్ణ యిట్లు సంకోచించుటంజూచి నీలరతనబాబు అనుమానించెనాయేమి? ఆతండు చతురుండు! బుద్ధిమంతుండు. ఈయనుమానమాతని కింతకుముందే కల్గినది. కాని, కన్యకహృదయమునం గలిగిన యీభావావేగమును నిరోధించుట కాతని కిష్టములేదు. ఈయనురాగమును వృద్ధినొందనీయకుండుట యాతనిపని యేమైనను, ఆతం డట్లుచేయుచుండుటలేదు. అంకురమునందే యీమనోవృత్తిని నుసిచివేయుట యాతనికర్తవ్యమేమైనను, అట్లాతం డొనరింపలేదు.

హృదయభావము తెలియ వెల్లడింపంజాలక యన్నపూర్ణ సిగ్గుపడి తలవంచుకొనియెను. నీలరతనబాబు "అమ్మా! నిజముగా నాసన్యాసియుమాశంకరుం డిక్కాలమున మహాపురుషుండే. వాని శిష్యనుబొందంగల సదుపాయ మాతండు చక్కంగా నెఱింగియున్నాండు; అందుచేత నాతని యొద్ద నీవిషయమున ప్రసంగములు చేసినచో నీవనేకసదుపదేశములను బొందంగలవు." అనియెను.

అన్నపూర్ణ మాటాడలేదు. ఆకస్మికముగా నాసమయమునం దె

యుమాశంకరుఁ డొకకాగితపుఁ బొట్లమును జేతఁబట్టుకొని యెక్కడకు వచ్చి దానిని నీలరతనబాబు చేతిలో నుంచి యిట్లనియెను.

"మీతో స్వచ్ఛమైనముక్తాభస్మమును దెచ్చియిచ్చెదనని చెప్పి యున్నాను. దీని నిచ్చినవారిని బట్టి యిది స్వచ్ఛభస్మమనియె చెప్ప వచ్చును."

నీలరతనబాబు దానిని బుచ్చుకొనియెను. ఉమాశంకరుఁ డన్న పూర్ణను జూచి "శరీరములోఁ గ్రమముగా బలముగల్గుచున్నదా" అని యడిగెను.

అన్న—ఆఁ,

నీలర—మేమిప్పుడే మిమ్ముఁగూర్చి మాటాడుకొనుచున్నాము. అన్నపూర్ణ యొకవిషయమునఁగూర్చి నన్నడుగుచున్నది—ఏమిచేసిన నో వాక్సిద్ధి లభించుననియు, నట్లుచేయుటకుఁ దగినవిధానములు తనకుఁ జెప్పవలయుననియును. కాని, యీవిషయములో నంతయు మీయభిప్రాయమే సమాదరణీయమైనది;అందుచే నేను మీసన్నిధినుండి యీ విషయమున నుపదేశము పొందవలయునని చెప్పితిని.

ఉమా—చాలగొప్పసంగతినిగూర్చి మీరు ప్రశ్నించుచున్నారు. నన్నుఁ గఠినవిషయములోనే యభిప్రాయమిమ్మని యాజ్ఞాపించు చున్నారు.

ఉమాశంకరుఁ డొక్కమా రన్నపూర్ణముఖమువంకఁజూచెను. ఆమె సుందరవదనము సంపూర్ణప్రీతితో నాతనిమోమునే చూచుచు నాత్రముతో నాతనిమాటలను వినఁగోరుచున్నట్లుమాశంకరుఁడు గ్రహించెను. ఆతనిచూపు సోకినంతమాత్రముననే యామె మోము లజ్జా సంకుచితభావములుదాల్చి యించుక యవనతమయ్యెను.

ఉమా—సంకల్ప మేదీనికిఁ బ్రధానసాధనమని నానమ్మకము. సంకల్పము కలుగఁగానే మనస్సునకు దృఢత్వముగలుగును; మనోదార్ఢ్యము గల్గినచో నసాధ్యసాధనమైనను సుసాధ్యము కాఁగలదు. ఎప్పుడు నబద్ధ మాడనేకూడదని యెవ్వారు మనస్సులో గట్టిగా సంకల్పించుకొందురో, వారినోటినుండి యెప్పుడును మిథ్యావాక్యము రానేరాదు. కట్టుబాటు లేకుండ, ఆలోచనలేకుండ, ఏగౌరవమును లేకుండ నెవ్వారు మాటలాడుదురో, వారిమాట నిస్సారమును, నిష్ఫలము నైపోవుచున్నది. వాక్యము బ్రహ్మస్వరూపము. వేదము వాఙ్మయము. శాస్త్రము వాఙ్మయము; మంత్రమువాఙ్మయము; స్తోత్రమువాఙ్మయ ము; ప్రపంచము వాక్యసూత్రముచేఁ గ్రుచ్చఁబడియున్నది. నిజముగా నీవాక్యమనునది యత్యంతపవిత్రమైనవస్తువు. ఇట్టివాక్యమును సామాన్యకార్యముగా భావించి నిష్కారణముగా వ్యవహరించుటవలన మానవులకు, ఆధ్యాత్మికోన్నతి గలుగఁజాలదు; అందుచేతనే వాక్ఛక్తిసంపన్నులయ్యును, దమవాగ్యంత్రమును దప్పుదారిని బెట్టుచు మానవులు చిరకాలము పశువులతో సమానులుగాఁ బడియున్నారు. జీవితములో వాక్కును స్వాధీనముచేసికొనుట మిక్కిలి శుభలక్షణమును, బ్రధానసాధనయు నగుచున్నది. మౌనులును, వాఙ్నిరోధముచేసినతపస్వులును త్వరలో జ్ఞానమునందధికారులగుచున్నారు. శిథిలవాక్కుగలవారు చింతాహీనులును, గాంభీర్యవిహీనులు నగుచున్నారు. ఇట్టివా రెప్పుడును మనోబలమునుగాని, యేకాగ్రతనుగాని పొందఁజాలరు. కావునఁ జక్కఁగాఁ బర్యాలోచించినమీఁదటఁగాని వాగ్వ్యయముచేయఁగూడదు. ఎవ్వారు వాగ్యంత్రమును నడపుటలో సంపూర్ణసావకాశము గల్గియుందురో వారికి వాక్సిద్ధి లభింపఁగలదు. నేనీవిషయమై సంక్షేపముగాఁ బ్రధానసాధనములనుగూర్చి మాత్రమే మాటాడినాను. ఇందుకుసహకారులుగా నింకను ననేకోపాయములుగలవు. కాని, యాకస్మికముగా నీసిద్ధినిబొందుట కన్నపూర్ణ కింతటియుత్సాహ మేల కలిగెను?

నీల.—అమ్మా! చెప్పుము; ఆకస్మికముగా నీవిషయమును దెలిసి కోవలెననుకోరిక నీమనస్సులో నేలకలిగెను?

సిగ్గుచే నన్నపూర్ణముఖబింబ మెఱ్ఱవడిపోయెను. ఆమె మోము వంచుకొని యిట్లుత్తరమిచ్చెను. "భాగవతముం జదివికొనుచుండఁగా నాకీ భావము గలిగెను. అంతియే."

అక్కడనుండుట కిఁక నన్నపూర్ణకుఁ జాలఁగష్టమైపోవుచుండెను. లేచి వెడలి పోఁబోవుచుండఁగా, ఉమాశంకరుఁడు మాటాడెను; అతని మాటలు వినవలయుననునాకాంక్షను త్యజింపఁజాలక మరల నామె యావలికిఁ బోలేకపోయెను. కాని, యెంతోసిగ్గు—ఇఁక నచ్చట నిల్వఁ బడఁజాలదు; అన్నపూర్ణ బయలుదేఱెను.

నీల—ఎక్కడకు వెళ్లెదవు తల్లీ!

అన్న—అత్తయ్యదగ్గఱకు.

ఒకటిరెండడుగులు ముందునడచెను. లజ్జచేతను సంకోచముచేతను బాదములు తడఁబడిపోవుచుండెను. ఒక్కమాఱు వెనుదిరిగి యుమాశంకరునిమోము చూడవలయునని కోరి, చూచుట కామెప్రాణము లామెను వేపుకొనితినఁజొచ్చెను అయినను జూచుటకు ధైర్యములేదు. పుస్తకముఁదెచ్చికొని మఱియుఁబోవలయునని కోరిక—రెండుమూఁడడుగులు నడచినతరువాత నాబుద్ధిపుట్టెను. కాని, తిరిగివచ్చి పుస్తకమును దీసికొన సాధ్యమగుటలేదు. ఈయవస్థ సుఖమయమూ, దుఃఖమయమూ? అన్నపూర్ణ యావలికేఁగి త్వరగా నడచిపోయెను

ఒక్కమాఱా దేవీమూర్తిని దేఱిపాఱిఁజూడవలయునని యుమాశంకరునకును గోరికగలదు. ఆమె తనకన్నుల యెదుట నున్నంతసేపును, అట్లుచేయుట కాతఁడు సాహసింపలేకపోయెను. ఎప్పుడాతఁడు సాహసించి కన్నెత్తెనో, అప్పుడా దేవి యాతనికన్నులయెదుటినుండి వెడలిపోయెను. అస్ఫుటమైన యొకదీర్ఘనిశ్వాస మాతనిహృదయమును భేదించుకొని

వచ్చి యీవలఁ బడిపోయెను. ముఖమందల మించుక కాంతిహీన మయ్యెను.

ఆసమయమునందు హరకుమారబాబు బయటినుండి "అన్నా! ఎక్కడ?" అని పిలిచెను.

నీల—అన్నా! ఇక్కడ.

హరకుమారబాబప్పు డక్కడకువచ్చి యిట్లుచెప్పెను. "దేశమునుండి పూర్వపరిచితులైన యాత్మీయులిద్దఱు వచ్చియున్నారు. వారు కాశీవాసము చేయవలయునను కోరికతో వచ్చియున్నారు. వారికొఱకుఁ గొంతవ్యాపకతఁ గల్గియున్నాను. అందుచేతనే నేనిప్పటికడకు రాలేకపోయితిని. అమ్మాయి యెక్కడ? ఆమె యిఁక నేవలంతయులేక సుఖముగా నున్నదిగదా?

నీల—అన్నపూర్ణ యిక్కడనుండి యిప్పుడే వెళ్ళినది. సేమముగనే యున్నది.

హర—బాబాజీ! యోగేశ్వరీదేవిని నీవిప్పుడు దర్శించియుంటివా?

ఉమా—లేదు.

హర—సరియే. నన్నొకటి రెండుసంగతు లడుగవలసినయవసరముకల్గినది. ఇప్పుడే యడుగుచున్నాను—నీకు నీచిన్ననాఁటిసంగతు లేమైన జ్ఞప్తియందున్నవా?

ఉమా—ఎట్టిసంగతులు?

హర—నీపసితనమునాఁటి యెవ్వరిసంగతియైన, ఎవ్వరిపోలికయైన, ఎవ్వరిముఖభావమైన జ్ఞప్తియందున్నదా?

ఉమాశంకరుఁ డాలోచించి యిట్లుచెప్పెను. "ఒకసుందర స్త్రీకాంతరముఖము నాకుమనసులోనున్నది. ఆమె నాకెవ్వరో, ఏమైనదో, ఎందుచే నామె నాకు మరలఁగనఁబడుట లేదో, అనియేవియు నాకుఁదెలియవు.

ఎంతయాలోచించుకొనినను నాకాసంగతులు తెలియుటలేదు. ఇంతకుం టె నీకు నేసంగతియు నాకు జ్ఞప్తిలేదు.

హర—ఎవ్వరిపోలిక నీమనస్సులోనున్నదో, అట్టిముఖముగల వారి నెవ్వరినైన నెప్పుడైనం జూచితివా?

ఉ—లేదు.

హర—ఆముఖమెట్టిదో నీవిప్పుడు చెప్పఁగలవా? ఉమాశంకరుం డించుక సేపాలోచించి "అది నేను సరిగాఁ జెప్పఁజాలను. అయినను దైవ వశముచే నిప్పుడెక్కడనైనం దదనురూపరూపము నాకన్నులంబడినచో నాముఖము, నాకన్నులు జ్ఞప్తికిరావచ్చును." అనియెను.

హరకుమారుండు చాలసేపాలోచించుచు నూరకుండి పిమ్మట "నేను రేపటియుదయమునుండి కొన్నిదినములవఱకు నీదేశమునందుండ న. నీయొద్ద నిప్పుడు సెలవుపుచ్చుకొనుచున్నాను."

ఉమా—గ్రామాంతరమునం దెన్నిదినము లుండుట తటస్థిం చునో?

హర—సరిగాఁజెప్పఁజాలను. ఒకమాసముపట్టునేమో!

నీల—ఎవ్వరో యిద్దఱాత్మీయులు వచ్చినారంటివి. వారికి బస లు మొదలగునవన్నియు సరిగాఁ గుదిరినవా?

హర—ఇప్పుడొకవిధముగా నేర్పాటైనది. వారికది సరిపడని చో నీవించుక శ్రమపుచ్చుకొందువుగాని. సాయంకాలమున వారు నీతో మాటాడుటకు వచ్చెదరు. వారు విశిష్టవ్యక్తులు. సార్వభౌమభట్టాచార్య మహాశయులు. మనదేశములోఁ బ్రధానాధ్యాపకులు—గొప్పపండితు లు. ఆయనతో నాయనకొమారుఁడున్నాఁడు. వారు మనప్రభుకుమారు నిదౌరాత్మ్యముచే నుత్పీడితులై దేశత్యాగముఁజేయవలసినవారైనారు. కొమారుఁడైన నవీనకృష్ణునిసహధర్మిణిని నాపూర్వప్రభువు శ్యామలాలు

హరించుటకుఁ బ్రయత్నించెను. కోడలప్పు డెక్కడకో పాఱిపోయి యాత్మరక్షణ గావించుకొనెనో, యేదుష్టునిచేత నైనఁ బడిపోయెనో యేమయ్యెనో తెలియలేదు. తరువాత శ్యామలా లానిర్దోషులైనతండ్రిబిడ్డల నిరువురను బెట్టరానిబాధలఁబెట్టియుండెను. వారిప్పుడు సంఘత్యాగులై, కళంకితులై, గృహశూన్యులై చిట్టచివరకుఁ గాశీనివాసమునకై వచ్చిపడిరి. వారియాపదలనుగూర్చినవృత్తాంతములన్నియు వారివలననే క్రమముగా వినఁగలవు.

నీల—అట్లయిన వీరు చాలఁగష్టములపాలై భయంకరస్థితిలోఁ బడియున్నారు.

హర—వారికష్టములుపారముముట్టినవి—ప్రస్తుతము మన ముద్దేశించుకున్నవిషయమునుగూర్చి కొన్నికొన్ని సమాచారములు సార్వభౌమభట్టాచార్యులవలనఁ దెలిసికొనగల్గితిని. సమాచారములు మనఁ కనుకూలములుగా లేవు అడ్డంకు లనేకములున్నవి. కాని, నేను నిరాశ చెందలేదు.

ఉమా—నేనిప్పుడు సెలవు పుచ్చుకొందున.

నీల—మంచిది బాబా.

తరువాత నీలరతనబాబు హరకుమారునివంకఁజూచి "అన్నా? నడువుము; నేనుఁగూడ నొకమాఱు గంగాదేవిసన్నిధికి వచ్చెదను." అనియెను.

వారిరువురును వెడలిపోయిరి.

# యోగేశ్వరి

## అష్టమఖండము — హాలాహలము.

### మొదటిప్రకరణము.

**పరివర్తనము.**

శ్యామలాలుబాబుగారి యాసువిశాలమైన కచ్చేరీచావడియొక్క శోభయు సంపదయు నిప్పుడు బొత్తుగాఁ దగ్గిపోయెను. మునుపుండెడిసామాను లిప్పు డేమియు లేవు; ఉన్నంతవఱకు నానావిధములఁ బరివర్తనము నొందియుండెను. ఆసుందరములైనకుర్చీలు, ఆచలువరాతిబల్లలు, ఆవోడి బంగారులచిత్రవిచిత్రపుసామానులు, ఆచిత్రపటములసమూహములు, అన్నియు విఱిగిపోయియు, మాసిపోయియుఁ, జెదరిపోయియు, విరూపమునొందియు, నానావిధములుగాఁ బాడైపోయియుండెను. శ్యామలాలు పరుండెడిశయ్యయు మునుపటివలె లేదు. ఇప్పు డాతనిప్రక్కపై నొక తివాసియు, నొకదిండును, నొకదుప్పటియుమాత్రము నుండెను.

శ్యామలాలుబాబు మధ్యాహ్నము మూఁడుగంటలవేళ నేకాకిగా నచ్చటియాశయ్యయందు పరుండియుండెను. ఆతనియాకారముగూడ దానియిష్టమువచ్చినట్లెల్ల మాఱిపోయెను; ఆతనిశరీరమునకు సౌందర్యసమావేశ మెన్నఁడును లేనేలేదు. అయినను నిశ్చింతయుఁ దనయధేష్టప్రవర్తననుగూర్చినగర్వము నాతనియొద్ద మునుపుండెడివి; ఇప్పుడవియు నాతనియందణుమాత్రమైన లేకుండఁబోయినవి ఇప్పుడు దారుణమైనదుఃఖమాతనిని గట్టిగాఁబట్టుకొనియెను. ఆతనికన్నులు కాంతిహీనములైయుండెను.

ముఖమండల ముద్వేగమయమై యుండెను. లలాటము చింతారేఖలతో నిండియుండెను; శరీర మత్యంతము శుష్కించిపోయియుండెను; చూపులయం దేదియో యుదాసీనతయు, సందిగ్ధభావమును గన్పట్టుచుండెను. ఇప్పుడాకస్మికముగా నాతనిని జూచినచో నాతఁడెవ్వఁడో క్రొత్త మనుష్యుఁడని తోఁపక మానదు. శ్యామలాలునిపార్శ్వమునం దిప్పుడు వెండిబంగారులతోఁ జేయఁబడిన హుక్కాగొట్టములు మొదలగున వేవియు లేవు. ఇప్పుడొక సామాన్యపు మట్టి "గుడగుడి" మాత్రము వాని స్థానమున నధికారము చేయుచుండెను. మునుపటిరోజులలో నిరంతరము నాతనిహుక్కాగొట్టమునుండి వెలువడుచుండెడి సురభిళధూమరాశి యిప్పుడించుకయు నట్లు నిర్గతమగుట లేదు. ఆతఁడు తలఁచుకొనినప్పుడెల్లఁ దంగాకును సుసిద్ధముచేసికొని యాతనిచుట్టును నిరీక్షించుచుండెడి భృత్యగణములో నొక్కఁడైనను నేఁడాతనియొద్దఁ గావలయు ననినను గన్పడుట లేదు. శ్యామలాలు తనహుక్కాగొట్టమును దడవిచూచుకొనియెను. అది చల్లఁగా నగపడియెను. ఆతఁడప్పుడు "రామా రామా!" యని కేక వేసి పిలిచెను. ఎవ్వరును బలుకలేదు. ఎవరు వచ్చుటకి రాను లేదు. శ్యామలాలు కంఠమునకొక భయంకరమైన మార్పు కలిగినది. అత్యుచ్చముగను, సతేజముగను గర్దభస్వరమును వెలిపుచ్చెడి యాతనికంఠమునుండి యిప్పుడు హీనభీతకాతరధ్వనియొకటి వెలువడియెను. రాముఁడు రాలేదు. ఎవ్వరుఁ బ్రత్యుత్తర మీయను లేదు. ఎవ్వనియాజ్ఞయైనంతమాత్రముననే యనేకులు కాకులవలెవచ్చి పడుటయు, నసాధ్యకార్యములైన నవలీలగా నగుచుండుటయు జరిగెడిదో, యట్టివానికిప్పుడు తాంబూలమందించుటకొక్క మనుష్యుఁడైనను, గొంతుచించుకొనినను ముందటికి రాలేదు.

ఎవ్వరును రాకుండుటఁజూచి శ్యామలాలు చల్లారిపోయిన యా హుక్కానే రెండుమూడుమారులు పీల్చెను. ఆపిరువాత నించుక సే

పాలోచించి యాతఁడు మరల "రామా!" అనిపిలిచెను. ఈమాఱుఁగూడ సమాధానమురాలేదు. శ్యామలాలించుక సేపు వేచియుండెను. తరువాత నాతఁడు మంచమునుదిగి బయలుదేఱి మెల్లమెల్లఁగా గుమ్మముదగ్గఱకు వచ్చెను. శ్యామలాలున కెట్టిభయానకమగు మార్పుగల్గెను! ఆతని కిప్పు డాస్థూలకళేబరము లేదు. నడుము వంగిపోయిన వృద్ధునికివలె నిప్పు డాతని కూర్ధ్వకాయము ముందఱికి వంగిపోయెను. గుమ్మము సమీపించి శ్యామలాలు మరల "రామా! రామా!" అని పిలిచెను.

ఈమాఱు రాముఁడు "ఏమికావలెను?" అని యడిగెను.

శ్యామలాలునకు మనస్సులోఁ జాలకోపము వచ్చెను. కాని, యాతఁడాకోపమును జల్లార్చుకొని "కొంచెము తంబాకుఁ గావలెను?" అని పలికెను.

రాముఁడు మరలమాటాడలేదు. శ్యామలాలు తిరిగివచ్చి యెప్పటియట్ల మంచముపైఁ బండుకొనియెను. ఆతనిమనస్సులో ననేకచింతలుత్పన్నములయ్యెను. ఆతఁడుతనయవస్థ యిట్లుమాఱుటనుగూర్చి యెన్నియో యాలోచించుకొనియెను. ఆతఁడు నేఁడు తనపత్నిని జూడవలయుననియు, నామెకడఁ బ్రస్తుతస్థితియంతయుఁ దెలియపఱిచి యాదులకుఁ బ్రతీకారమైన యుపాయమును జూడవలయుననియు లోలోన స్థిరపఱుచుకొనియెను.

ఒక నెలదినములై శ్యామలాలు తనసంపత్తియంతయుఁ దనభార్య పేరిట వ్రాసియిచ్చెను. ఈస్వల్పకాలములోనే యాతఁడనేకకష్టములకు లోనయ్యెను. జీవనమునం దేస్త్రీకాతఁడొకప్పుడైనను దనముఖదర్శనమైనను దయచేసియెఱుంగఁడో, యాస్త్రీసన్నిధి కేఁగి రెండురోజులకిందట నాతఁడు తనదుఃఖవృత్తాంతమును నివేదించుకొనియెను. కాని, ఫలమించుకయుఁ గలుగలేదు. మొట్టమొదట నాతఁడు హరిచరణుని సర్వనాశనమొనరింప నెంచుకొనియెను. కాని, యాపని యతనికించుకయు

సాధ్యమైనది గాదయ్యెను. ఆతనియుద్దేశ్యముఁ దెలిసికొని హరిచరణు డింక నాతనియొద్దకుఁ బోవుట మానివేసెను. ద్వారపాలకులు, భృత్యులు, భృత్యురాండ్రు, గుఱ్ఱపువాండ్రు నెవ్వరు నాతనిమాటను వినుట మానివేసిరి. అన్యగతిలేక యిప్పు డాతఁ డనేకప్రయత్నములుచేసి హరిచరణునిదర్శనలాభమును సంపాదించెను. దర్శనమిచ్చి హరిచరణుఁ డాతనితో నిట్లనియెను. "నీవు నాతో నిప్పుడు వివాదపడుటవలన నాకునష్టమేమియు లేదు. నేను నీమేలుకొఱకే దానపత్రమును వ్రాయించియుంటిని. నీవుదాని మేలు గ్రహింపకున్నచో నేనునిరాధారుఁడను. రాణి నావద్దనుండి కాగితములనుదీసికొని నన్నిప్పుడు పొమ్మనినచో నేన గిమ్మనక పోవలయునుగదా.

వాని నిప్పు డేమనినను బ్రయోజనము లేదని శ్యామలాలు గ్రహించెను. ఆతనివలన నింక నేమైనను గాకున్నను సరేయనుకొని, యత్యంతకాతరచిత్తముతో శ్యామలాలాతనిని సాయంకాలమున కొకసీసాబ్రాందికిఁ జాలినసొమ్మియవలెనని యాచించెను. దానికి హరిచరణుఁ డిట్లుత్తర మిచ్చెను" రాణిగారియిష్టమునకు వ్యతిరేకముగా నాకేకార్యముఁ జేయుటకును సామర్థ్యము లేదు. ఒకపైస వ్యయపఱచుటకైన నధికారము లేదు.ఏపనినిగూర్చియైన నా మె సన్నిధిని విన్నవించుకొని గాని యామె యనుజ్ఞయగువఱకును నాసింపవలదు." అని.

శ్యామలాలు తరువాతి జరుగఁగల సంగతులఁ దలఁచుకొని లోలోన నాందోళన పడఁ జొచ్చెను. ఆతఁడింకొకమాఱు రాణినిజూడవలయుననియు, నాతరువాత నెక్కడకో యొక్కెడకు నెట్లో వెళ్ళ పోవలయుననియు స్థిరపఱచుకొనియెను.

ఇప్పుడొక సుఖలేశమైనను శ్యామలాలునికిఁ దరిచేరుట లేదు. అత్యంతక్షాంతిబుద్ధితో శ్యామలాలుని దానపత్రము వ్రాయుట కెవ్వరు

పురికొల్పిరో, వారొక్కరైన నిప్పుడు కనంబడుటలేదు. ఎవ్వరెవ్వరు నూతననారీగణము ననుసంధానముచేసి, సర్వనాశమొనరించి, యాతని యనుగ్రహమును సంపాదించుకొనుచుండిరో, వారొక్కరైన నిప్పుడు చూడవచ్చుటలేదు. శ్యామలాలునియవస్థ యిట్లుమార్పుచెందుటచే దేశవాసులకుం గొంతనిశ్చింత యేర్పడినది; కులబాలికలకుం గొంతధైర్యము లభించినది.

శ్యామలాలు తనభార్యను వర్జించెను; విధుముఖి సుందరియని యాతనికి బోధపడియెను. తానేయేస్త్రీలనుజూచి యున్మత్తుండయ్యెనో వారందఱికంటె విధుముఖి దివ్యసుందరియని యాతం డనుకొనియెను. భార్యతో మాటలాడవలయుననియుం బరిచయమును స్నేహమును వృద్ధిం బొందించుకొనవలయుననియు నాతనికి బలీయమైన కోరిక గలిగెను. కాని, యేమియు లాభము లేకపోయెను. విధుముఖి యాతండు తన దగ్గఱకువచ్చుటకే సెలవియలేదు; దూరమునుండి భృత్యురాండ్రచేతనే యొకటి రెండుకబుర్లు చెప్పించి పంపివేయుచుండెను.

రాముండు చాలసేపటికొక చిన్న గుడగుడి, లోం గొంచెము తంబాకు వేసి తెచ్చెను. శ్యామలాలు మూండునాలుగుమాఱులు దానిని బీల్చి లేచి మెల్లమెల్లంగా నంతఃపురము వంకకు నడువంజొచ్చెను.

అంతఃపురద్వారములయొద్ద భోజపుర ద్వారపాలకులుండిరి. వారు శ్యామలాలునిజూచి లేచి నిలువంబడిరి. కాని, గౌరవమర్యాద లేమియుం జేయలేదు. హతభాగ్యుండైన శ్యామలాలు వారిని లక్ష్యముచేయక ద్వారమునుదాంటి లోనికింబోవుటకుం బ్రయత్నించెను; వారప్పుడు నిరోధించి "బాబూ! ఎక్కడికి వెళ్లంగోరెదరు?" అనిరి.

శ్యామ—అంతఃపురమునకు.

పహారా—ఆజ్ఞలేదు.

శ్యామ—నాయంతఃపురములోనికి నేనుపోవుట కెవ్వరడ్డుపెట్టఁ గలరు ? ఇట్టియాజ్ఞ యెవ్వరొసఁగిరి ?

పహరా—దివాన్‌జీవారు.

శ్యామ—ఇతరులకొఱ కట్టియాజ్ఞచేసియుండెను; నాకొఱ కట్టియాజ్ఞ నాతఁ డెప్పుడును జేయఁడు.

పహరా—ప్రత్యేకముగాఁ దమకొఱకే.

శ్యామ—నాకొఱకే ?

పహరా—చిత్తము.

దుర్బలుఁడును, హీనప్రకృతియు, దుశ్చరిత్రుఁడు నైన శ్యామలాలు సాహసించి యింక నేమాటయు నాడలేకపోయెను. ఆహా ! ఏమి దౌర్భాగ్యము !

ఆకస్మికముగా నాసమయమునకు శారద, యను దాసి యక్కడకువచ్చెను. అది రాణియొద్దనుండి సమాచారములను గొనిపోయి హరిచరణున కందించుచుండును. హరిచరణునకు రాణియొద్దనుండి సమాచారములను గొంపోయిమరల నాతనియొద్దనుండి వృత్తాంతముల నిప్పుడు రాణియొద్దకుఁ దీసికొనివచ్చెను. దానిపని చిరకాలమునుండి యిదియే. కాని, యిప్పుడు దాని కా యుద్యోగమునందు ఘనతరముగాఁ బనిగలిగెను. దానియధికారముగూడ నల్లో సర్వత్ర నియమరహితముగా వర్ధిల్లిపోవుచుండెను. అది సర్వేశ్వరియైనరాణికిఁ గుడిభుజము; ఆమెపను లన్నియు శారద రహస్యాలోచనముపై నాధారపడియుండును. ఈపెద్ద సంసారమున కొక కీలియజమానియై యున్న హరిచరణబాబును శారదతో నాత్మీయులతోఁబోలె సంభాషణాదులను జరుపుచు దానినిఁ దుష్టిఁ బొందించుచుండెను. ఆతనికి దానియందలి యాత్మీయత మిక్కుటమైపోయినదనియు ననేకు లనుకొనుచుండిరి. అందుచే నిప్పుడు శారద కభిమా

నను నహంకారము మిన్నుముట్టుచున్నది. దాని యభిమానాహంకారములతో దాని స్వతంత్ర ప్రవర్తనయు వర్ధిల్లుచుండెను. అది నీచురాలైనను పైకున్నతురాలననియే తిరుగుచున్నది. అది యిప్పుడు సామాన్యపు దాసదాసీజనులతో మాటాడుట తనకుఁ జిన్నతనముగా నెంచుచుండుటచే వారితో మాటాడుటయు మానివేసినది. సాహసముచేసి దాసదాసీజను లెవ్వరైన దానితో మాటాడఁబోయినను, అదిమాత్ర మానీచకార్యమున కొప్పుకొనదు. తమపనులలో నేవేని చిక్కులు తటస్థించినపుడు దాసదాసీజనులందఱుఁ దన్నివారణార్థము దానికి శరణాగతు లగుచుండురు; కాని, వారు దానితో నతిజాగ్రతగా మాటాడుచు, నతిభయముతోను-సందేహముతోను దానికరుణను బెంపొందించుకొనఁజూచుచుందురు.

శారదను జూడఁగానే భోజపుర ద్వారపాలకులు తొట్రుపాటుతో దానికి సలాముచేసి, శ్యామలాలు బాబునకు, "శారదకు దారివిడిచి యించుక దూరముగాఁ దొలఁగు"మని సంజ్ఞచేసిరి. గర్వితయు విలాసవతియు నైన శారద తూలిపడి, పేలిపడి నడచుచు శ్యామలాలును సమీపించి వానితో "వచ్చితిరా బాబూ! ఎందులకు? ఇక్కడ కెందులకు?" అనియెను.

శ్యామ—శారదా! ఒకమాఱు రాణితో స్వయముగా మాటాడవలసిన యవసరము వచ్చినది. ఈనిర్భాగ్యులైన ద్వారపాలకులు నన్ను లోనికిఁ బోనిచ్చుటలేదు. చూచుచూచువీరిదుర్నయము!

శారద యించుక వక్రహాసముచేయుచు "అయితే బాబూ! దేవి యనుజ్ఞలేనిదే యెవరేమిచేయఁగలరు?

శ్యామ—నాయంతఃపురము; నాసంగతి; నాభార్య; నాహక్కు నేననుభవించుట కొకరియాజ్ఞ యెందులకు?

శారద — (ఈమాటలు మోమున గంభీరతఁదాల్చి) బాబూ! జన్మములో నెప్పుడు నెవ్వరిముఖము చూడనైతివో, వారియొద్దకు గబగబ పరుగెత్తుటకు నీకిప్పు డవసరము వచ్చినది. కాని, యామె యీనీశుష్క-ప్రేమను మన్నించుట లేదు; కావున, నీవిప్పుడు-కావలసినప్పుడు వచ్చుచుఁ బోవుచుండుట సొగసైనపనిగాదు. దేవియాజ్ఞ లేనిది ద్వారపాలకులు లోనికిఁ బోనిత్తురా?

శ్యామలాలు దీర్ఘనిశ్వాసమును విడిచి "అయ్యో, దైవమా! దానపత్రము వ్రాసియిచ్చి నాకాళ్లకు, నేనే సంకెలలు వేసికొంటిని. ఈయైశ్వర్యమంతయు నాదిగదా! నాకృపవలననే తానంతకు సర్వేశ్వరి నైతినని రాణి తెలిసికొనవలసియున్నది." అనియెను.

శార — రాణి యట్లనుకొనుటలేదు. ఆమె తనయదృష్టముచే తనే యీయైశ్వర్యము లభించినదనియు, నందువల్లనే యీబుద్ధి తనకుఁ గల్గినదనియు భావించుచున్నది. అందుచే నీకడఁ గృతజ్ఞత చూపవలసిన యవసర మామెకు లేదనియె యామె యుద్దేశ్యము. హరిచరణబాబు ప్రయత్నమువల్ల నీకార్యమంతయు ఘటిల్లుటచే నాతనియెడల నామె సంపూర్ణకృతజ్ఞురాలు. హరిచరణబాబు రేయింబవళ్లు విడువక యంతఃపురమునకు వచ్చుచుఁబోవుచున్నాఁడు. అందుల కభ్యంతరమేమియు లేదు; ఎవ్వరియాజ్ఞవల్లను నేప్రయోజనమును లేదు.

శ్యామలాలు మరల దీర్ఘనిశ్వాసమును విడిచి "హరిచరణునకున్నపాటియధికారమును లేదా నాకు నాయింట?" అనియెను.

వెంటనే శారద "లేనేలేదు బాబూ! హరిచరణబాబు రాణిగారికిఁ బ్రాణబంధుఁడు బాబూ" అనెను.

శ్యామలాలాశ్చర్యముతో "ప్రాణబంధువు-హరిచరణు-ఎప్పటికిప్పుడు వచ్చుచుఁబోవుచుండుట—ఇదియంతయు నేమి శారదా?" అనియెను.

శార — అంతియు నేమైననేమి; దానివలనఁ దమ కేఁక లాభము గాని నష్టముగాని లేదు. తా మెప్పుడును దేవిని ప్రేమించియుండ లేదు. ముఖసందర్శనమైన నోసఁగియుండ లేదు. ఆమె కేఁక నెవ్వారుబంధువులైన నేమి ? ఏమైననేమి ? ఆసంగతి మీ కెందులకు ?

శ్యామలాలు సమస్తవృత్తాంతమును వినియెను; తెలిసికొనియెను; సంగ్రహించుకొనియెను. ఆతఁడు దుఃఖితుఁడయ్యెను; అధోవదనుఁడై చాల సేపు విచారింపఁజొచ్చెను.

శార — అమ్మగారిని దర్శించుట మీ కంతటియగత్యమైన-చో మీరిప్పటికిఁ దిరిగి వెళ్ళుఁడు. నేనామెతో సమయానుకూలముగా సంగతి యంతయు విన్నవించి మరల మీదగ్గఱకు వార్త తెచ్చెదను.

శ్యామ — అయిన నిప్పుడు చూచుటకు వలనుపడదా యేమి ? ఇప్పు డామెనుజూడఁబోయినఁ దప్పేమి?

శార — తప్పేమియు లేదు-ఒకగంటలోపుగా హరిచణబాబు రానైయున్నాఁడు. నిజముగా మీరిప్పు డెట్లున నక్కడకుఁ బోఁజాలరు.

శ్యామ — ఎందులకుఁబోఁజాలను ? హరిచరణుఁడు వచ్చిన రానిమ్ము; ఆతఁడు నా యెదుటికే వచ్చును. ఆతఁ డామె నడుగవలసినసంగతులున్న నా యెదుటనే యడుగవచ్చును. హరిచరణుఁడు వచ్చునని భయమేల ? ఆతఁడు భృత్యుఁడు-నేనుప్రభువును. వానికొఱకుఁ బ్రభువునైననే నంతఃపురమునుండి తిరిగిపోవుదునా ?

శార — హరిచరణబాబు మీరుండగా రాఁజాలఁడు. ఆతనికి మాటాడుట కనేకవిధములగు సంగతు లుండును ; ఎవ్వరి యెదుటను నాతఁ డామెతో మాటలాడఁడు. ఆతఁడు భృత్యుఁడైన మాట నిజమే. కాని, రాణి యాతనిని బ్రాణప్రభువుగా భావించుచున్నది. నిజ

ముగా మీరిప్పుడు తిరిగి వెళ్ళిపోవుటకంటె వేఱుపాయము లేదు. మీరిప్పటికి వెడలిపోవుఁడు. నేను మఱియొకప్పుడామెను దర్శించుట కవకాశము దెలియఁజేసెదను.

శారద యక్కడనుండి వెడలిపోయెను. ఆకాపురుషుఁడు-ఆనరాధముఁడు-ఆశ్యామలాలు తలవంచికొని యన్నిసంగతులు నాకర్ణించెను. ఆతఁడెప్పటికిని మనుష్యుఁడుగాఁడు. నిజముగా మనుష్యోచితములైనభావములేవియు నాతనిహృదయమున నుదయింపఁజాలకపోయెను. కొంచెముసే పచ్చటే నిలుచుండి తరువాత మెల్లమెల్లఁగా నాతఁ డక్కడనుండి వెడలిపోయెను.

## రెండవప్రకరణము.

### కాపురుషుఁడు.

నిస్సహాయుఁడును, నిరుపాయుఁడు నైనశ్యామలాలు మెల్లమెల్లఁగా నధోముఖుఁడై కచేరీచావడిలోనికిఁ దిరిగివచ్చునప్పు డించుకసేపు బయట నిల్వఁబడియెను; ఆతఁడక్కడ గుమాస్తావాఁడైన "జరీఫ్" నుజూచి యాతనిని దగ్గఱకురమ్మని సంజ్ఞచేసెను. గుమాస్తాసాహేబప్పుడు తనపంచగడ్డమును జేతితో సవరించుకొనుచుండెను; మఱియు నాతఁ డొకచేతనద్దమును రెండవచేతఁ జిన్నపాటిదువ్వెనను బట్టుకొని గడ్డమును దువ్వుకొనుచుండెను. శ్యామలాలు పిలుచుటఁజూచియు జరీఫ్, తనచేతిలోనిపనిని వదలి లేచిరాలేదు. శ్యామలాలు చాలసేపచ్చట నాతనికొఱకెదురుచూచుచు నిల్వఁబడి మరల నొకమాఱాతనినిఁ గేకవేసెను. ఈమాఱు గుమాస్తాసాహేబు తనచేతిలోనియద్దమును దువ్వెనను నక్కడ విడిచిపెట్టి శ్యామలాలుదగ్గఱకువచ్చి "బాబూ, ఏమిసెలవు ?" అనియెను.

శ్యామ—జరీఫ్! నీవొకగుఱ్ఱపుబండిని దీసికొనివెళ్ళి ఠాణాధికారి యుమేశబాబును నేను రమ్మంటినని చెప్పి తీసికొనిరావలయును.

జరీఫ్—(తలయూచుచు) అది నావల్లఁగాదు బాబూ, దివాన్‌జీ బాబు సెలవులేకుండ గుఱ్ఱమును బండ్లను ముట్టుకొనరాదు బాబూ!

శ్యాము—సరే! అయిన నే నన్నియువిడిచి యెక్కడకో పోవలయునా?

జరీఫ్.—దివాన్‌జీబాబుగారి యాజ్ఞలేకుండఁ దమకుఁగూడ బండి కట్టుటకు నాకు ధైర్యముచాలదు బాబూ!

శ్యామలాలు దీర్ఘనిశ్వాసమును విడిచెను. చాలసేపాలోచించి "జరీఫ్! నీవు నాకుఁ జిరకాలభృత్యుఁడవు! నేనిప్పుడు గొప్పవిపత్తులోఁ బడియున్నాను. నాప్రాణమనుష్యులందఱిలో నిప్పుడు నీవొక్కడవే మిగిలియున్నావు. ఈయాపత్కాలమునందు నీవైన నాకించుకసాయము చేయకున్నచో నేనిఁకఁ బ్రాణములను సులభముగా విడిచివేయ వచ్చును" అనియెను.

జరీఫ్‌గూడ నించుకసేపాలోచించి యిట్లనియెను. "బాబూ! నేనీకుటుంబమునకుఁ జిరకాలమునుండి నౌకరిచేయుచున్నాను. యజమాని బాబుకాలమునుండియు నేనీకుటుంబములో సేవచేయుచున్నాను. మీరప్పుడు చంటిబిడ్డలు. మీపసితనములో మిమ్మెత్తి మోసి పెంచితినిగాదు బాబూ? గుఱ్ఱమెక్కుట, బండిపట్టినపుడు మీకు నేర్పితినిగదా! బాబూ! నేఁటి మీకష్టకాలమంతయుఁ జూచుటకు నాకును దుఃఖముగానేయున్నది. ఏమిచేయుదును బాబూ! అంతయు నసీబుఫలము"

ఒకమాసములోనే శ్యామలాలు, తన పెద్దపట్టనములో నొక్క దినమైన నొక్కరిసానుభూతినైనఁ బొందఁజాలనిమస్థితికిఁ బాలయ్యెను. నేఁడీముసలి "కోచిమాన్" నోటినుండి యీమాత్రపుసానుభూతివా

క్యములువినుటచే నాతనిచిత్తము సంతోషమున తొంతిగలిగెను. అప్పుడా తఁడు "జరిఫ్! నాయదృష్టము చిరకాలము చక్కఁగా నున్నట్టులేయుండి యాకస్మికముగా నిట్లైనదేమి?" అని యడిగెను.

జరిఫ్——మీయదృష్టమంతయు మంచిదే. కొందఱు చచ్చి స్వర్గమునందుండుటచే నిదియంతయు మీచేతఁబడినది. దానికిఁ జాలగాథ కలదు. మీరు దానినించుకయు నెఱుఁగరు. తెలిసికొనుట కిప్పుడేమి యగత్యమున్నట్లు గనఁబడదు. ఒక్కరుమాత్రమీసంగతియంతయు నెఱుంగుదురు——మీపాత్రిదివానుజీ హారకుమారబాబుగారు. ఆయనను మీరు చాలనిందించి వెడలఁగొట్టితిరి. మఱియు నెఱిఁగియున్నవాఁడను నేను. నేనిప్పటికిని బ్రదికియున్నాను. ఏమైననేమి? మీ యదృష్టము వంటి యదృష్టమెవ్వరికి నీప్రపంచములో లభింపదు. కాని, మీరు చాల పాపాత్ములు. ఇందులకు దేవుఁడొక్కఁడే విచారణకర్త. ఇంతపాపము చేసినవాని కెప్పుడైన మేలుగలుగునా?

శ్యామలా లిట్టిమాట లెప్పుడును విని యెఱుఁగఁడు. ఒకనాఁడు హారకుమారబా బాతనికి మెల్లమెల్లఁగా, నత్యంతమృదుభావముతో నాతని పాపవృత్తాంతము నాతని కెఱిఁగింపఁ బ్రయత్నించెను. ఆమాటలను జెవులఁబెట్టక శ్యామలా లత్యంతకోపముతో నాతని నుద్యోగము నుండి తొలఁగించెను; అదిమొదలుకొని యట్టియవ్యాజహితుం డాతని కిఁక దొరకలేదు. మరల నేఁడట్టిమాట జరిఫ్ కోచిమాన శ్యామలాలు నెదుట మాటాడఁగల్గెను. అట్టిమాటలు వినుట కప్పుడు హారకుమారబాబుపై మిక్కిలికోపమువచ్చెనుగాని, యిప్పుడు జరిఫ్ మాటలువినుటచే నత్యంతచింత యుదయించెను.

శ్యామ——నేనంత జాలపాపాత్ముఁడనా? నేననేకపాపములు చేసితినా జరిఫ్? అవును నిజమే; చేసితిని. కాని, ఆపాపములవలననే నాకిట్టి యవస్థ తటస్థించినదని నీకుఁ దోఁచుచున్నదా?

జరీఫ్—అది యబద్ధముగాదు. ఇది నీపాపఫలమే; ఇంతకంటె నెక్కువదుఃఖ మెవ్వరు ననుభవింపరు. నీకొఱకే నేనిట్లు చెప్పుచున్నాను. లోకమంతయు నెఱుఁగును; నీవును గొంత యెఱుఁగుదువు. ఈసంగతులు నీకిట్లు తెలియఁజేయుట దోషముకాదు. నీవు పరమధార్మికుఁడైన హరకుమారబాబును దరిమివేసి నీచపిశాచియగు నీహరిచరణునిపైఁ గార్యభారము పెట్టితివి. ఆయల్పుఁడు నీకుఁగల కార్యభారములన్నియుఁ దానేగైకొనియెను. నీవు పెండ్లియాడియు భార్యకొకనాఁడైన మోమును జూపవైతివి; ఆమెతో ముచ్చటకైన మాటాడవైతివి. నీప్రియమైన హరిచరణుఁడు నీభార్యనపహరించెను. నీవెందఱుసతీమణులనో ధర్మభ్రష్టలఁగావించితివి. ఆపాపఫలముగా నీగృహలక్ష్మి విభ్రష్టయైపోయినది. నీవావల నొనరించిన లెక్కలేని పాపకృత్యములన్నియు నేఁడు నీగృహమున జరుగుచున్నవి.

శ్యామలాలు "అయ్యో" యని జరీఫ్ ముఖమువంకఁ జూచుచు, నాతనిమాటలన్నియు నాలకించుచు నక్కడఁ జదికిలఁబడి "జరీఫ్! తెలిసినది. నాకు సర్వనాశమైనది" అనియెను.

జరీఫ్—నీకుఁ గావలసినంత సర్వనాశమైనది. ఇప్పుడు నీవారితో హరిచరణుఁ డేకమైనాఁడు; వారిదొక్కటే ప్రాణము. వారు నిన్ను మోసగించి యంతయు వ్రాయించుకొని నీకొకకట్టుగుడ్డకూడ లేకుండఁ జేసినారు.

విధుముఖీహరిచరణులనుగూర్చినసంగతులనేకులచే ననేకపర్యాయములు శ్యామలాలు వినియున్నాఁడు. ఆవిషయములో నాతని కేమియు సందేహములేదు; కాని యానరాధముఁడు దానిని మనస్సునకుఁ దెచ్చుకొననేలేదు; చూచియుఁ జూడలేదు; అందులకుఁ బ్రతీకార మాలోచింపనేలేదు. అందుచే నేఁడు సంగతులన్నియు వినినను వానిహృదయ

మునకింతగా దుఃఖము కలుగలేదు. కాని, తనదిక్కుమాలినస్థితి నాలోచించుకొని మాత్రమాతఁడు మనస్సులోఁ జాలదుఃఖించుచు "సరే, జరిగిపోయినదానికిఁ జేయవలసిన దేమియులేదు. కాని, నాయైశ్వర్యము మరల నాచేఁజిక్కుట కుపాయ మేమైనఁ గలదా?" అని యడిగెను.

జరిఫ్—ఇఁక నీయాస్తి నీకు మరలఁ జేరుట కేయుపాయము నగపడుటలేదు. నీభార్య మృతురాలుగాకుండ, నీయాస్తి నీకు మరలఁ జేఁజిక్కదు. ఆమె గతించినచో నీవు మరల హక్కుదారుఁడవై యైశ్వర్యమనుభవింపఁగలవు.

శ్యామ—ఆమె యారోగ్యముగా, బలముగా, సుఖముగానున్నది. ఆమె యింతట మరణించునట్లులేదు.

జరిఫ్—మేమేమైనచో యముని కెదురుచూచెదమా? స్వయముగానే యమస్వరూపులమై మేమే యమునిపనిఁ జేసివేయమా?

శ్యామ—(ఇంచుకాలోచించి) ఏయుపాయమున లేదు; అంతఃపురములోని కెవ్వరున్నఁ బోఁజాలరు. అట్లు కార్యము నెఱవేర్చుటెట్లు? అదిగాక నాచేతిలో నొక్కమనుష్యుఁడును లేఁడు. నాయాజ్ఞవినువారును లేరు. చేతిలో డబ్బులేదు. ఇఁక నేనేమిచేయఁగలను?

జరిఫ్—(ఇంచుక విరక్తిభావముతో) చేసినచో నాతియు నీవే చేయవలయును. కాని, నీవసమర్థుఁడవు—నీవేమియుఁ జేయఁజాలవు. నీవు తినితిరుగుటకుఁ గాక మఱియెందులకును బనికిరావు. అట్లుకానిచో నీవు, నీభార్య నిన్ను బికారినిజేసివచ్చి యింటఁజేయుచున్నదుష్కార్యములన్నియు వినుచుఁ జూచుచుఁ దెలిసికొనుచు సహించుకొనుచుండుటేకాని దానికిఁదగిన ప్రతీకారముఁ జేయఁజాలవా? ఛీ! ఏమియుఁ జేతఁగానిచో నెచ్చటికైనను బాఱిపోరాదా? చావరాదా? అది యింతకంటె సులభమే!

జరీఫ్ వెడలిపోయెను. శ్యామలాలేమిచెప్పునో వినుటకాతఁడెదురుచూడలేదు; ఎంతటితీవ్రతరస్వాంతము! ఇట్టివిస్పష్టప్రసంగము, ఇట్టిధారాళోపదేశము, శ్యామలాలుజీవితమునందు మఱియొకప్పుడెప్పుడును వినియుండలేదు. అతని కెవ్వరు నెప్పుడు నేహితవాక్యమును జెప్పుటకు సాహసించియుండలేదు; ఒకఁడు సాహసించి యించుక యుపదేశించుటకుపక్రమించియు శ్యామలాలుని విరక్తిచే విముఖుఁడయ్యెను; శ్యామలాలు తనపనికిఁ దగినశిక్షఁ దాననుభవించుచునుండెను. నేఁడొకగుజ్జపువాఁడు—ఒకసామాన్యభృత్యుఁడాతని కుచితోపదేశముఁ జేయవలసివచ్చెను. దుఃఖము, దురవస్థ, ఆపదయు ననుభవించుచుండుటచే శ్యామలాలునిప్రకృతి చాలవఱ కిప్పుడు మార్పుచెందెను. వెనుకటిశ్యామలాలునకును, ఇప్పటిశ్యామలాలునకును గొంతపరిచ్ఛేదమేర్పడియెను. అతఁడిప్పుడు జరీఫ్ చెప్పినమాటలన్నియు విని వాని యాథార్థ్యమును గ్రహింపఁగలిగెను.

మెల్లమెల్లఁగా నాలోచించుకొనుచు నాలోచించుకొనుచు శ్యామలాలు కచ్చేరిచావడిదగ్గఱకు వచ్చెను; జరీఫ్ చెప్పినసంగతులను గూర్చి లోలోనఁ జింతించుకొనఁజొచ్చెను. "విధుముఖిని, హరిచరణుని, ఇద్దఱను గడతేర్చునుపాయము చూడవలయునా? వారువ్యభిచారనిరతులు. అయిన నష్టమేమున్నది? అందుచే శ్యామలాలునకు వారిని గడతేర్పవలసినయగత్యమేమియు లేదు. విధుముఖి మరణింపకున్నచో నాతనియాస్తి మరల నాతనిచేతిలోనికిరాదు. ఇది నిజమైనమాటయే; ఇందుకొఱకామెను గడతేర్చుపని యుచితమైనదే. దాని కుపాయమేది? స్వయముగాఁ జేయుటయెట్లు? ఎవ్వరికైనఁ జెప్పుటయెట్లు? మఱినాల్గుదినములోర్చుకొన్నచో విధుముఖికిఁ దనపై దయరాఁగూడదా? దయగలిగి తన్నామెగౌరవించి యించుకదరిఁజేర్పఁగూడదా? ఏమైననుసరే; మఱియొకమారు చూచెదను." అని యాతఁడాలోచించుకొనియెను.

జరీఫ్ ఏదియో యింకనొకమాట చెప్పెను; దాని కర్థమేమి? అది చెప్పుటకుఁ బెద్దగాథయా? నేనది యించుకయు నెఱుఁగనా? హారకుమారబాబెఱుఁగునా? వెనుక నొకనాఁడు హారకుమారబాబుగూడ నిట్లే మేదియో చెప్పియున్నాఁడు. ఇట్లు కానిచో, ఈసంపత్తి యిట్లు నా చేతికి రాకపోయియుండునని యాతఁ డేమియో చెప్పియుండెను. విధాయకముగా నామాటలన్నిటికి నేదియో యర్థముండియుండును. వాని యర్థ మేమైయుండునో?

హతభాగ్యుఁడైన శ్యామాలా లచ్చటఁ గూరుచుండి తన జన్మకథలన్నియు భావించుకొనుచుండెను. ఇంతస్వల్పకాలములో నింత మార్పును, ఇట్టిదురవస్థయు నెప్పుడైన నెవ్వరికైన సంభవించునో లేదో చెప్పుటకు సందేహమే !

## మూఁడవప్రకరణము.

### పశువు.

రాత్రి తొమ్మిదిగంటలకాలమైనది. విధుముఖి తనగదిలో నొక సోఫాపైఁ బండుకొని యొకపుస్తక మేదియో చదువుకొనుచుండెను. చిత్రవిచిత్రమైనపనితనముగల్గినవియుఁ జాలవిలువగలవియు రెండుదీపపు లాంతరు లాగదిలోనిపైభాగమునుండి వ్రేలాడుచుండెను. వానిలో నత్యుజ్జ్వలనిర్మలకాంతితో దీపములు వెల్గుచుండెను. ఆగదిలో నాలుగు వైపుల గోడలకు మనోహరములైనచిత్తరువు లనేకములమర్పఁబడియుండెను. చాలఁగుర్చీలుఁ జాలబల్లలు వివిధవిచిత్రవస్తువులు నాగదినిండ నుండవలసినచోట్ల నమర్పఁబడియుండెను. శృంగారరసోత్పాదనములగు ననేకవస్తువులచే గది యలంకరింపఁబడియుండెను. వాతాయనములనుండి దక్షిణానిల మరుదెంచి విధుముఖి సుకుమారసుందరశరీరమున కూడిగ

నుచేయుచుండెను. విధుముఖి తనపార్శ్వమున సుందరమైనచలువరాతిపై బంగారుసుమణిపళ్ళెరములయందు సుసిద్ధములైయున్నతాంబూలపుమడుపులను మాటిమాటికిఁ దంయెత్తి చేతనందికొని నోటఁబెట్టుకొనుచుండెను. తాంబూలపరిమళముతోడను; అత్తరువు మొదలైనవానివివిధసౌరభలములతోడను గది నిండిపోయియుండెను. ఆదుశ్శీలచేతిలోనిదేమి పుస్తకమైననేమిగాని, యామె మాత్రమాకావ్యానందరసగ్రహణపారవశ్యమునం దుండెను. ఆమె యిప్పు డొంటరిగానుండెను.

మెల్లమెల్లఁగాఁ జప్పుడుగాకుండ నడుగులువైచికొనుచు, స్థూలకాయుఁడగు నల్లనివికృతాకారపురుషుఁ డొక్కఁ డక్కడ కరుదెంచెను. మఱియు నాతఁడు నిశ్శబ్దముగా ద్వారమునందునిలిచి, గ్రంథపఠనపరాయణయైయున్న యాసుందరీమణిసౌందర్యప్రభలను సందర్శించుచుండెను. వేయేల? ఈదురదృష్టపురుషుఁడు శ్యామలాలే! ఆతఁడు తనివిదీరని చూపులతోఁ దనభార్యరూపరాశిని బులకితశరీరుఁడై తిలకించుచు విస్మితుఁడు గాఁజొచ్చెను. శ్యామలాలింతకుముందు మూఁడునాలుగుమాఱులు తనభార్యనుజూచి మాటాడినప్పు డామెయు సుందరియేయని యనుమానించెను. కాని, యిప్పు డాతఁడు, తనభార్య నిజముగా సుందరీరత్నమేయని స్థిరపఱుచుకొనియెను. మఱియు నేఁడాతఁడు తనభార్యను బోలు సౌందర్యనిధి నెందును జూడఁజాలమనియు నాశ్చర్యమొందెను. తనభార్య నారీలోకమున రాణిగానుండఁదగినదనియు, నామె భువనమోహిని యనియు నాతఁడు భావించుకొనుచుండెను. ఈసౌందర్యరాశితో నాతఁ డొకప్పుడైనను జనవుతో మాటాడియెఱుఁగఁడు; ఈభువనమోహిని నాతఁ డెప్పుడు నించుకయైన నాదరించియెఱుఁగఁడు; ఈసర్వాంగసుందరీశిరోమణి తనపాత్రేయని యాతఁ డెన్నఁడును దలంచియెఱుఁగఁడు. ఈదుర్లభరత్నము నుపేక్షించి యాతఁ డనేకజాతులనీచాతినీచాంగనలతోఁ గాలపాతముగావించుచువచ్చెను. అట్టివారికొఱ కాతఁడు చేయరానియన్యాయములు, నధర్మములు నెన్నేనిఁ జేయుచుఁ బొందరానియపనిందల నెన్నేనిఁ బొందుచు బ్రదుకుచుండెను.

దారిద్ర్యమును, దుఃఖమును, కఠోరహృదయములఁగూడఁ గోమలములుగాఁ జేయఁగలదు. ఉన్నతపదవినుండి యాకస్మికముగాఁ గ్రిందికిఁ బడిపోయినవారు సహజముగనే మార్పునొందఁగలరు. తమప్రస్తుతదురవస్థకుఁ దమపూర్వాపరాధములే కారణములని గ్రహింపఁగలసూక్ష్మబుద్ధి యప్పుడు వారికి లభించును. శ్యామలాలునకు నేఁడట్టియవస్థయే సంఘటించినది. దానిపై జరిగ్‌పలికినతీవ్రకఠోరవాక్యము లాతనిహృదయమును భేదింపఁజొచ్చెను. అప్పు డాతనిహృదయము కోమలమై, ప్రకృతిస్థమై, దీనహీనావస్థ నొందఁజొచ్చెను. ఈయవస్థలో నాతఁడు, వివిధవిలాసవస్తుపరివేష్టితయు, సుందరీశిరోమణియు నగుతనభార్యను జూచి యున్నపాటున యావద్వృత్తాంతమును మఱచిపోయెను. ఆకాపురుషుఁ డప్పుడు పశువువలె జ్ఞానశూన్యుఁడై, తేజోహీనుఁడై, సాహసరహితుఁడైపోయెను. భార్యయుశ్చరిత్రమేమియు నిప్పు డాతనికి జ్ఞప్తియందు లేకుండఁబోయెను. ఆసౌందర్యప్రచండప్రభలలో నాతనిసామాన్యజ్ఞానకిరణము నిస్తేజమైపోయెను. ఆశోభారాశి సన్నిహితమగుటచే నాతనిహృదయము విమోహితమైపోయెను. ఇప్పు డాతనికిఁ గ్రోధములేదు; ప్రతీకారబుద్ధి లేదు; అనిష్టముఁజేయునాకాంక్ష లేదు. రూపోన్మత్తుఁడైనశ్యామలాలు తనయపరాధమును క్షమింపుమని భార్యపాదములను బట్టుకొననిశ్చయించుకొనియెను. ఓరూపమా! నీకెంతటివిమోహనశక్తియున్నది!

శ్యామలాలు నిశ్శబ్దముగా భార్యనుసమీపించి లాక్షారాగరంజితములును, మణిమంజీరాలంకృతంబులు నగునామెపాదములను బట్టుకొనియెను. ఆసుందరి యదిరిపడి పాదములనువిదళించుకొని లేచికూరుచుండి భయముతోను గర్వముతోను "ఏమీ! నీవిక్కడికెందులకువచ్చితివి? నిన్నెవరిచ్చటికి రానిచ్చిరి?" అనియెను.

శ్యామ.—నేను నీభర్తను. ద్వారపాలకునిచే శాంతకుఁ దెలియఁజేసి నీయొద్దకు వచ్చితిని. ఇందుల కింతకోపమెందులకు?

విధు—నీకిట్లువచ్చుట కెంతమాత్రము నధికారములేదు. నిన్ను లోనికిరానిచ్చినవారి నిప్పుడే శిక్షించెదను. నీతో నాకు వివాహమైన మాట నిజమే. కాని, నిన్నెప్పుడును నేను భర్తగా భావింపలేదు. నీవు వెంటనే యిక్కడనుండి వెడలిపొమ్ము.

శ్యామ—విధూ! నేను నీయెడల ననేకాపరాధములుచేసిన మాట నిజమే. అయినదేమో అయిపోయినది; ఇఁక నేనెప్పుడు నెట్టియపరాధమును జేయను. నీవు నన్ను క్షమింపుము.

విధు—నీయపరాధములనుగూర్చి నాకేమియుఁ జింతలేదు; నిన్ను క్షమించుటవలనను నాకుఁ బ్రయోజనములేదు. పూర్వమందుఁగాని యిప్పుడుగాని నీతో నాకెట్టిసంపర్కమునులేదు. నీవు నన్నేలవిడిచి వేసితివి? నీవు దూరముగానే యుండుము.

హతభాగ్యుఁడైన శ్యామలాలు "నీవింతటిరూపవతివనియు నింతటిశోభావతివనియు నేనెప్పుడు నెఱుఁగను. విధుముఖి! నేను పాదములనుబట్టుకొనుచున్నాను; నాకు నీచరణసేవ నొసఁగుము. నేను నీవాఁడనై నీదాసుఁడనై యుండెదను. ప్రాణముఁబెట్టి నీయిచ్చవచ్చినట్లు మసలుకొనెదను; నీయాజ్ఞమీఱి యెప్పుడు నేమియుఁ జేయను; నీవు నాయెడల దయఁజూపుము. నాధనమంతయు నీకిచ్చివేసితిని; ప్రాణము, హృదయము, దేహముఁగూడ నీకిప్పుడిచ్చుచున్నాను. ఇంకనాకేమియు నక్కఱలేదు. నీకృపయే నాకుఁజాలును. నీరూపములో నాహృదయము నిండిపోయినది; నీసౌందర్యములో నాప్రాణము మున్మత్తమైపోయినది. విధుముఖి! నీకంటె నాకన్యగతిలేదు. ఈనీపాదసేవకు నీవిధముగాఁ ద్రోసివేయకుము." అని యాలాపించెను.

విధు—నీతో మాటాడుటకుఁగూడ నాకిష్టములేదు. నీవు నాయెదుటనుండి తత్క్షణమే వెడలిపొమ్ము. నిన్ను మానవుఁడని నేనెన్నఁడును ననుకొనలేదు. నీయట్టిభల్లూకమును బ్రేమించుటయను మాటఁ దలఁచు

కొనినంతనే నాయొడలు జలదరించుచున్నది. రంగి, సింగి, నూకి, వెంకి మొదలైనయచ్చరలే నీకుఁదగినప్రియురాండ్రు. నీవు నాదగ్గఱనుండి పొమ్ము. నీవికృతాకారమునకు నాకు నవ్వువచ్చుచున్నది; నిన్నుఁ జూచుటకు నాకసహ్యమగుచున్నది; నీమాటలువినుటకు నాయొడలు మండుచున్నది. నీతో నిష్టాలాపములాడుట నావలనఁగాదు. నీకిప్పుడేమికావలయును? రెండురూప్యములిచ్చిన వదలిపోయెదవా?

శ్యామ-—వలదు. వలదువిధూ! అట్లనకుము. నాకు ధనము వలదు; సుఖమునువలదు; నీదయమాత్రమే కావలయును. నీవు దయఁ జూడకపోయినచో నేనాత్మహత్య గావించుకొనియెదను.

విధు—అందువలన నష్టమెవ్వరికి? నీబ్రతుకుతో నాకేమియుఁ బనిలేదు. నీవాత్మహత్యచేసికొనినను సరే; ఇఁకెట్లుచచ్చినను సరే; నాకు నష్టమును లేదు-లాభమును లేదు. నీవిప్పుడిక్కడనుండిపోవుటయే నాకుఁ గావలయును.

శ్యా—నేనింక నిన్నువిడువఁజాలను. నీయాజ్ఞయైనప్పుడే వచ్చి నీరూపమును దర్శించి చరితార్థుఁడ నగుచుండెదను.

విధు-—(వికటహాసముతో) చాలు; నీకోరికలు. తత్క్షణమే వెడలిపొమ్ము. పోనిచో సేవకులచే గెంటించెదను.

రూపముగ్ధులకు మానాభిమానములును, హితాహితములు నుండఁబోవు. పాపాత్మురాలగుభార్యయవమానవాక్యములు శ్యామలాలుచెవుల కెక్కలేదు. అతఁ డెన్నఁడును బ్రేమానురాగము లన నేమో యెఱుఁగనేయెఱుఁగఁడు; ఇంద్రియలాలసుఁడగునరపశు వితరచింతలకు మనసీయఁడుగదా. శ్యామలాలామెమాటలను లెక్కింపక వేగముగా నేఁగి యామెను గౌఁగిలించుకొనియెను.

చాలకష్టముతో విధుముఖి విడిపించుకొని దూరముగాఁబోయి

"శారదా ! రామా !" యని కేకలు వేయఁజొచ్చెను. అప్పుడు దాసీ జను లనేకు లక్కడకువచ్చిరి. విధుముఖి క్రోధకంపితస్వరముతో గొంతెత్తి "యీనిర్భాగ్యశూకరమును నామొగుటినుండి యీడ్చివేయుఁడు. మీచేతఁగానిచో ద్వారపాలకులఁబిలిచి కొట్టి యీడ్చివేయుఁ"డని చెప్పుఁడు." అని, శ్యామలాలునిజూచి "పొమ్ము. నరాధమా! మరియాదగా లేచిపొమ్ము. నీయపరాధమునకు క్షమాపణములేదు; నేను నిన్నుఁ ద్రోసి వేయవలసినదే; కాని, క్షమించితిని." అనియెను.

తత్క్షణమే కొందఱు దాసీజనులు శ్యామలాలుని రెండుచేతులను బట్టుకొనిరి.

శ్యామ—విధుముఖీ ! ఆలోచించుకొనుము; నేను నీభర్తను సుమా !

దారుణక్రోధముతో విధుముఖి—"నీవు నిర్భాగ్యుఁడుకవు; నీవు నాభృత్యులకు భృత్యుఁడవగుటకును దగవు. నీవు నాస్వామివా ? నాస్వామిని నేనే స్వయముగా స్థిరపఱుచుకొనియున్నాను. నేనాతనినే త్రికరణశుద్ధిగా నమ్మియున్నాను.

శ్యామలాలేదియో చెప్పుట కుంకించెను; కాని, దాసి "ఊరకుండుము ఊరకుండుము; ఇఁక మాటాడుటవలనఁ బ్రయోజనము లేదు." అనుచు నాతనిని లాగికొనుచు వెడలిపోయెను.



నాల్గవప్రకరణము.



దేహదాహము.

శ్యామలాలుని దాసీజనులు సాగనంపివచ్చిరి. విధుముఖి యత్యంతగర్వితభావముతో నొకకుర్చీలోఁ గూరుచుండియుండెను. ఓనారాయణ

మూర్తీ ! నీవు పాపాత్ములనందఱను గురూపులనుజేసి వేయనైతి వేమి? ఎందుచేత, నీసృష్టిలోఁ బాపమూర్తులక్కడక్కడ శోభాయుతులై కనఁబడుచున్నారు? విధుముఖి కుర్చీలోఁగూరుచుండెను; కాని, ఏమియాశోభ ! క్రోధముచే నామెగండఫలకము లారక్తములై పోయెను; లోచనము లుత్తేజితములును బరిదీప్తములు నయ్యెను; వేణీబంధమువీడి యప్రయత్నముగా జాఱినయామె కేశదామము చిక్కువడినపువ్వులచే శోభిల్లుచుండెను; వసనభూషణములు చెదరి యపరూపాలంకారములుగా నగపడుచుండెను; వేఁడినిట్టూర్పులచే నామెవిశాలవక్షోభాగము ప్రకంపితమగుచుండెను ; సమధికావేగముచే సర్వాంగకములు నించుక సంచలించుచుండెను; అంతయు నపూర్వము!—సర్వము శోభామయము! ఎవతె కుష్ఠరోగివలె నస్పృశ్యయు, నెవ్వతెహృదయము విషధరమువలెఁ గాలకూటవిషపూరితమును, నెవ్వతెమనోవాక్కాయములు పాపమూలములున్నై యుండెనో యామె యింతటిశోభామయి యెట్లయ్యెను ! ఆమె యిట్టిదివ్యకాంతిసంపన్న యెట్లయ్యెను !

విధుముఖి కూరుచుండియే యుండెను. ఒకదాసి యామెప్రక్కనుండి పంకా లాగుచుండెను. శారద చలువపన్నీటిని దెచ్చి తలమీఁదను మోముమీఁదను జిలుకరింపఁజొచ్చెను; మఱియొకదాసి "స్మెల్లింగుసాల్టు" సీసాను దెచ్చి యామెప్రక్కనుంచెను; ఇంకొకతె యొకయత్తరుబుడ్డిని చేతిరుమాలుపైవంచి దానితో నామెమోమును వెన్నును బాహువులను దుడిచెను. చాలసేపైనపిమ్మట విధుముఖి తెలివిఁదెచ్చికొని "మోముఁజేతులంగడిగికొనుటకు జలము తె"మ్మనియెను.

తత్క్షణమే దాసి బంగారుకలశముతో జలమును, సబ్బును దీసికొనివచ్చెను. సుందరి యచటనే గూరుచుండి చేతులును మోమును గడిగికొనియెను. తరువాత నద్దమువంకఁ దిరిగిచూచుకొని "నాతలదువ్వుము" అనియెను. ఒకతె యామెకుఁ దలదువ్వెను. విధుముఖి యింకొ

కతెను బిలిచి "లెమ్నేడ్ సోడా" తెమ్మనియెను. అది తెచ్చియిచ్చెను. విధుముఖి మెల్లమెల్లఁగా దానిని ద్రావఁజొచ్చెను.

ఇంతలో హరిచరణుఁ డక్కడకరుదెంచెను. ఆతనిదర్శించినంత మాత్రముననే యామె ముఖకమలము వికసించెను. ఆమె వెంటనే దాసీజనులను బొమ్మని సంజ్ఞచేసెను; వారును వెడలిపోయిరి. కాని, హరిచరణుఁడు విషణ్ణుఁడైయుండెను. ఆతఁడు నిశ్శబ్దముగా వచ్చి విధుముఖికించుక దూరముగానున్న వేఱొకకుర్చీపైఁ గూరుచుండెను. విధుముఖితలపై నాకాశము విఱిగిపడినట్లయ్యెను. ఆమె యుద్వేగచిత్తముతో నాతనిసమీపించి చేయిపట్టుకొని "నేఁడు కాంచనకమలము కళదఱిఁగి యున్నదేమి ? నాప్రాణబంధువున కింతటిదైన్యమేల ?" అనియెను. హరిచరణుఁడు మెల్లమెల్లఁగా విధుముఖిచేయి విడిపించుకొని, నిట్టూర్పు విడిచి "నేఁడు నీయొద్ద సెలవుపుచ్చుకొనవలయునని వచ్చితిని. మన మొండొరులను జూచుకొనుట కిదియే కడసారిదినము.

ఏమి యీమాట ! ఏమి యీవజ్రఘాతము ! విధుముఖిహృదయము విదీర్ణమైపోయెను. ఆమె విస్మయావేగభావముతో "ఏమి యీమాట; హరిచరణా! నిన్నువిడుచుటయే-ఈప్రాణములుండఁగానే? చెప్పు చెప్పు, నాతోడు; ఏమి జరిగినది ?" అనియెను.

హరి—విశేషమేమియులేదు. నేను నేలయుసిరికనైయుండి కొండనంటుకొనుటకుఁ గోరుకొంటిని; నేను వామనుఁడనైయుండి చందురునందికొనుటకుఁ జేతులుసాచితిని. నాకోరిక యేదియు నెఱవేఱలేదు. ఏదికాఁగూడదో యదియెట్లగును ?

విధుముఖి యత్యంత చింతాకులితచిత్త యయ్యెను. హరిచరణుని యిట్టియసంతుష్టచిత్తమును విషణ్ణభావమునుజూచి యామె ప్రాణములతో నిలిచియుండఁగలదా? ఆమె యుత్కంఠ యపారమయ్యెను. ఆమె భయవిహ్వలచిత్తముతో నాతనికంఠమునుబట్టుకొని "హరిచరణా! విచా

రకారణ మేమో చెప్పుము. నాప్రాణము నిచ్చియైనను, నాసర్వస్వము నొసఁగియైనను మరల నీమోమున నాచిఱునగవు చూడఁగలనా? అట్లైన చో నట్లుకావింపఁగలను. ఏమైనదో చెప్పుము?" అనియెను.

హరి——మఱేమి కావలయును? కావలసినదేదియో యైనది. బాబు జరజరవచ్చుటయు వెళ్ళుటయుఁగూడ నైపోయినది. నీవు రాత్రి నన్నువంచించి బాబును రప్పించుకొంటివి. మీయిరువురి మనస్సులు నేక మైనవి. అంతియేచాలును.

విధు——(పకపక నవ్వుచు) ఇదియా! అయిన నన్ను క్షమింపుము. నాతలపైనుండి కొండంతబరువు దిగిపోయినది. ఇంతవఱకును నీదీనభావముఁజూచి నాప్రాణము కొట్టుకొనిపోయినది. ఆకోతి యిప్పుడు వచ్చి పోయినమాట నిజమే; అయిన నేమిపోయినది?

హరి——అదిగాదు. అందువల్ల నీకేమియు నష్టములేదు. కాని, యీనిర్భాగ్యుని సర్వనాశమునకు విఘ్నేశ్వరపూజయైనది. వేషభాషల తో రహస్యముగా బాబు నెప్పుడు రప్పించినావో, అప్పుడే యీదరిద్రు ని కోరికలన్నియుఁ గుంగిపోయెననుటకు సందియములేను.

విధు——ఛీ! నీవిట్లుసందియ మొందుట యన్యాయము. నాయెడల నెట్టిసందియములుండిన నుండవచ్చును. కాని, యిట్టి సందియ మొందుట మాత్రము నీకుఁ జాలఁబాపము సుమా!

విధుముఖి యించుక యభిమానముతోఁ దలవాచుకొని యూర కుండెను.

హరి——ఇప్పుడు నావన్నియు నన్యాయములుగనే కనఁబడును. నాయాజ్ఞలేనిదే యాతనిని లోనికి రానీయవలదని నేననేకపర్యాయము లు నీతోఁ జెప్పియున్నను నీవు సులభముగా నీయిష్టము చొప్పున నాత నిని రహస్యముగా రప్పించుకొనుట మాత్రము నీకన్యాయముగాదు?

నేననుకొనుట యన్యాయమైనదా? చాలసంతోషము ! నేనింక సెలవు పు
చ్చుకొనవచ్చునా. దరిద్రునకుఁ గోపముతోఁ బనియేమి ?

విధు.—ఆతఁడు వచ్చినమాట నిజమే. ఏవిధముగా లోపలఁబ్ర
వేశించెనో నాకుఁ దెలియదు. నేనుమాత్ర మాతనిని బిలిపింపలేదు.

హరి.—నీవు యజమానురాలవు, నేను భృత్యుఁడను. ఇట్టివారిన
డుమఁ బ్రేమవర్ధిల్లు టెట్లు? నీవు నీయిష్టముచొప్పునఁ జేయుచుందువు.
అదియేమని యడుగుటకు నాకధికారము లేదు. నాకన్నులతో నేను బా
బిచ్చుటినుండి వెళ్ళుటఁ జూచితిని ద్వారపాలకుఁడు, శారదయాయనను బిలి
పించినదని చెప్పినాఁడు. శారద నీయనుమతిలేకుండ నట్లుచేయుటకు సా
హసింపదు; నీవు దాని కంగీకరింపవు. ఇఁక నేఁజెప్పవలసిన దేమున్నది ?
నేఁటినుండి యీదరిద్రుఁడు నిన్ను వదలిపోవును. నీవు సుఖింతువుగాక;
నిన్ను విడిచినచో నీయభాగ్యునకుఁ బ్రాణములు నిలువనిమాట నిజమే;
కాని, నీసుఖమార్గమునకుఁ గంటకుఁడనై యొక్కనిముసమైన నిం
నిక్కడ నుండఁబోను.

చాలనభిమానకరమైన సంగతి ! మిక్కిలి మనస్తాపమును గల్గిం
చుమాట !

విధు.—హరిచరణా ! వృథగా సందేహముఁ దెచ్చిపెట్టుకొని నీవు
కష్టపడుచున్నావు—నన్నుఁ గష్టపెట్టుచున్నావు. ఆతఁ డేయుపాయము
చేతవచ్చెనో, వచ్చినమాటనిజము. ఎట్లువచ్చెనో నాకుఁదెలియదు. ఆతఁ
డు మనుష్యరూపభల్లూకము—స్వర్గమునుండి కందర్పుఁడు దిగివచ్చిన
ను నీస్థానము నాక్రమించుకోఁజాలఁడని నమ్ముము. నామనఃప్రాణములు
హరిచరణునియధీనములు. నాజీవమునకును— మరణమునకును నీవే
మంత్రిస్వరూపుఁడవు. నీవు నన్ను నమ్ముకున్నను దైవమెఱుంగును; నా
యపరాధ మేమియు లేదు.

విధుముఖి జరిగినసంగతు లన్నియు హరిచరణునితోఁ జెప్పుటకు సాహసింపలేకపోయెను. శ్యామలాలు వచ్చినందులకే యాతఁడు మండిపడుచుండఁగా నిఁక నాతఁ డాడినమాటలును నాతఁడుచేసినచేఁతలును జెప్పినచోఁ గోపమునింగిపోవునేమో యని యామె యన్నిసంగతులును జెప్పక కప్పిపుచ్చెను.

హరి—కావచ్చును; నీయపరాధ మేమియు లేకపోవచ్చును; కాని, యాతఁడు నిన్ను వివాహమాడినస్వామి. లోకమునుబట్టిచూచినను, ధర్మమునుబట్టి యాలోచించినను నీవాతనిదానవే. ఆతఁడు నిర్బంధించియైనను నిన్నుఁ దనదానినిగాఁ జేసికోఁగలఁడు; చట్టము (రాజశాసనము) ననుసరించియైనను నిన్నాతఁడు తనస్వాధీనముఁ గావించుకోఁగలఁడు. అన్నియు నాతని కనుకూలములు. సరియే, ప్రబలతరమైన నాప్రణయగ్రంథమును ముగిసినది. నీదయాపూర్వకమైన ప్రేమపుస్తకమును బూర్తియైనది. నీవు వీనినుండనిచ్చిన నుండనీయఁగలవు. పదాఘాతముచే దూరముగాఁ ద్రోసివేసినను ద్రోసివేయఁగలవు. ఆతని రాకపోకలు ప్రారంభమైనప్పుడే నిజముగా నాకుఁ జావును సంసిద్ధమైనది. అందుచేతనే చెప్పుచున్నాను.—ఇక్కడనేయుండి యీదురవస్థలన్నియు ననుభవించుటకంటెఁ దనసర్వనాశమును దనకన్నులయెదుటనే చూచుకొనుటకంటె, దూరముగాఁబోయి మరణించుటయే మంచిది. విధుముఖి! ప్రాణేశ్వరీ! నిన్నుఁజూడకుండుటయే నాకుమృత్యువు. అగుఁగాక; అయినను నేనిక్కడ నుండను. ఈయధమదాసున కీజన్మమున కింక సెలవిమ్ము.

హరిచరణుఁడు లేచి నిలుచుండెను. విధుముఖి యమయాతన ననుభవించుచు "సరియే, పొమ్ము; కాని, ధర్మము సాక్షి; నిశ్చయముగా నీయన్యాయమునకు నధర్మమునకుఁ దగినప్రతిఫలము ననుభవించితీరుదువు. హరిచరణా! నేను జాగ్రదవస్థయందును స్వప్నావస్థయందును

నిన్నే చూచుచుంటిని—నిన్నే యెఱుఁగుదును. అట్టి నీవు నన్ను విశ్వాసినిగా భావించి విడిచిపోవుచుంటివి. మంచిది. వెళ్ళిపొమ్ము; నీవీయూరు దాఁటకుండఁగనే విధుముఖి యిఁక లేదని వినఁగలవు." అని విధుముఖి వెక్కి వెక్కి యేడువఁదొడంగెను.

హరి.—ఏమి; నీకువచ్చినలోపమేమి? నీవాత్మహత్య యెందులకుఁ జేసికొనవలయును? నీప్రేమాశ్రయముచే స్వర్గసుఖమనుభవించుచు వచ్చినయీయభాగ్యునకు సర్వస్వాంతమైపోయినది గనుక నీతఁడిఁక నుండనక్కఱలేదు.

విధుముఖి యేడ్చుచునేడ్చుచు "అయినదేమో యైపోయినది. హరిచరణా! నీపాదములు పట్టుకొని ప్రతిజ్ఞ సేయుచున్నాను.—ఈజన్మమునం దిఁక నాతని మోముఁ జూడఁబోను. నీవు నన్ను మన్నింపుము; నాయెడ దయఁ జూపుము." అని చెప్పుచు నామె యాతనిపాదములు పట్టుకొనియెను. హరిచరణుఁ డప్పుడామెను లేవఁదీసి కన్నీరు తుడిచి గారవించెను. విధుముఖి హృదయ మానందముచే నుప్పొంగిపోయెను. హరిచరణుఁ డప్పుడు విధుముఖితో నేకపీఠమునఁ గూరుచుండి "కొన్నాళ్ళపాటిక్కడినుండి యెక్కడికైనఁ బోవలయునని నాకోరిక. ఇక్కడనున్నచో నీభర్త యేదేనొకవంక నెప్పుడేనొకప్పుడు నీకడకు రాకమానఁడు. నేనదిచూచి సహింపఁజాలను. నేనుశీఘ్రముగా నిక్కడినుండి నిన్నుఁ బశ్చిమదేశమునకుఁ దీసికొనిపోయెదను.

విధు.—స్వేచ్ఛగా—కొన్నినాళ్ళు నీతో దేశాటనము చేయవలయునని నాకును గోరికగా నున్నది.

హరిచరణుని యాజ్ఞాప్రకారము దాసియొకతె పన్నీటిచే నింపఁబడిన బంగారుహుక్కాలో సుగంధపూరితమైన తంబాకునుంచి తీసికొనివచ్చెను. తంబాకునుబీల్చుచు వారు దేశాటనమునుగూర్చి ముచ్చటలాడుకొనిరి. తరువాత వారు మద్యపానాదివినోదములలోఁ బ్రవేశించిరి.

---

# యోగేశ్వరి.

## నవమఖండము.—జ్యోతి.

### మొదటిప్రకరణము.

#### సంజీవని.

సనాతనపురమనునది యొకసామాన్యగ్రామము. ఆగ్రామము జలాంగియను నదీతీరమునం దొకయెత్తైనప్రదేశమున నున్నది. గ్రామమునకుఁ బ్రక్కనే పడవలునిలుచురేవు గలదు. ఒకనాఁటియుదయమునం దారేవుస్థలమంతయు జనులగుంపులతో నిండియుండెను. అక్కడనున్న యొక యిసుకతిన్నెపై ననేకులు గుంపుగాఁజేరి నిలిచి, గుంపునడుమ నున్న యేదియోవస్తువును వింతగాఁ జూచుచు, నటునిటుఁ దిరుగులాడుచు, ననేకవిధములుగా దానినిగూర్చి కల్పనలు చేసి చెప్పుకొనుచుండిరి.

ఆవాలుకాశయ్యయందుఁ దడిసినవస్త్రముతోను, నీరుగారుచు విరియఁబడియున్నదీర్ఘశిరోజములతోను, భువనమోహినియైన యొకసుందరి మృతకళేబరమై పడియుండెను. అనేకులతీవ్రదృష్టు లామెపైఁ బడుచుండెను. కాని, భయలజ్జాదులను సకలకోరికలను మృత్యుదేవత యామెకు దూరములుగావించెను. లోకులకఠోరవాక్యములు గాని, చూపుటయందేహావాదములుగాని, యనేకులనిందాలాపములుగాని యామె నిఁక నించుకయుఁ జలింపఁజేయఁజాలవు.

ఆమూఁగియున్నమనుష్యులలో నొక్కఁడు ప్రక్కనవారినిఁ జూచి యిట్లు ప్రశ్నించెను.

"ఎవ్వరామానిసి?"

మఱియొకఁడు—ఎవ్వరో తెలియుటలేదు. ప్రాణములేదు. ఎక్కడనుండికొట్టుకొనివచ్చినదో చెప్పఁజాలము.

ఇంకొకఁడు—గొప్పయింటిపిల్లమాత్ర మగును. ఆరూపు కనఁబడుట లేదా ?

వేఱొకఁడు—ఈరూపమువలననే సర్వనాశమైనది. తెలిసినది; ఎవరోచంపి నదిలోఁ బాఱవేసిరి.

మఱియొకఁడు—దుష్టరాండ్రి కిదేగతి.

ఈసమయమున నావలియొడ్డునుండి యీవలియొడ్డునకుఁ జేరిన దోనెనుండి కొందఱుమనుష్యులు దిగిరి. వారందఱు శవముచుట్టును గ్రిక్కిఱిసియూఁగి చూడఁజొచ్చిరి. వారిలోనొక పెద్దమనుష్యుఁడు మనకుఁ బరిచయముగలవాఁడుండెను. ఆతఁడు తలపై నొకవసులుతలపాగఁ జుట్టుకొని, శరీరమునందొకచొక్కాయినిదొడిగికొని, కొల్లాయితోఁజుట్టివేయబడిన ప్రయాణపుసంచి నొకచేతను, కాలిజోడు, గొడుగు రెండవచేతను బట్టుకొని యక్కడ నిల్వఁబడియుండెను. తెలుపరసి, యున్నతబలిష్ఠదేహముతో భద్రాకారమునఁ దేజస్వియైయున్న యాపురుషుఁ డక్కడిపెద్దమనుష్యులనేకులదృష్టినాకర్షించెను. ఈతఁడు హరకుమారబాబు. హరకుమారబాబు కాశినుండి యనేకాభిప్రాయములతో బయలుదేఱి, యనేకగ్రామములు, తిరిగితిరిగి యిప్పు డిక్కడికి వచ్చెను. ఆతఁ డిక్కడికెందులకువచ్చెనో యాసంగతి తరువాతఁ జూచుకొందము. కాని, ప్రస్తుత మాతఁ డాకస్మికముగా నాగుంపుదగ్గఱకుఁబోయి యొకపెద్దమనుష్యునిఁజూచి "ఏమియీవ్యాపారము?" అని యడిగెను.

ఆతఁడు "చిత్తము. అదిగో బాబూ!. కనఁబడుట లేదా." యని యచ్చటిజనసంఘము నించుకతొలఁగించి శవమును జూపెను.

హరికుమారబాబు మఱియించుక ముందఱికి నడచిచూచెను. వెంటనే యానిరుపమానసుందరీమణిశోభామయకాంతి యాతనికన్నులం బడియెను; ఆతఁడనేకవిషయములయం దభిజ్ఞుఁడును, బహుశాస్త్రవేత్తయును. ఆసుందరీమణినిర్జీవకళేబరమును జూచినతోడనే, చిరస్మరణీయుండును, మహామతియు నగుడాక్టరు మార్షల్ హాల్ "డాక్టర్ సిల్వెస్టరు" మొదలగువారు నీటిలోఁబడిపోయినవారిని బ్రతికించుటకుఁ బ్రకటించిన వైద్యోపాయము లాతనికిజ్ఞప్తికివచ్చెను. ఆతఁడామృతకళేబరముదగ్గఱ కేఁగి యనేకవిధములుగా దానినిబరీక్ష చేసెను. తరువాత నాతఁడక్కడనున్నవారందఱను జూచి" చాలఁబ్రయత్నముచేసినచో నీమె బ్రతుకవచ్చును. మీరెవ్వరైన నాకు సాహాయ్యముచేయఁగలరా?" అని యడిగెను.

ఈక్రొత్తవానిమాటలువిని యక్కడనున్నవారందఱు నొకరిమొగమునొకరు చూచుకొనఁజొచ్చిరి. మఱియు హరికుమారునియెదుటినుండి తమమోముల నావలికిఁ ద్రిప్పుకొనఁజొచ్చిరి. కొందఱుకొందఱావలికివెడలిపోయిరి. కొందఱు ముందఱికివచ్చి నిల్వఁబడిరి; వారిలో నొకదృఢశరీరుఁడైనయువకుఁడు హరికుమారునిసమీపించి "నావలనఁ గాఁగలకార్యమేదేని యున్నచో నాకాజ్ఞాపింపుఁడు" అనియెను.

హరి—బాబూ! నీవలనఁ గార్యము చక్కఁగా నెఱవేరఁగలదు. నీవు చాలమంచిబిడ్డవు. వెంటనే పోయి యాకనబడున్నయింటి యొద్దఁ గొంచెమువట్టిగడ్డిని దెమ్ము చూతము. ఆలస్యముచేయక కొంచెము శీఘ్రముగా రావలయును.

ఆతఁడు వెంటనే వెడలిపోయెను. ఆసామీప్యమునందే పల్లెవాండ్రయిల్లుగలదు. వాండ్రు గడ్డిపఱచుకొని పండుకొనుచుందురనియు వారియింటిలోఁ దప్పక గడ్డియుండుననియు నాతఁడెఱింగియుండెను. ఆతఁడక్కడకుఁబోయి యెవ్వరి నేమియు నడుగకయే, యెవ్వరియాజ్ఞ

కును నిరీక్షింపక యే యక్కడనున్నగడ్డినంతయు జుట్టఁబెట్టుకొని పరుగెత్తుకొనివచ్చెను.

అతఁడు గడ్డిని దేఁగానే హారకుమారబాబు సుందరిమృతకళేబరమును బోరగిలఁ బరుండఁబెట్టి యామెచేతులను మడఁచి యామెమోము క్రింద నెత్తుపెట్టెను. అట్లుచేయఁగానే యామెనోటినుండి నీరువెలికి రాఁజొచ్చెను. ప్రయత్నపూర్వకముగా హారకుమారబాబు బాలికగర్భములోని నీరువెలికిఁదీయుచు, సహాయార్థియైయున్న యాయువకునిఁజూచి "అయ్యా! నీవాగడ్డి నక్కడనుంచి శీఘ్రముగ నాదగ్గఱకురమ్ము" అనియెను. తత్క్షణమాతఁడు దగ్గఱకురాఁగానే హారకుమారబాబాతనితో "ఈమెకట్టుబట్ట నీవలికిఁ దీసి యొకకొంగుతో నసుమును, వేఱొకకొంగుతో మీఁగాళ్ళదగ్గఱను బిగింపవలయును" అనియెను.

తరువాత వారిరువురును బ్రయత్నించి యెట్టులో యామెపరిధానము నీవలికిఁదీసిరి. హారకుమారబాబక్కడ మూఁగియున్న వారందఱను జూచి "ఈయువతి మీకుఁగాని నాకుఁగాని యెట్టిచుట్టమునుగాదు. మీరును నీమె నెఱుఁగరు; నేనును నెఱుఁగను. కాని, మనమందఱము ధర్మచింతతో నేయిచ్చటికివచ్చితిమి. ఇప్పుడు మనము ధర్మదేవతసాక్షిగా నీమెను బ్రతికించుటకుఁ బ్రయత్నముచేయుచున్నాము. ఇప్పుడీమె దరిదాపుగా వివస్త్రయైయున్నదని చెప్పవచ్చును. ఇట్టిస్థితిలోనున్న యామెను జూచువారందఱును ధర్మదేవతసాక్షిగా నీమెతల్లియనిగాని మీగర్భమున బుట్టిన బిడ్డయనిగాని భావింపుఁడు—అట్టిశక్తి లేనివారధర్మమునకుఁ బాలగుచున్నారుగనుక నిచ్చటినుండి వెడలిపోవుట మంచిది." అనిచెప్పెను.

అక్కడనున్న యొకవృద్ధుఁడు—ఆమె యెవ్వరైననేమి, మనతల్లి; ఈయవస్థయందామె నన్యథాభావించినవారికి నరకమందైనను జోటుండదు. 7 బాబూ! పుణ్యాత్ములుమీరు ప్రయత్నము చేయుచున్నారు— కష్టపడుచున్నారు. కాని, చచ్చిపోయిన యీమె యెట్లు బ్రతుకును? నాయొద్ద

నొకకుఱ్ఱవాఁడున్నాఁడు. మీకు సాహాయ్యముగావలసినచో వానికేమేని యాజ్ఞాపింపుఁడు వానిపేరు; హారీశకుమారుఁడు" అనియెను.

హరకుమారబాబు వినుచుండెను. మాటాడుచునుండెను; కాని యాతనిపనికి మాత్రము విరామములేదు. ఆతఁడాసుందరీమృతదేహమును మరల వెలికిలఁబరుండఁబెట్టి హారీశకుమారునిఁబిలిచి "యామెతల గట్టిగాఁ బట్టుకొనియుండు" మనియెను. పిదప నాతఁడావృద్ధునితో "నిజముగా హారీశకుమారుఁడు చాలమంచిబిడ్డ, ఈశ్వరుఁడీతనికి జయము గలుగఁజేయుఁగాక! అయ్యా! చావుబ్రతుకు లీశ్వరాధీనములు. మనము మనప్రయత్నమునుమాత్రము చేయుదము. మేలేచేకూరవచ్చును; కీడురాఁగూడను." అనిబదులుచెప్పెను.

వృద్ధు—ఇంక నెవ్వరిసాహాయ్యమైనఁగావలయునా? నేను వృద్ధుఁడనేకాని, కొంతసాహాయ్యముచేయుటకు నాకు శక్తిగలదు. మీకుసమ్మతమేని నాకునట్లని యాజ్ఞాపింపుఁడు.

హర—రండు! ఈపనికిఁ జాలమందిసాయము గావలయును. మీవలనఁ జాలసహాయము కాఁగలదు.

వృద్ధుఁడు దగ్గఱకు వచ్చెను. హరకుమారబాబు మృతసుందరి నోటినుండి నాలుకనించుక యావలికి జాగ్రతగా లాగెను. తరువాత నాతఁడేదియో యొకవస్తువును దనజేబునుండి పైకిఁదీసి దాని నామె నాసారంధ్రములలో నించుకించుక గావిడువఁదొడంగెను. దానివలన నేమియుఁ గార్యములేకుండుటఁజూచి యాతఁడొకగడ్డిపరకనుదూర్చి దాని కొనతో నాసికారంధ్రములలోని రోమములను లోనికిఁ ద్రోసెను; దాని వలనను లాభముగనఁబడలేదు. అప్పు డాతఁడు వృద్ధునిజూచి "అయ్యా! మీరీమెగుండెను జక్కఁగ ఎముకలను మెల్లమెల్లగా రాయుచుండుఁడు! హాఁ హాఁ! నీవీమెతల నొకచేతఁబట్టుకొని, రెండవచేతితోఁ బ్రత్యేకముగా

నీమెకంఠమును, మోమును, జేతులను రాయుచుండుము" అనిచెప్పెను.

ఆతఁడుచెప్పినట్లు వారు చేయుచుండిరి. తరువాత హారకుమార బాబు తనసంచినుండి యొకగ్లాసునుదీసి దగ్గఱనున్నయొకమనుష్యుని జూచి "అయ్యా! దీనితో నదిలోనుండి జలమును దీసికొనిరండు" అని యెను. "నీవుచచ్చుచున్నావు. నీతోఁబాటు నేనుగూడ జచ్చుట యెం దులకు?" అని జవాబుచెప్పెను.

మఱియొకమనుష్యుఁ డాగ్లాసు నందికొనివెంటనే నదిలోనీరు ముంచి తెచ్చెను. ఆనీరందుకొని హారకుమారుఁ డామృతసుందరి మోము నందును, వక్షమునందును దీవ్రముగాఁ జల్లి మరల నాగ్లాసు నాయనకం దిచ్చెను; ఆతఁడు మరల జలముఁ దెచ్చెను. హారకుమారబాబు గడ్డియిం చుకతీసి నిప్పుచేసి దానిపై నానీరుకాఁచి యావేఁడినీటి నీమాఱామె మోమునందును వక్షమునందును జల్లెను. ఇట్లుయొకమాఱు చల్లనినీరును ఇంకొకమాఱు వేఁడినీరును నామెపైఁ జల్లుటకుఁ బ్రారంభించెను. తరు వాతఁ గొంతసేపటి కాతఁ డించుకధైర్యభావముతో నామృతసుందరి ముక్కుకొనను, గుండెకెడమభాగమునను జేయుంచుచూచి యుద్రేక భావమున నామెముఖచిహ్నములను బరీక్షింపఁజొచ్చెను. అప్పుడు వృద్ధుఁ డాతనిజూచి "అయ్యా! ఆశయేమైన నున్నదా?" అని యడిగెను.

హార—అప్పుడే? ఇంకను మనము చాలకష్టపడవలసియున్నది. మీరు నిరాశచెందవలదు.

తరువాతఁ దనతలపైనున్న తలపాగనుదీసి యొకచిన్నతల గడవలెఁ జుట్టబెట్టెను; పిమ్మట శవమును బోరగిలఁబరుండఁబెట్టి యాతల గడను గుండెలక్రిందిభాగమునం దెత్తుపెట్టెను. అట్లు నాల్గుచిటికెలకా లము పరుండనిచ్చి తరువాత శవము నొకప్రక్కగాఁ ద్రిప్పి పరుండఁ బెట్టెను; మరల నాల్గుచిటికెలకాల మట్లుండనిచ్చి యింకొకప్రక్కకుఁ ద్రిప్పి పరుండఁబెట్టెను. కొంతసేపట్లే యీప్రక్కనుండి యాప్రక్కకు

నాపక్కనుండి యీపక్కకుఁ ద్రిప్పిత్రిప్పిపరుండఁబెట్టుచుండెను. హరీశుఁడు శిరోభాగమును, వృద్ధుఁడు పాదతలమును బట్టుకొనుచుండిరి; హారకుమారుఁడు మధ్యభాగమునుబట్టుకొని వారికి సమయమును దెల్పుచు నట్లు త్రిప్పుచుండెను. శవము నెంతసేపుబోరగిలఁ బరుండఁబెట్టుచుండిరో యంతసేపును హారకుమారబాబామె వీఁపును బ్రక్కభాగములును జేతితో నొక్కిపట్టుచుండెను.

దరిదాపాఱేఁసు నిమిషములకాల మిట్టి ప్రక్రియలనుగావించియు విశేషలాభముగనఁబడకపోవుటచూచి హారకుమారబాబు, హరీశునియొక్కయు వృద్ధునియొక్కయు సాహాయ్యముచే శవము నొకయేటవాలు ప్రదేశమునకుఁ దెచ్చి యచ్చట శుభ్రపఱిచి పరుండఁబెట్టెను. తరువాతఁ గొంతగడ్డిని తనగుడ్డతోఁ దలగడవలెఁ జుట్టి యామెస్కంధప్రదేశము క్రింద నెత్తుపెట్టెను. పాదములున్నచోటికంటెఁ దలదిక్కున నెత్తుండునట్లుగా నమర్చెను.

తరువాత హారకుమారబాబామృతసుందరినాలుకనించుకలాగి పట్టుకొని దానిని గ్రమముగా నోటినుండి కొంత యీవలికివచ్చునట్లు లాగెను. పిమ్మట నాతఁడు తనయుత్తరీయపుకొంగునుజించి దానితో నామెనాలుకను, ఆమె గడ్డముతోఁగలిపి కట్టివేసెను. నాలుక యిఁక నోటిలోనికిఁ బోఁజాలకుండెను.

దగ్గఱనున్నవారందఱు హారకుమారబాబు చేయుచున్న యీయున్మత్తచేష్టలన్నియుఁ జూచి యాతనిని పిచ్చివాఁడని నిశ్చయించుటకుఁ బ్రారంభించిరి. ఒకఁడు మఱియొకనినిజూచి "యీమనుష్యుఁడు కేవలము పిచ్చివాఁడు" అనియెను.

మఱియొకఁడు—కాఁడు, తెలిసినది. ఈతఁడు డాక్టరైయుండవచ్చును.

మణి—అవును. కొంచెముగుణముకనఁబడుచున్నది.

ఇంకొ—ఆగుణము తరువాత మరణమే.

ఇంకొ—పదుండు, పదుండు, కాలమాత్రయు నిక్కడనే యయి పోవుచున్నది.

ఇంకొ—అది మంచిపని.

ఈవిధముగా నందఱుఁ బరామర్శగావించు చున్నారేకాని యొక్కరు నక్కడనుండి కదలలేదు. క్రమముగా మనుష్యులక్కడ వృద్ధిగాఁ జొచ్చిరి. ఇఁకనిక్కడ హరకుమార బాబు శవము తలదిక్కున నిలువఁబడి రెండుభుజములను బలముగా నొక్కిపట్టియుండెను; తరువాత నామె రెండు చేతులనుజాఁచి యామెచెవులదగ్గఱనుండి పైకెత్తెను. రెండుసెకనుల కాలముమాత్రి మాచేతు లట్లేయుంచి మరల నెప్పటియట్లు క్రిందికి వాల్చివేసెను. మరల రెండుచేతులను పైకెత్తి కొంచెముసేపుంచి క్రిందికి వాల్చెను. ఈవిధముగా మరల మరలఁ జేతులుపైకెత్తుచుఁ గ్రిందికి వాల్చుచుఁ గొంతసేపట్లు గావించెను. కొంతసేపట్లుచేసిన పిమ్మట హరకుమారుని ముఖమండల మానందకందళిత మయ్యెను. ఆసుందరిగుండె యించుక కొట్టుకొనుచున్న ట్లాతనికిఁ గనఁబడెను. నా సారంధ్రిములించుక వెచ్చనైనట్లు తోఁచెను. ఇఁక నాతనియానందమునకు మేర లేదు. ఆతఁ డప్పుడు సంతోషమందస్వరముతో "శ్రీహరికృపవలన నీస్త్రీ బ్రతికినట్లే. మీరందఱు నొకమాఱు హరినామస్మరణము సేయుఁడు" అనియెను.

నాల్గుదిక్కులనుండియు నుచ్చధ్వనులతో హరినామము బయలు దేఱెను. హరకుమార బా బప్పు డామెకుఁ బ్రక్కలక్రింద నెత్తుపెట్టిన దిండ్లను దీసివేసి యామెను జక్కఁగాఁ బరుండఁజేసి యచ్చటివారినిజూచి "మీరొగడ్డిని రగిల్చి మంటచేసి యీయామెదేహమున గాఁచుఁడు. పర మే

శ్వరుఁ డిఁక మీకష్టమును ఫలింపఁజేయఁగలఁడు. ఈసత్కార్యముచేసి నందులకు దైవము మిమ్మాశీర్వదించును." అని చెప్పెను.

వారు మాటచేసిరి. హరకుమారబాబు నాసారంధ్రముల యొద్దఁ జేయుంచి యుచ్ఛ్వాసనిశ్వాసములను బరీక్షించుచు "బాగుగాఁ గాచుఁడు. నేఁడియగుననీ చూపడవలదు" అని చెప్పెను.

హరిశుఁడును వృద్ధుఁడును గాఁచుటకుఁ బ్రారంభించిరి. హరకుమారుఁడు వారినిజూచి మీరిరువురును బాదములతట్టు గాపడముపెట్టుఁడు. చేతులుకాఁచుట కిఁక నిద్దఱుమనుష్యులు గావలయును." అనియెను.

సత్కర్మయందు మిక్కిలి మోహాకరమైన యాకర్షణ మున్నది. ఇద్దఱుమనుష్యులు తలలకుఁ గొల్లాయిగుడ్డలు చుట్టుకొని కాపడముపెట్టుటకై హరకుమారబాబు దగ్గఱకువచ్చినిలిచిరి. వారికాతఁడా మెచేతులు రెండును గాఁచవలయునని చెప్పెను. అందొకఁడు "ఇఁక నెవ్వరు మనుష్యులక్కఱలేదాబాబూ!" అని యడిగెను.

హర.—అక్కఱలేకేమి? చాలమంది సాయముగావలెను.

ఇఁక నిద్దఱుమనుష్యులు ముందఱికి వచ్చిరి. వారి నామెతలయు మెడయుఁ గాఁచునట్లు హరకుమారుఁడు కోరెను. వారట్లుగావించుటకుఁ గడంగిరి. అందఱును హరకుమారుని యుపదేశప్రకారముగా బట్టలు జాగ్రత్తగాఁ గట్టుకొని యామెకాళ్ళయొద్దనుండి తలవఱకుఁ గణకణకాఁచుచుండిరి. ఇట్లు కొంతసేపగునప్పటి కాసుందరి గండభాగము లించుక యెఱ్ఱవాఱినవి. క్రమముగా నామె దేహ మంతయు నెఱ్ఱవాఱి జీవకళలతోఁ జోభిల్లఁజొచ్చెను. అప్పు డామెనాలుకకుఁ గట్టినకట్టు విప్పివేసి హరకుమారుఁ డక్కడఁ గాఁచుచున్న వారినిజూచి "అయ్యలారా! మీయందఱి శ్రమయు సఫలమైనట్లు కనఁబడుచున్నది. ఎవ్వరైననేమి? ఈశ్వరసంతానము. మీరీమెను రక్షించి పుణ్యము గట్టుకొనినారు. ఇఁకఁ గాఁచుట మానివేయుఁడు. నాల్గుప్రక్కల నిప్పుమాత్రము బాగుగా నుంచుఁడు."

అని చెప్పెను. సుందరి నాలుక క్రమక్రమముగా నోటిలోనికిఁ బోయెను. హరకుమారుఁ డొక చెంబుతో నీరు దెచ్చిఁబెట్టి, ఒక్కొక్క చినుకుచొప్పున నాసుందరి నోటిలోఁ బోయఁజొచ్చెను. మెల్ల మెల్లఁగా నీరామెకంఠము నుండి దిగుచుండెను. అప్పుడు హరకుమారుఁ డానందోన్మత్తుఁడై రెండు చేతులను బైకెత్తి "అయ్యలారా! హరినామము సత్యమైనది. హరినామమునకు జయము. మీరందఱు నొక్కమాఱు హరిస్మరణ చేయుఁడు" అనియెను.

మరల నాల్గుదిక్కులనుండియు నుచ్చస్వరములతో హరిహరిధ్వనులు చెలరేఁగెను. ఈసమయమున నొక్కరి కాపడమువలన వేఁడి యెక్కుడై సుందరి యొకకాలు మెల్లఁగాఁ బైకిఁదీసికొనియెను.

మరల నాల్గుదిక్కులనుండియు హరినామము ప్రతిధ్వనింపఁజొచ్చెను. చిరప్రీతిప్రదమును మధురమయమునైన యీహరిస్మరణము ముగియకముందే సుందరి కన్నులనించుక విప్పి చూడఁజొచ్చెను. కాని, యామె తాసీయవస్థలో నీయపరిచితులైన యనేకజనసమూహముల నడుమఁ బడియుండుటఁ జూచుకొని చాలసిగ్గుచే సంకుచితయైమరలఁ గన్నులుమూసికొనియెను. తరువాత నామె తనశరీరమును జీరచేఁ గప్పుకొన నెంచి చేయిచాఁచి చీరకొంగు లాగికొనఁజొచ్చెను.

అదిచూచి హరకుమారబాబు "భయములేదుతల్లీ! నేను నీకొమారుఁడను. బిడ్డదగ్గఱఁ దల్లికి లజ్జయెందులకు? చీర యున్నది తల్లీ! భయమేమియు లేదు." అని పలికెను.

హరకుమారుఁ డప్పుడు తనసంచినుండి యొకవస్త్రమును దీసి దానిని విప్పి యామెదేహమునిండఁ గప్పెను.

క్షీణకంఠముతో నాయువతి "నేను మునిఁగి పోయితిని. మీరు నన్ను మరల బ్రతికించితిరేల?" అని వగచెను.

శ్రీ వేమన గ్రంథాలయము,
నవమఖండము. జోల ప్రోలు,

హార——మేము నిన్ను బ్రతికింపలేదు తల్లీ! ఈశ్వరుఁడే నిన్ను బ్రతికించినాఁడు. చచ్చిపోవుటకుఁ గోరినంత మాత్రముచే నది మనకు సాధ్యమగునా ? ఎవ్వరిపని వారు చేయనే వలయును.

తరువాత హారకుమారుఁ డక్కడనున్న వారందఱను జూచియిట్లనియెను. "మీరందఱును గొప్పసత్కార్యముఁ జేసినారు. కాని, అన్నలారా! మనపని యింకను బూర్తిగాలేదు. ఎట్లయినను మనమిప్పుడొక పల్లకిని దేవలయును. ఈమెనందుఁ బరుండఁబెట్టవలయును. గ్రామములో మంచి విశాలమైన యిల్లొకటి స్థిరపఱుపవలయును. ఇంకను బదిపదునొకండు దినములవఱకు నీమె స్వస్థురాలుగాఁజాలదు. కర్చువెచ్చములకుఁ గావలసినసొమ్ము నేనిచ్చుకొనెదను. ఈమె నాదరించి సంరక్షణ చేయువారు గావలయును"

హారకుమారుఁడు తనసొమ్ముసంచినుండి కొన్నిరూప్యములీవలికిఁ దీసెను. హారీశకుమారుఁ డప్పుడు హారకుమారునిఁజూచి "బాబుగారికి సమ్మతమైనచో నేనీమెను నాగృహమునకుఁ గొనిపోయి సంరక్షణము చేయఁగలను. నాయింట నాతల్లియు నొకవితంతుసోదరియుఁగలరు. నేనును నాభార్యయు నున్నాము. పరిచర్యచేయుటకు లోపమురాదు. నాగృహమునం దనుకూలమైన మంచిగదియొకటికూడఁ గలదు. నేనీమెను దీసికొనివెళ్ళి సేవచేయుట కుత్సహించుచున్నాను. కాని, యీవిషయమై సొమ్ముమాత్రము నేనుగైకొనను" అని చెప్పెను.

అప్పు డక్కడివారందఱును హారీశకుమారుఁడు చాలధార్మికుఁడనియును, వారియిల్లు చాలసదుపాయము గలదియనియు, నిది చాలమంచి యాలోచనమనియుఁ జెప్పఁజొచ్చిరి.

హార——హారీశా! నీవు చాలఁబుణ్యాత్ముఁడవు. కానిమ్ము; ఈమెను నీయింటనుంచుటే స్థిరము. కాని, యిక్కడినుండి కొనిపోవుట కుపాయము?

హరి.—చిత్తము! పల్లకిలోఁ గొనిపోవుట సులభముగాఁ దోఁచుట లేదు. ఈయమ్మనందుఁ బరుండఁబెట్టుట కష్టము. ఈచేరువ నొకబల్లఁ గలదు. దానిని దెచ్చి మెత్తనిప్రక్కఁబఱచి యీయామె నందుంచి నలువురము జాగ్రత్తగా నడచుచుఁ దీసికొనివెళ్ళుట మంచిదిగాఁ దోఁచుచున్నది. తమ చిత్త మెట్లో యట్లే.

హరి.—చాల బాగుగనన్నది. అట్లే చేయవలెను.

కొందఱు మనుష్యులను వెంటఁబెట్టుకొని హరీశుఁ డక్కడినుండి వెడలిపోయెను. హీనస్వరముతో నాసుందరి మరల "మీ రెవ్వరు?" అనియెను.

హర.—తల్లీ! నేనెవ్వరైననేమి? అయినను ముందుముందు నన్ను నీ వెఱుంగవచ్చును. నీ వెవ్వరో తెలిసికొనుటకు నాకును కుతూహలము లేదు. నీకుఁ గావలసిన సదుపాయములు గావించుటకే నాకిప్పుడు కుతూహలముగా నున్నది. ప్రస్తుత మిట్లుకానిమ్ము. నేను నీబిడ్డను. నావలన నీయిష్టమునకు విరుద్ధముగా నొక్కయహితమైనను జరుగదుతల్లీ!

మరలహీనస్వరముతో నాసుందరి యిట్లనియెను. "నాకొఱకు సొమ్ము వ్యయపఱుపవలదు. నేను మిక్కిలిదుఃఖినిని."

హర.—కాని, అమ్మా! నీయాకృతినిజూడఁగా నీవు చాలసదృష్టవతివిగా నున్నావు. నీమాటలు విన, నీవుసతీలక్ష్మివని తెలియుచున్నది. నీకొఱకుఁ జేసినయత్నమును, వ్యయమునునిష్ఫలము లెన్నటికినిగావుతల్లీ! నీవిప్పుడు దుఃఖినివైనఁ గావచ్చును గాని దుఃఖముమాత్రము చాలదినములు నిలువఁజాలదు. తప్పక నీదుఃఖము దూరముగాఁగలదు. నీదుఃఖవృత్తాంతము నాకుఁదెలిసినప్పుడు నాకు దానినిఁదొలఁగించుటసాధ్యమైనచో నేనందులకుఁ దప్పక సకలప్రయత్నములు జేయఁగలను. దైవమున్నది. భయమేమియు లేదుతల్లీ! సకలము ననుకూలముగాఁగలదు.

సుందరి—మీ రెవ్వరో మహానుభావులు. దైవము మిమ్ము రక్షించుగాక! నాకిప్పుడే బ్రతుకవలె ననునిచ్ఛగల్గినది.

ఒకబల్లపై మెత్తని పరిక్కపఱచి హాసీశుఁడు మొదలగు వారక్కడకుఁ దెచ్చిరి. హారకుమారునిసంచి దానిపైఁ దలగడగా నమర్పఁబడినది. తరువాత నాసుందరి నందుఁబరుండఁజేసి నాలుగుపరిక్కల నల్వురు జాగ్రత్తగా నెత్తిపట్టుకొని మెల్లఁగా బయలుదేఱిరి. ఆమె దేహ మాపాదమస్తకమును వస్త్రముచేఁగప్పి వేయఁబడినది. ఆమె మోముమాత్ర మొక సన్ననివస్త్రముచేఁ గప్పఁబడియెను. ఆమె కన్నులు మూసికొని యుండుగుఁ బరుండెను.

కౌతూహలపరవశులై యనేకజను లామెవెనువెంట నడచుచుండిరి. వా రెప్పుడు నిట్టియాశ్చర్యకరమైన పనిని జూచియుండలేదు; ఇట్టి విస్మయకరమైనవ్యాపారము జరిగియుండునని వినియైన నుండలేదు. ఇప్పుడు వారందఱకును హారకుమారుఁ డెవ్వరో దైవశక్తిసంపన్నుఁడైన యొకమహాపురుషుఁడని యభిప్రాయముగలిగెను. ఈతఁ డెవ్వరో? ఎక్కడనుండి యీగ్రామమున కాకస్మికముగా వచ్చెనో? ఎందులకాతఁ డిక్కడకు వచ్చుటఁదటస్థించెనో? ఈ మొదలగుసంగతులన్నియుఁ దెలిసికొనుటకు వారి కత్యాతురతగా నుండెను.

ఇఁక నీసుందరి యెవ్వరు? కుసుమసుకుమారశరీర, లజ్జాశీల యగునీమె యెవ్వరు? ఎవ్వరైనఁ గులటాంగన గాదుగద? అట్లెన్నటికిని గాదు. దుఃఖినీ! దుఃఖించెద వేదులకు? ఎవ్వరీయువతి? ఈపురుషుఁడు స్త్రీ నింతకుము న్నెఱుఁగునా యేమి?—అట్లగపడుట లేదు.

ఈరహస్యములన్నియు వారు భేదింపఁజాలకున్నారు. కాని, విశేష భక్తితోడను, సంభ్రమముతోడను వారందఱు మృతతుల్యయైన యువతినిఁ, అయలౌకికశక్తిసంపన్నుఁడైన మహాపురుషునిఁ దిలకించుచు వారి వెంట నడచుచుండిరి.

---

## రెండవ ప్రకరణము.

పరిచయము.

సన్యాసియైన యుమాశంకరుని తల్లిదండ్రులవృత్తాంతమును సంగ్రహించునిమిత్తమై హరకుమార బాబు నానాప్రదేశములఁ దిరిగితిరిగి నేఁడిక్కడకువచ్చెను. ఇక్కడ నుండవలసినయవసరమాయన కేమియు లేదు. ఈసనాతనపురమున కించుకదూరమునం దున్న రామనగరమునకు నడచిపోవలయునను నుద్దేశముతోనే యాతఁ డిక్కడకు వచ్చెను. మార్గమధ్యమునం దాయపరిచితురాలిదురవస్థనుజూచి విధిలేక యాతని కక్కడ నాఁగవలసివచ్చెను.

నిజముగా హరీశకుమారుఁడు చాలమంచివాఁడే. ఆతఁడు సంతోషముతో, బాధపడుచున్నయాసతికిని హరకుమారబాబునకును గావలసినయుపచారములు సేయుచుండెను. వారు తనయింటనుండి గౌరవమర్యాదలు పొందుటకుఁ దగినయేర్పాటులు చేయుచుండెను. హరీశునితల్లి, భార్య, తండ్రి, అందఱును, ఆపీడితురాలినిగురుపుత్రికవలెఁజూచిసమాదరించుచు నామెసేవాశుశ్రూషాదులన్నియుఁబరమానందముతోఁ జేయుచుండిరి. హరీశుఁడుమాత్రము మరల నామెను జూడలేదు; ఆమెయున్న దిక్కునకైనను బోలేదు. ఆయింటివెలుపలివైపున నొకగదియున్నది; ఆగదిలో హరకుమారబాబు నివసించెను. పీడితురాలు స్వస్థతఁబొందకుండ నామెను సురక్షితమైనచోటికిఁ జేర్పకుండ హరకుమారబాబిక్కడ నుండి పోలేకుండెను.

హరకుమారునియానాఁటిచర్యలును, ఇతరవ్యవహారములును జూచి హరీశకుమారుఁడును, గ్రామస్థులునుగూడ, నాతని నొకదేవతుల్యుఁడైనమహాత్ముఁడనియే భావించుచుండిరి.

పీడితురాలు క్రమముగా సంపూర్ణారోగ్యము నొందుచుండెను; ఆమె స్వాభావికలావణ్యజ్యోతియుఁ బ్రదీప్తముగాఁ జొచ్చెను. శోభామయియైనయాసుందరివృత్తాంతమును దెలిసికొనుటకై హారకుమారబాబనేకవిధములఁ బ్రయత్నించుచుండెను. కాని, యామె తనవృత్తాంతమును నివేదించుట కనిష్టపడుచుండుటఁజూచి విధిలేక యాతఁ డూరకుండుచుండెను. ఆమెకొఱకు హారకుమారబాబు చాలసొమ్మును వెచ్చపెట్టెను గాని యందుకొఱకు కొంతని కేమియుఁ జింతలేదు.

ఒకనాఁటిసాయంకాలమున హారకుమారబాబు హాసునింటి లోనికేఁగి "అమ్మా! ఎక్కడనున్నావు?" అని పిలిచెను.

తత్క్షణమే యొకగదిలోనుండిలజ్జావనతవదనయై యాపురస్త్రీవితసుందరీమణి యరుదెంచి భక్తితో నాయనకు నమస్కరించి యొకపీట వేసి యాయనను గూర్చుండుమని వేఁడికొనియెను. హారకుమారబాబాపీఠమునఁ గూరుచుండెను.. తరువాత నామె మెల్లమెల్లఁగాఁ దనవస్త్రాంచలమును బట్టుకొని యన్యమనస్కయై యాకొంగును వ్రేలికిఁ జెనవేసికొనుచు మరలవిప్పికొనుచు "బాబా! కొన్నిదినములనుండి యొకమాట మిమ్మడుగవలయునని యనుకొనుచుందును. కాని, మీచనువును మీద నెయుఁజూచి యడుగఁజాలియు నామాటను నడుగలేకున్నాను. కాని, యెల్లుండినను సరియే, యడుగుటకు నిశ్చయించుకొంటిని." అనిపలికెను.

హార—(సస్నేహదృష్టితో) అమ్మా! ఏమాటనైననసరే; నన్నడుగుట కింతసందేహ మెందుకమ్మా? ఆమాటయేమో యడుగుము తల్లీ!

సుందరి—(కొంచెముసేపు నిర్ముఖియై తరువాత సాహసించి) ఇత్తము తా మెన్నిదినము లిట్లు కనిపెట్టుకొనియుండెదరు?

హార—తల్లికొఱకు బిడ్డ యెన్నిదినములైనను గనిపెట్టుకొని యుండగలఁడు. ఏబిడ్డయు నందుకొఱకు భయపడఁడు; మఱియొకలాగున

మనస్సులోనైన ననుకొనఁడు. అమ్మా! నీకెన్ని దినము లవసరమైన నన్ని దినములు, ముఖ్యముగా నానందముతో నావలన సంరక్షణనందుము!

సుంద—మీ ప్రియత్నమునకును, అనుగ్రహమునకును మేర లేదు. కాని, నాకును ననేకస్థానములయం దనేకు లాత్మీయులు గలరు; వారెవ్వరికిని సమాచారము తెలియకయే నేనిట్లు దుఃఖితనై పడియున్నాను. అందుచేఁ దా మనుమతించినచో నే నేబందుగులదగ్గఱకైన వెడలెదను.

హారకుమారశా బీసుందరివృత్తాంతమును దెలిసికొనుటకు మిక్కిలి తొందరఁజెందుచుండెను. ఆతఁ డిప్పుడు,—"ఈమె స్వేచ్ఛగాఁ దనవృత్తాంతము నెట్లును జెప్పదు. అందుచేఁ గౌశలమున నీమెసంగతిఁ దెలిసికొనుట తప్పుగాదు." అని భావించుకొని యామెతో నిట్లనియెను. "అమ్మా! మంచిదే. అందుకు నాకుఁ జాలసంతోషమే. నీ వెక్కడకు, నే బంధువులయొద్దకు వెడలవలయునో చెప్పుము. నేను నిన్ను వెంటఁబెట్టుకొని వెళ్లి యక్కడ సురక్షితముగాఁ జేర్చివచ్చెదను."

ఆతనిమాటల కెట్లు సమాధానము చెప్పవలయునని యామె యాలోచింపఁజొచ్చెను. ఏబంధువుల పేరు చెప్పినను దనవృత్తాంతము తెలిసిపోఁ గలదని యామె యనుకొనియెను. లేక యీవిధముగా నిక్కడనే యున్నచోఁ దనయుద్దేశము నెఱవేరదు. అందుచే నామె కేమియుఁ దోఁటలేదు. కొంతసే పాలోచించి తుద కిట్లామె యాతని నడిగెను. "నేనొరిగాఁబోవుటకు సెలవొసఁగుఁడు."

"హారకుమారశా బించుకనవ్వి, అమ్మా! అదియెట్లు? అజ్ఞునివలె నేనట్లు చేయఁగలనా? కాని, యెందుకమ్మా! నీవు నాయొద్ద వృత్తాంతమును దాఁచియుంచెదవు? నాకు నీవృత్తాంతముఁ దెలుపుట నీకు మేలుగాని కీడెన్నటికిని సంభవింపదు. నేను బాగుగా నెఱుఁగుదు నీవు చాలమర్యాదగలయింటిబిడ్డవు. నీస్వభావము నీచరిత్రము

యుఁ జాలమంచివి; నిశ్చయముగా నేదియో దైవదుర్విపాకమువలన నీకీయవస్థ తటస్థమైనది. తల్లీ! నాకు నీవృత్తాంతమంతయుఁ జెప్పుము. నేను బాగుగా నాలోచించి ముఖ్యముగా నీకెట్లుభద్రముగునో యట్లగుటకుఁ గావలసినప్రయత్నములు నాశక్తికొలఁది చేసెదను" అనిచెప్పెను.

సుంద.—నామాట యెవ్వరును నమ్మరు. మీరును నావృత్తాంతము వినినచో విశ్వసింపరు. నాజీవనమునం దేతప్పుపనియుఁ జేయలేదు; కాని, నాయదృష్టదోషముచేతనో, బుద్ధిదోషముచేతనో నాపనులన్నియుఁ దప్పులుగాఁ బరిగణింపఁబడినవి. ఎట్టిసుఖముకొఱకాసించి నేనింతవఱకును జీవించియున్నానో, అదినాజీవితమునం దెక్కడ నెట్లును లభించునని నాకు విశ్వాసములేదు. ఇట్టియవస్థలో నేను మరణించుటయే మంగళకరమైనసంగతి. కాని, నేనేమైననుసరే; నాకొఱకు మఱి యొకదురదృష్టవ్యక్తి చిరదుఃఖములఁ బడవలసివచ్చునని చూచుచున్నాను. నేను నాకొఱకెప్పు డేమియు నాలోచించుటలేదు;ఒక్కమాఱా వ్యక్తిసమాచారమును వినుటకుమాత్ర మాందోళితురాల నగుచున్నాను. ఇంక నాకేమియుఁ గోరికలేదు. మంచియైనను సరే, చెడ్డయైననుసరే;ఒక్కమాఱా వ్యక్తిసమాచారమునుమాత్రము విని నేనిఁకఁ బ్రాణత్యాగముఁగావించెద నందుచేఁ దాను నాకుసెలవొసంగుఁడు.

హర.—అమ్మా! ఆత్మహత్యయనుమాట యెన్నఁడును మనస్సునఁ గొనుటయుఁ గూడదు. నీ వెవ్వరిసమాచారముకొఱకు వ్యాకులవగుచున్నావో చెప్పుము? నేనిప్పుడే దానిని దెలిసికొనుట కుపాయముచేసెదను. నాకు భృత్యులున్నారు. ఈగ్రామమునవారందఱును ననుకూలురే. అనేకులు నాకుఁబరిచయులునున్నారు. ఆత్మీయులును బంధుగులును గలరు. ఈప్రాంతములయందు గుటుంబములతో మావారలున్నారు. ధనముగూడ నాచేతఁగావలసినంతకలదు. ఇప్పుడు నాకు వృత్తాంతమంతయుఁ జెప్పినచో నావలన నీకుఁగావలసినంతయుపకారము నగును.

సుందరి యధోవదనయై చింతింపఁజొచ్చెను. హారకుమార బాబు మరల నిట్లనియెను—"చూడుము, అమ్మా! నేను నీబిడ్డను. తల్లి యెప్పుడును బిడ్డయెడల నవిశ్వాసము చూపరాదు. బిడ్డయుఁదల్లియెడల నవిశ్వాసముతో నడఁజాలఁడు. ఇతరులు నీమాట విశ్వసించెదరో, లేదో గాని, నేనెప్పుడును నీమాట సంపూర్ణముగా విశ్వసింపఁగలను. అందులకు సందేహ మెంతమాత్రమును లేదు. అమ్మా! నీయాకృతి, నీప్రవర్తనము, నీమాటలు నేనిన్నిదినములనుండియుఁ బరిశీలించుకొనుచుంటిని—నీయట్టిసుశీల యీప్రపంచములో లభించుట దుర్లభమని తెలిసికొంటిని. అమ్మా! ఇఁక నన్ను నీవెందుల కిట్లు విశ్వసింపక కష్టపెట్టెదవు?"

అయినను సుందరి మాటాడలేదు. హారకుమారబాబు మరల నిట్లనియెను—"అమ్మా! కాని, నీవిప్పుడు చేయుచున్నపని నిష్ప్రయోజనమైనది. నేఁడుగాని, రేపుగాని, లేక, పదిదినములైనతరువాతఁగాని నీవృత్తాంతమును దెలిసికొనఁగలనుగదా? నేనీయల్పవయస్కురాలైనబిడ్డను నిస్సహాయురాలినిగా నేకాకినిగా విడిచి పోఁజాలకున్నాను. నిన్ను నావెంటఁ గాశికైనను దీసికొనిపోవలయును; నాపరివారజనులయొద్దనైన నుంపవలయును. కాకున్న నీదేశమునందు నీయాత్మీయులు తటస్థించిచో వారికడ నిన్నుఁబ్రవేశపెట్టుటకైనఁబ్రయత్నింపవలయును. ఎట్లయిన నగుఁగాక! నీవృత్తాంత మిన్నిదినములనుండి నాయొద్ద నెందుదులకు మఱుఁగుపఱచితివో తెలియఁబఱచుట మంచిదే యగునుగాయుంచుకయుఁ జెడ్డదికాదు. అట్లుగాక నీకు నీవృత్తాంతము నాకెఱింగించుట బొత్తిగా ననిష్టమైనచో నేను నిన్నావిషయములో నిఁక మరల మరలఁ బ్రార్థింపనేప్రార్థింపను."

హారకుమారబాబు మాటాడక యూరకుండెను. సుందరి యినియెను—"నన్నుమీరు "అమ్మా!"యని పిలుచుచున్నారు. తండ్రివ

సంరక్షించుచున్నారు. నాకొఱకనేక క్లేశములను బొందుచున్నారు. మీరు మహాత్ములు. మీసన్నిధిని నావృత్తాంతమంతయుఁ జెప్పుకొందును. విశ్వసింపుఁడు; మానుఁడు. అదృష్టమెట్లున్ననుసరే; నేను మీయొద్ద నించుకయు దాఁపను. తాము సోనాపురమునందలిసార్వభౌమభట్టాచార్యమహాశయులపేరు వినియున్నారా ?"

హరికుమారుఁడు దద్దరిల్లెను. విస్మయముతో నిట్లనియెను—"అమ్మా ! అట్లయిన నీవు సార్వభౌమభట్టాచార్యునికోడలవా ? నవీనకృష్ణునిసహధర్మిణివా !"

ఆసుందరి మోమును జేతులతోఁగప్పుకొని రోదనముచేయుచు గద్గదకంఠముతో నిట్లనియెను—మీ రెట్లెఱింగితిరి ? ఈయభాగ్యురాలి కాగౌరవము కొన్నినాళ్ళున్నమాట నిజమే; ఇప్పుడు మామగారు నన్నుఁ బరిత్యజించిరి. కాని, తామీవృత్తాంత మెట్లులెఱింగితిరి ?

హర—శ్యామలాలుని దౌరాత్మ్యమున్నగున వన్నియు నేనెఱుగుదునమ్మా ! నీమామగారును భర్తయు నిప్పుడు కాశీపట్టణమునకు వచ్చియున్నారు. వారు క్షేమముగా నున్నారు. నీవు నాకు మిక్కిలి ...మాత్మీయురాలవు. ఏమియు భయముఁజెందవలదు. అమ్మా ! సంకోచింపక యేమేమిజరిగెనో అన్నియునాకెఱింగింపుము. నిశ్చయముగా నీవ్యవహారము సకలవిధములచేతను జక్కఁబఱిచెదను.

అప్పు డాసుందరి యొక్కొక్కటిచొప్పున జరిగినసమాచారము ...నియు హరకుమారబాబునకు విశదపఱిచెను. శ్యామలాలునిచేఁ బంపఁ...సదూతి వచ్చుటయు,మామగారునుభర్తయుఁదన్నురక్షించుటకై సమ...యుండుటయు, గదాచాండాలుఁడాభరణములయందలియాసచేఁ ...న్న విలాసపురమునం దొకరియింటఁ జేర్చుటయు, నాకుటుంబమువారు ...యెడల ననాదరముఁజూపుటయు, దాసితోఁ బరిచయముగల్గి చండీత

లగ్రామమునందు గైవర్తనియింట నాశ్రయము లభించుటయు, మరల గదునిసాహాయ్యముచేమామగారిసన్నిధి కేఁగుటకుఁ బ్రయత్నించుటయు, మార్గమధ్యమునం దెఱుఁగనివారెవ్వరో తమ్మాక్రమించుటయు, దాసీ భర్త రామహరి విశేషాఘాతముచేఁబడిపోవుటయు, నా యెఱుఁగనివారెవ్వరో దాసినిఁదన్నుఁగట్టి నౌకలోఁబెట్టుటయు, నౌక మునిఁగిపోవుటయు, కనివిని యెఱుంగనియుపాయముచేఁ దానిట్లుజీవించుటయు, మొదలగువృత్తాంతములన్నియు నామె యాయన కెఱింగించెను. ఈవృత్తాంతములన్నియుఁ జెప్పుటయైనతరువాత నామె మరలనిట్లుచెప్పఁజొచ్చెను--“నాకేమిగావలయునో యంతయునైనది; కాని, నాకొఱకు రామహరియు దాసియు నిష్కారణముగా మరణించిరి. వారికొఱకు నేనెంతయుఁ జింతించుచుంటిని”

హరి—అమ్మా! నిన్నుఁ జూచి, నీనోట నీసకలవృత్తాంతము వినఁగల్గుటవలన నేఁడు నాకెట్టియానందముగల్గినదో యట్టియానందము నాజన్మమధ్యములో నెప్పుడైనను నాకు లభించెనో లేదో చెప్పఁజాలను. నీమామగారును నేను నేకహృదయముచేఁ గట్టఁబడినవారము. అమ్మా! నీవు నావృత్తాంతము వినినచో నన్ను నీవు గ్రహింపఁగలవు. నేను పూర్వము శ్యామలాలునొద్ద దివానుగా నున్నవాఁడను.

సుహాసిని తనమేలిముసుఁగును మఱియించుక దిగలాగుచు——“నిజముగా మీరేమామగారు. నేనెఱుంగుదును. మీరును మామామగారును బరమాప్తులు. నేను ముందుగా నెఱుఁగకపోవుటచే మీతోనిట్లు నిర్భయముగా మాటాడి యపరాధముఁగావించుకొంటిని” అని యూరకుండెను.

హరి—అమ్మా! మిక్కిలిమంచిపని చేసితివి. నిన్నుఁజూడఁగన్ నీనోట సకలవృత్తాంతమును వినఁగల్గుటచేతనే, నేనన్నివ్యాపారములను

జక్కఁబఱుపఁగలనని ధైర్యముతో నున్నాను. నీకేచింతయు వలదుతల్లీ ! నేను శీఘ్రముగా రామహరికై వర్తువృత్తాంత మంతయు రాఁబట్టెదను; ఏవిధముగా నిన్ను నీమామగారు నిస్సంకోచముగా నాదరింపఁగలరో యాసుస్థితిని గల్గించెదను. నీయట్టికోడ లనేకజన్మములసుకృతిఫలముచే తనే గల్గును. ప్రపంచములో మంచివారికే యనేకకష్టములు గలుగును. సీత, సావిత్రి, దమయంతిమొదలగువారందఱుఁ గష్టములుపొందిరి. అనేకకష్టములమధ్యమున ధర్మమును రక్షించుకొనఁగల్గుటే మహత్త్వము. నీవు బాలికవైయుండియు, నత్యంతప్రయత్నముతో ధర్మధనమును జెక్కుచెదరకుండ రక్షించి మహత్త్వమును యథేష్టముగాఁ బ్రకటించుకొంటివి. అమ్మా! ఇఁక నీకష్టము లంతమగును. ఎవ్వరికష్టములు నెప్పుడును జిరకాలముండవు.

సుహాసిని మోమువంచికొని యేడువఁజొచ్చెను. ఈసమయమున నెవ్వరో వాకిటనుండి "హుజూర్, లోపలనున్నారా ?" అని పిలిచిరి.

హార — జరిఫ్ ! వచ్చుచున్నానుండుము.

పిమ్మట హారకుమారుఁడు సుహాసినినిజూచి "అమ్మా ! నన్నిప్పుడు పిలిచినవాఁడు శ్యామలాలుబాబు నౌకరు. ఈవిషయములో నీకనేకసంగతులు చెప్పవలసియున్నది. ఇంకొకప్పుడు వానిని జెప్పెదను." అని హారకుమారుఁడు వెళ్ళిపోయెను.



మూఁడవప్రకరణము.



సంవాదము.

హారకుమారుఁడు వాకట నిల్వఁబడియుండఁగా ముసలిజరిఫ్ నౌకరు వచ్చి సలాముచేసి యిట్లుచెప్పఁజొచ్చెను—"ధర్మావతారా ! ప్రయత్నముల కేమియు లోటుచేయలేదు. కాని, ఫలమేమియు లేకపోయెను."

హర.—నీవు చాలశ్రమపడిన ట్లగపడుచున్నావు. దినమంతయు నన్నపానములు లేనట్లున్నావు. వాలకమాత్రయు బాగుగాలేదు. నీవిప్పుడు విశ్రమింపుము; కొంచెము భోజనపానీయములు చూచుకొనుము తరువాత సంగతులన్నియు వినవచ్చును.

హరీశకుమారునియుండ అచావడిలో నొకగదియున్నది; హరీశునితో బాగుగాబరిచయముగల్గినతరువాత హరకుమారుబా బాచిన్నగదిని తనకించుక సేపు కచ్చేరీగదికిక్రింద వాడుకొనుట కిమ్మని యడిగి పుచ్చుకొనియెను. హరకుమారుడిప్పు డాగదిలో మంచముపైబండియుండగా కోచిమానొకకంబళిని బఱచుకొని యాయనసామీప్యమున గదికి వలబరుండెను. తరువాత నాతడిట్లనియెను—వాడు చాల దగాకోరు; అసత్యవాది; జ్ఞానహీనుడు; వానిమూలమున నేపనిగాని సంగ్రహించుట నాకు సాధ్యముగాదు. హుజూరుహరీశ్వరి సాధ్యా

హర.—అయినను నీవు వానిని గలిసికొంటివి. వానిని జూచితివి. మంచిది. ఇది యొకశుభవర్తమానమే. కాని, చాలనాళ్ళవలన నాతడు గంగామణిచెల్లెలికుమారుడని తెలియవచ్చినది. గంగామణి మైదేండ్లకుముందే మరణించెను. ఈచెల్లెలికుమారుడు డా నెవడగ్గఱనే యుండెను; పినతల్లిమరణించిన వెనుక నాతడు రామనగరమువిడిచి రాధానగరమునకు వచ్చి వాసముచేయుచుండెను. గంగామణి కొక యిల్లు, కొంతపత్రిసామగ్రి, యొకటిరెండాభరణములు, కొంతడబ్బు నుండెను. అవియన్నియు జెల్లెలికుమారునకే యంటినవి; ఆతడిల్లును గాకితపుకట్టలును మాత్రము రామనగరములో వదలివేసి రాధానగరమున కేగెను. ఇక డాతని కేమియులేదు; నల్లమందుమొదలగు వాని కన్నియు వ్యయపఱచివేసినాడు. అయినచో నిచట నాతనికి నివసించుటకైనను జో లేదా ?

జరిఫ్—ఏమియు లేదు. పగలంతయు వీథుల వెంబడిఁ దిరిగితిరిగి, తుద్రిలు గాద్రిమములో నెవ్వరివీథియరుగుమీఁదనో పరుండుచుండును. గాయణిదగ్గఱనున్న కాగితపుగట్టలు చూతద్రిమీయభాగ్యుఁడుసంగ్రహిం దు; సంగ్రహింపను లేఁడు.

హార—జరిఫ్ ! కాగితములసంగతి నీవు వానివలన వింటివా ?

జరిఫ్—చిత్తము. లేదు. నేను వానితో నేమియు మాటాడనే దు. వాఁడు భయపడి పాఱిపోవునేమోయని శంకించి నేను వానితో టాడుటకుఁ బ్రయత్నింపనేలేదు. హుజూరువారు వానినిఁజూచినపి ట నేమి సెలవిచ్చెదరో యదియే చేయవచ్చునని నిశ్చయించుకొని, వాని నేమియుఁ గదపలేదు. కాని, వాఁడాకాగితములనే సంగ్రహించినచో నీపాటి కవియన్నియు నష్టపఱిచియే యుండునని నేననుకొనుచున్నాను.

హార—వాఁడట్లు భయపడుటకుఁ గారణమేమి ? అది తెలిసికొంటివా ?

జరిఫ్—అదియు నొకవిధముగాఁ దెలిసికొంటిని. గంగామణి దరి కింకొకకుమారుఁ డున్నాఁడఁట. ఆతనిపేరు రామచంద్రుఁడు. ఆతఁ ప్పుడు మంచియుద్యోగ మేదియో చేసికొనుచున్నాఁడఁట. ఆతనిస్థితియు గుగానేయున్నదఁట. పినతల్లిసామాన్యసంపత్తికొఱ కాతఁడెప్పుడు శింపలేదు—ఆమె యాతని కేమియు నీయనులేదు. తరువాతనైన తఁడాయాస్తికొఱ కేమియుఁ జర్యజరపలేదు. గంగామణి జీవించియు ంతకాలము రామచంద్రుఁడాపినతల్లికష్టసుఖములకొఱ కప్పుడప్పు మన సొమ్ము పంపుచుండెడివాఁడు; ఆమె యోగక్షేమములు చూచుచుం డెవాఁడు. నాఁడి యిప్పుడే క్రొత్తవానినిఁజూచినను రామచంద్రుఁడు

పినతల్లియా స్త్రీకొఱకుఁ దనయొద్ద కానుమనుష్యునిమూలమున వర్తమానమంపెనని యే భావించుచుండెను.

హార—(ఇంచుక నవ్వి) జరిఫ్! నీకష్టము ఫలించినది. నీవు ప్రయోజనకరములగు ననేకసంగతులను సంపాదించుకొనివచ్చితివి. ఇట్టి పెద్దపెద్దసంగతు లింతసులభముగఁ దెలియఁగలవని నేనెప్పుడు నాశింపలేదు. గంగామణి, రామనగరము, అను రెండుపేరులుమాత్రము పట్టుకొని నేనిక్కడకువచ్చితిని. ఏరామనగరములో నాకార్యముసిద్ధింపఁగలదో అదియు నేనెఱుంగను. ఈమా రీరామనగరమే నేను వెదకుచున్న రామనగరమని నిశ్చయమైనది. గంగామణివృత్తాంతమును దొరకినది. ఇవియన్నియు శుభలక్షణములని చెప్పవచ్చును. ఇఁక నేను హతాశుఁడను గానక్కఱలేదు.

జరిఫ్—హుజూర్! కాని, నేనింకేమియుఁ దెలిసికొనఁజాలక పోయితిని. దైవ మింక నేమిచేయునో? నామనస్సులో నేమియు ధైర్యములేదు. కాని, హుజూరు వారిబుద్ధివిశేష మింక నెవ్వరికిని లేదు. హుజూరువా రెప్పుడిది బాగుపడునని గ్రహించితిరో, అప్పుడు సకలవిధములఁ గార్యములు చక్కఁబడఁగలవని నాకు నమ్మకమున్నది.

హార—కార్యములు చక్కఁబడుటకు సందేహ మేమియులేదు. ఆబాలుని యాకారప్రకార మంతయు దేవతాసదృశము; ఆతనియదృష్టమునం దనేకసుఖసంపద లనుభవింప వలసియున్నది. నిజముగా నాతనివంశవృత్తాంతమంతయు నేను బ్రకటనము సేయఁగలను. ఈవిషయము నందు మహాపురుషుఁడును నన్నాశీర్వదించెను. హృదయ మాశను సూచించుచున్నది; అవశ్యముగా నేను గార్యసాఫల్యమందఁగలను. నీప్రాం ప్రభువుగా రేమైన వర్తమానమంపినారా?

జరిఫ్—నేను ఆబాబుచెప్పిననాఁటినుండియు, మఱియేవర్తమా

ు వచ్చుటలేదు—రావలయునని కోర్కెయు లేదు. కాని, ఒక్కమాట
ాత్రము విన్నాను. రాణియు హరిచరణుండును బశ్చిమదేశయాత్రకుఁ
ోయిరనియును, శ్యామలాలుబాబే కాకిన్ యై యింటఁ బడియుండి సకల
ారవస్థలు ననుభవించు చున్నాఁడనియును. ఆతనికిచ్చు వెచ్చములనిమి
ము పదునైదురూప్యములుమాత్రమె మొసఁగుచున్నారఁట. అవియు
ాతనిచేతికి రావఁట. రామఖానునొద్ద నుండునఁట. బండ్లు,గుఱ్ఱములు,
ుంగులు సమస్తము నమ్ముడువడిపోయినవి. పెద్దపెద్దపత్రములన్నియు
ాణి వెంటఁబెట్టుకొనిపోయెను. కొన్ని విక్రయించివేసిరి. సామాన్యమై
తాయి,అప్ప, గిన్నె, చెంబు మొదలగునవిమాత్రమింటఁబడియున్నవి.
ాసదాసీజనులందఱును నెక్కడెక్కడికో వెడలిపోయిరి. ఒక గుమాస్తా
ును, ఒక మేనేజరునుమాత్రమున్నారు. ఇంటికావలికొఱకు నల్వురు
ాకరులున్నారు; బంగారువంటిసంసారము పాడైపోయినది. శ్యామలా
ుర్దశకు మేర లేదు.

హరకుమారబాబు దీర్ఘనిశ్వాసమువిడిచి యిట్లనియెను—"ఏది
ట్లుజరుగవలయునో, అదియట్లేజరిగినది. అందుకొఱకు దుఃఖింపవలసి
ని యేమియు లేదు. నేనిప్పుడు నీభోజనమునకుఁ బ్రయత్నము చేసెద
" అనియెను.

జరిఫ్ భోజనాదులు సాంతముగావించుకొనియెను; హరకుమార
బు వానిని దగ్గఱకుఁ బిలిచి సుహాసినిపరిచయముగల్గించి, యామెవృ
ంతము, నితరవృత్తాంతములు నెఱింగించెను. "ఇప్పుడెట్లయినను సత్వ
ుగా గదాచాండాలునిబట్టుకొనవలయును; నేఁడీభారము నీపైఁబెట్టి
ు నిశ్చింతగానుండఁగలను." అనియుఁ జెప్పెను.

జరిఫ్—(ఆనందమును వెలిపుచ్చుచు) ఈపని నేను సులభము
ఁ గొనసాగింపఁగలను. గదుఁడెక్కడ నున్నాఁడో నేనెఱుఁగుదును,
ని శీఘ్రముగాఁ బట్టితెచ్చి హుజూరుసన్నిధిని బెట్టెదను.

జరిఫ్ వెడలిపోవుటకుఁ బ్రియత్నించుచుండఁగా హారకుమారుఁడు చూచి "ఎక్కడికేఁగెదవు?" అని యడిగెను.

జరిఫ్—గదుని వెదుకుటకు.

హార—ఇప్పుడే?

జరిఫ్—ఆలస్యముచేసిన లాభములేదు. చేయివిడిచిన గాని మగునా? రేపటియుదయమునకుఁ దిరిగి రాఁగలను. గదునిబట్టుకొన లగనని యాశగానున్నది.

హార—నేఁడు చాలనలసియుంటివిగదా; రేపుపోరాదా?

జరిఫ్—హుజూరువారియాజ్ఞ వినినతోడనే శరీరాయాసము యినది. నేను త్వరలోవచ్చెదను.

భయవినయములతో నమస్కరించి జరిఫ్ హారకుమారుని సెలవుగొని వెడలిపోయెను. హారకుమారుఁడు వానిని లోలోనఁ జాలమెచ్చుకొనఁజొచ్చెను.

జరిఫ్ చెప్పినమాట సత్యమే; అతఁడిప్పుడు గదునిసులభముగాఁ బట్టుకొనఁగలమాటనిజమే. కాని, గదుఁడిప్పుడు చాలదుర్దశలోఁ బడియున్నాఁడు. వాఁడిప్పుడు పోలీసువారియధీనమునందున్నాఁడు. సుహాసిని యిచ్చినయాభరణములన్నియు వాఁడు సర్వనాశనముగావించెను. ఆయలంకారములన్నియు గదుఁడనేకస్థలములయందు విక్రయించుటకుఁ జూపించుచుండెను. ఎవ్వరెవ్వరియొద్దకు దొంగనగలను వాఁడు పట్టుకొనివెళ్లెనో వారందఱును వానికి నూఱురూప్యములకంటె నెక్కుడుధన మీయమని చెప్పుచుండిరి. ఇంతకెక్కువపోయున్న కమ్ముట యుచితము గాదని గదుఁడు బాగుగనెఱుంగును. విశేషించియవియన్నియుదొంగనగలునుగాను. గదుఁడు నిర్భయముగ నొక్కొక్కనగయే క్రమక్రమముగా గృహస్థులయొద్దకడ విక్రయించుటకుఁ బ్రయత్నించెను.. ఆసంగతి

ముగా నందఱకును దెలియవచ్చెను. గదునిచేతిలో నీయాభర
ను జూచినవారందఱును, అవిచోరవస్తువులనియే యనుకొనఁజొచ్చి
లీసువారి కీసమాచారము తెలియఁగనే గదునిబట్టుకొనిరి. గదుఁ
సార్వభౌమభట్టాచార్యునికోడలు తనకీసకలవస్తువులను సమాధాన
ూకముగా నిచ్చియున్నదని యుద్దేశించియున్నాఁడు. పోలీసువారును
నపుజలును, అలంకారములన్నియు సార్వభౌమభట్టాచార్యునికోడ
యినఁ గావచ్చును. కాని, యిన్నియలంకారములామె వీనికిచ్చుట
ంపఁదగినమాటగాదని నిశ్చయించుకొనిరి. విశేషించి యామె యు
లేదో యనిగూడ సందేహించిరి. ఇట్టిస్థితిలో గదునివిడిచిపుచ్చుట
దుపాయము. ఎవ్వరీయాభరణములను దనకు దానమిచ్చిరో, ఆ
ి రుజువుపఱచుకొనఁగల్గినచో గదుని వారిప్పుడే విడచిపెట్టవచ్చు
ట్లుగానిచో దరువాత ధర్మాధికారియొద్దనైన నీసంగతి తెలియఁ
గల్గినచో గదుఁడు నిర్భయముగా నావలకుఁ బోఁగలఁడు. కాని,
గష్టమైనమాట; ఏమన, గదుఁడు సుహాసిని చచ్చిపోయినదని యె
ను. హరిచరణుఁడు సుహాసిని యెక్కడనున్నదో కని పెట్టుమని గ
ంధించెను. ఇందుచేతనే గదుఁడు సుహాసినియున్నచోటికి వెళ్ళెను.
సమయమునందే రామహరి గదునిఁజూచుటకుఁ బ్రయత్నించెను. రా
ి గదునిగలిసికొని సమాచారమంతయుఁ జెప్పినతరువాత గదా
కాలుఁడు హరిచరణునియొద్దకేగి యావృత్తాంతమంతయు నెఱిఁగిం
సుహాసినిని బలవంతముగాఁ బట్టితెమ్మని హరిచరణుఁడు మార్గమ
నఁ గొందఱుదుష్టులను గాపుంచెను. ఏమ్మాట గదుఁడు సుహాసినిని
, రామహరిని బండిపైఁ దీసికొనివచ్చుచున్నప్పుడేమిజరిగినదో వా
లెఱుఁగనేయెఱుఁగుదురు. హరిచరణుని దూతలు సుహాసినిని చాసి
తీరమువఱకు లాగుకొనివచ్చి యొకనౌకలోఁబడ వేసిరి. అర్ధరాత్రి
దానౌక మునిఁగిపోయెను. గదుఁడు తనకన్నులతో, సుహాసిని

నీటమునిఁగిపోవుటఁజూచెను——మరల లేచుటఁజూడలేదు. ఆమె నీట మ
ణించెనని గదుఁడు నిశ్చయించుకొనియెను. అందుచే గదుఁడిప్పుడు స
హాసిని తనకు నగలన్నియు నిచ్చినసంగతి యెట్లు రుజువుపఱుచుకొనఁగలఁడు
ఆమె యొకవేళ బ్రతికియుండి యీనగలు తానిచ్చినట్లు సమ్మతించిననే
దానికి సాక్షులులేరు. అందుచే గదుఁడిప్పుడీచిక్కులోనుండి తప్పించుకొ
నుటకు దారిలేక కొట్టుకొనుచున్నాఁడు.

సరిగా నీసమయమునకే జరిఫ్ కోచిమాను గదుఁడున్నచోటి
వచ్చెను. అతఁడాసంగతియంతయుఁ దెలిసికొని, యలంకారములసహి
ముగా గదుని దనతోఁ దీసికొనిరమ్మని పోలీసువారికిఁ జెప్పెను. జరి
అందఱకును బరిచితుఁడే. ఆతఁడెప్పుడు నిజవృత్తాంతమంతయుఁ జెప్పఁగలి
గెనో అప్పుడతఁడు చెప్పినట్లు చేయుటవలనిహాని యేమియు లేదని పో
లీసువారనుకొనిరి; ఒక హెడ్డును, ఇద్దఱుకానిస్టేబులును నగలతో గద
ని వెంటఁబెట్టుకొని సనాతనపురమందున్న హారీసునియింటికి వచ్చిరి. అ
క్కడ హరకుమారబాబునుజూచి పోలీసులును గదుఁడునుగూడ ససం
భ్రములైపోయిరి.

హరకుమారునివలన, జరిగినసమాచారమంతయు విని, నగలన్ని
టినిజూచి సుహాసిని తత్క్షణమే యాయాభరణములన్నిటిని గదాచాంద
లునకు దానమొసఁగవలయునని నిశ్చయించుకొనియెను. ఆమె యట్లే
కావించెను. వాఁడు చేసినయుపకారమునకీయలంకారదానము చాల
చాలదు. ఇఁకఁ బోలీసువారుచేయవలసిన దేమున్నది! గదునివిడిచిప్పు
వారు పోవలసియుందురుగదా.

హారకుమార బా బీయలంకారములన్నియుఁ దాను కొనియెదన
ెప్పెను. ఒకనూటయిరూపాయలకంటె గదునకు వానివలన నెక్కుడు
మ్మురాఁజాలకపోయెనుగనుకఁ దాను రెండునూటలిచ్చెదనని హార
మారుఁడు చెప్పెను. గదుఁడు పరమానందముతో నా రెండువందల
పాయలనుబరిగ్రహించెను.

గదుఁ డక్కడనుండి వెళ్ళిపోఁబోవుచున్నప్పుడు హారకుమారుఁడు
నినిబిలిచి "పనిగలిగినప్పుడు నీకు వర్తమానముచేసెదను. నీవు తప్ప
ావలయు"నని చెప్పి కట్టుదిట్టముచేసి పంపించెను.



# స్త్రీలవ్రతకథలు.

(బాలాంత్రపు వేంకటరావుచే రచింపఁబడినవి.)

ఇవి బాలికలకును స్త్రీలకందఱకును అత్యంత ఉపయుక్తములుగ నుండునట్లు రచింపఁబడినవి. ఆంధ్రులలో నోములు పట్టని స్త్రీలుండరు. పూర్వమువలెకథలు వచ్చిన పెద్దముత్తయిదువులు లేని యీయిరువదియవశతాబ్దిని, స్త్రీలలో విద్యవ్యాపించుచున్న యిప్పుడు స్త్రీలందఱును సులభముగఁ జదువుకొని యీనోములుపట్టుటకై సులభశైలిని రచింపఁబడినవి. ఎంతకాలముక్రిందటనో 1-2 కూర్పులు చెల్లిపోయినవి. మరల మూఁడవకూర్పు ముద్రించినాము.

ఇవి రెండుభాగములు. భాగమునకు 32 నోములు (ఉద్యా ములసహా) చొప్పున రెండుభాగములలోను 64 నోములు కలవు. భాగము 1 కి 0—6—0 పోస్టేజి కొనువారే భరింపవలెను. 1— భాగములు వెలకు సిద్ధముగ నున్నవి

## ప్రకటనము

నాచే రచింపఁబడిన ఈస్త్రీలవ్రతకథలు 1-2 భాగములకు 1 సంవత్సరపు రివైజ్డు కాపీరైటు ఆక్టుప్రకారము నేను సంపూర్ణ పీరైటు కలిగియున్నాను. ఈపుస్తకములను నా అనుమతి పొంద నాకు తెలియకుండా కొందఱు ముద్రించియున్నారు. తరువాత దెలిసి వారిపై క్రిమినల్ సివిల్ చర్యలుతీసికొన్నాను. కాబట్టియీనా పుస్తకములను నాలిఖిత రూపమైన అనుమతి పొందకుండా గ్రంథ యునుగాని, అందులోని భాగములనుగాని, ఎవ్వరును ముద్రింక డదని యిందుమూలముగాఁ దెలియచేయుడమైనది. దీని నతిక్రమించి నడచువారిపై కాపీరైటు ఆక్టు ప్రకారము చర్యజరిపి వారు గలుగ యాపత్తు నష్టములు రాఁబట్టుకోవడమగును.

ది 22-12-1926,
పిఠాపురము,
తూర్పుగోదావరిజిల్లా

బాలాంత్రపు వేంకటరావు,
గ్రంథకర్త అండ్ ప్రకాశకుఁడు,
పిఠాపురము.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B184 |
| పుస్తకం పేరు | యోగేశ్వరి 01 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 215 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 193 to 198 |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |